# జుట్టు రాలడం, చుండ్రు అనే సమస్యలు మీ దరి చేర కూడదనుకుంటే?

## అశ్విని హోమియో హెయిర్ ఆయిల్ ప్రతి రోజు వాడండి.

### వాడిన వారి అభిప్రాయము

గౌరవనీయులైన అశ్విని హెయిర్ ఆయిల్ ఉత్పత్తి దారులకు,

నేను గత కొన్ని నెలలుగా చుండ్రు బాధతో ఉన్నాను. దీనివలన చదువు యందు జ్ఞాపకశక్తి ఉండేది కాదు. ఎప్పుడూ టెన్షన్‌గా ఉండేవాడిని. మా ఫ్రెండ్ ఒకడు అశ్విని హెయిర్ ఆయిల్ వాడమని చెప్పాడు. అంతే నేను అశ్వినిని వాడుతున్నాను. చుండ్రు పూర్తిగా పోయింది. ఇప్పుడు టెన్షన్ లేకుండా మెదడు చల్లగా ఉంది. ఇంత మంచి హెయిర్ ఆయిల్ ఉత్పత్తి చేసిన మీకు నా కృతజ్ఞతలు.

పాణిగ్రాహి రాజశేఖర్, II B.Com.,
విజయవాడ

### ఇతర లాభాలు

- జుట్టు ఒత్తుగా, మృదువుగా, ఆరోగ్యంగా పెరిగేందుకు సహకరిస్తుంది.
- చిన్న వయస్సులో జుట్టు తెల్లబడటాన్ని అరికడుతుంది.
- మాడు నొప్పిని తగ్గిస్తుంది.
- మెదడును చల్లబరిచేది.
- జిడ్డులేనిది.

IMPROVED TO CHECK DANDRUFF




For Healthy Hair



ASWINI

స్వచ్ఛమైన కొబ్బరినూనెతో తయారి

# చతుర సమీక్ష

ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

**మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.**

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

డిసెంబర్ చతుర నవల రక్కసిపొదలు

..........................................

సమీక్షకుని పేరు : ..........................................

చిరునామా : ..........................................

..........................................

..........................................

..........................................

# ఏరిన ముత్యాలు

★ స్వార్థత్యాగం, కృత నిశ్చయం, వినయ విశ్వాసాలవల్ల ఆత్మబలం చేకూరగలదు!

-గాంధీజీ

★ హృదయంలో మాలిన్యం వున్న మనిషి ఆరోగ్యవంతుడుగా వుండలేడు!

-నెహ్రూ

★ శీలాన్ని పెంపొందించి జీవితాన్ని తీర్చిదిద్దుకునే అవగాహన కలిగించేదే నిజమైన విద్య!

-వివేకానంద

★ మంచి పనులు చేస్తూ తీరుబాటు లేకుండా వుండే వ్యక్తికి సుఖంగా జీవించడానికి కాలం దొరకదు!

-టాగూర్

★ ధర్మాన్ని ద్వేషించడంవల్ల మానవుడు పతనమవుతాడు

-గౌతమ బుద్ధుడు

★ మానవుడు వస్తుతః హేతువాది. ప్రతివారి ప్రవర్తన చివరికి హేతుబద్ధమే అవుతుంది!

-యం.యన్.రాయ్

★ ఎక్కడ కాయకష్టం హీనంగా చూడబడుతుందో అక్కడ స్తబ్దత, క్షీణత తప్పవు.

-స్వామి రామతీర్థ

★ స్వార్థానికి స్వస్తి పలికితే సిద్ధాంతానికీ, ఆచరణకూ సమన్వయాన్ని సాధించుకోవచ్చు!

-హెడ్గేవార్

★ డబ్బు పోతే ఫరవాలేదు ఆరోగ్యంపోతే ఇబ్బంది. కానీ నైతిక విలువలు కోల్పోతే అన్నీ కోల్పోయినట్లే!

-అబ్రహాం లింకన్

★ మనుషులను గాయపరచడం ఎంత తప్పో మనసులను గాయపరచడం కూడా అలాంటి తప్పే!

-సోక్రటీస్

★ కాలానికి మంచీ చెడూ అని రెండు రకాలు లేవు! మనమే అలా అనుకుంటాం!

-షేక్స్పియర్

★ ఉన్న అవకాశాన్ని వాడుకోలేనివారు ఎన్ని అవకాశాలు వచ్చినా ఏమీ చేయలేరు!

-జిన్నా

★ అర్థంలేని తొందరపాటు అనర్థాలకు దారితీస్తుంది.

-గాంధీ

★ "కీర్తి అంటే సాహసకృత్యాల సుగంధమే!

-సోక్రటీస్

★ పాపభీతి, దైవప్రీతి, సంఘనీతి అభివృద్ధి పరచుకోవాలి.

-బాబా

సేకరణ: శ్రీగిరి శ్రీకాంత్

# నవ్వుల కితకితలు

## ప్రాక్టికల్ జోక్

ఎమ్.ఏ. పూర్తయినా యూనివర్సిటీ క్యాంపస్ వదలకుండా వుంటూ పట్టపగలు జాబ్‌కోసం ట్రైల్ అని సిటీ అంతా బలాదూర్ తిరగడం రాజాకి హాబీగా మారింది. యూనివర్సిటీ హాస్టల్లో అక్కడ చదువుకునే వాళ్ళు తక్కువ. రాజా బాపతే ఎక్కువ. ఆ సంగతి అట్లా వుంచితే రాజాకి ప్రాక్టికల్ జోక్స్ వెయ్యడం మరొక హాబీ.

ఒకరోజు రాజా తన గ్యాంగ్‌తో సంధ్యాలో సినిమాకని బయల్దేరాడు. టిక్కెట్లు దొరక్క రోడ్డున పడ్డాడు. ఎదురుగా వున్న హోటల్లోకి వెళ్ళారు. అక్కడ ఒంటరిగా కూర్చుని వున్న ఒక అమాయక చక్రవర్తి కనిపించాడు. సిటీకి కొత్తేమో బిక్కుబిక్కుమని దిక్కులు చూస్తూ కూర్చున్నాడు. రాజాకి అతగాడిమీద ప్రాక్టికల్ జోక్ వేయాలని బుద్ధిపుట్టింది.

చొరవగా వెళ్ళి వీపుమీద చరిచి "అరేయ్ గోపీ ఎప్పుడొచ్చావ్?" అన్నాడు.

"నా పేరు గోపీ కాదండీ సీతారామయ్య" అన్నాడు అతను బిత్తరపోతూ.

"అరే... అచ్చు మా గోపీలాగే వున్నావ్... కదరా..." అన్నాడు తన గ్యాంగ్‌వైపు చూసి కన్నుగీటుతూ.

"సేమ్ గోపీలాగే వున్నాడీవెంకట్రామయ్య" అన్నారు.

"నా పేరు సీతారామయ్యండి..."

"సారీ..." చెప్పి అక్కడే కూర్చున్నారు.

బేరర్ వచ్చి నిల్చున్నాడు.

రాజా సమోసాలు ఆర్డర్ ఇచ్చాడు.

సీతారామయ్య మొహమాటపడుతూ వుంటే రాజా బలవంతపెట్టాడు. ఇబ్బందిగానే తిన్నాడు అతను. తర్వాత అంతా టీ తాగారు.

"సీతారామయ్యగారూ సినిమా కొచ్చారా?"

"అవునండీ. టిక్కెట్లు దొరకలేదు"

"మేమూ అంతే. అయితే మా గోపీగాడు ముందుగా వచ్చి టిక్కెట్లు తీసుకుంటానన్నాడు. మమ్మల్ని ఫూల్స్ చేశాడు. మిమ్మల్ని చూసి గోపీ అని సంతోషించాం" అన్నాడు రాజా.

సీతారామయ్య ఇబ్బందిగా నవ్వాడు.

"ఈ రోజు వాడి బర్త్‌డే. మమ్మల్ని మార్నింగ్ షోకి తీసుకెళ్ళి ఆనక ఆల్ఫాలో బిరియానీ తినిపిస్తానన్నాడు. వుఫ్... ఏడీ... చెయ్యిచ్చాడు. పోనీలెండి మీరైనా కనిపించి సమోసా, టీ ఇప్పించారు. థాంక్సండీ..." అన్నాడు రాజా.

సీతారామయ్య అదోలా చూస్తుంటే అంతా నవ్వాపుకోలేక అవస్థపడ్డారు.

బేరర్ వచ్చి బిల్లు ఇచ్చాడు.

పాతిక రూపాయలైంది.

ఇప్పుడు సీతారామయ్య ఏం చేస్తాడు? ఏడ్చి మొత్తుకుంటాడా? లబోదిబో అంటాడా? నా దగ్గర డబ్బులు లేవండీ అని ఏడుపు

---

కవర్‌ఫోటో: వి.సత్యమూర్తి



మొహం పెడతాడా?

రాజా గ్యాంగ్ సస్పెన్స్ సినిమా చూస్తున్నట్లు ఆసక్తిగా చూస్తున్నారు.

అయితే సీతారామయ్య చాలా మామూలుగా జేబులోనుంచి పాతిక రూపాయలు తీసి ప్లేటులో వేశాడు. బేరర్‌కి టిప్పుగా మరో అయిదు రూపాయలు గూడా ఇచ్చాడు.

"థాంక్స్ సీతారామయ్యగారూ! మా గోపీగాడి బర్త్‌డేకి మీతో అనవసరంగా ఖర్చుపెట్టించాం" అన్నాడు రాజా నొచ్చుకుంటున్నట్లు నటిస్తూ.

"మీరేం ఫీలవకండి. ఈ రోజు నా బర్త్‌డే. ప్రతి బర్త్‌డేకి బీదలకి అంతోయింతో నా శక్తి కొలదీ ధర్మం చేస్తుంటాను'' అన్నాడు సీతారామయ్య.

మరుక్షణం రాజాకి, అతని గ్యాంగ్‌కి చెప్పుతో కొట్టినట్లయి, మాడిపోయిన పెసరట్టులా మొహాలు మాడ్చుకుని అక్కడ్నుంచి నిష్క్రమించారు.

-వాణిశ్రీ

---

## నో థాంక్స్ ప్లీజ్

ఆరోజు 'డియ్యోడియ్యో' టైల కంపెనీ మాసవారీ సమావేశం ఓ ఖరీదయిన హొటల్‌లో జరుగుతుంది.

పొద్దున్నే తొమ్మిది గంటలకు ఇడ్లీ, వడ, మసాలాదోసెలాంటి సమస్తమయిన టిఫిన్లు కంపెనీ సొమ్ముతో ఆరగించి, భుక్తాయాసం ముంచుకొచ్చి, అరగడానికి మీటింగ్ ప్రారంభించారు. సాధించిన ఘనత, సాధించబోయే ప్రగతి గురించి ఒకరితో మరొకరు విబేధించి తీర్మానాలు చేసుకునేటప్పటికి మధ్యాహ్నం ఒంటిగంట అయ్యింది.

తినడానికి అందరూ బిలబిలమని బయల్దేరుతుంటే. సేల్స్‌మేనేజర్ కుచేలరావు ఓ పొడిదగ్గు దగ్గి "మన కంపెనీ డియ్యో-డియ్యో టైై నూటికి పది పీకలకు వేలాడుతున్న







సందర్భాన్ని పురస్కరించుకుని, మన సేల్స్ సూపర్‌వైజర్లందరికీ కంపెనీ అద్భుతమైన కానుక యివ్వబోతోంది.

అందువల్ల మధ్యాహ్నం భోంచేసి, మ్యాట్నీకో, హెూటల్ రూమ్‌కో పోకుండా తిన్నగా యిక్కడి కొచ్చెయ్యండీ'' అని సస్పెన్స్ మెయిన్‌టైన్ చేస్తూ సాగదీశాడు.

రిప్రజెంటేటివ్స్, సూపర్‌వైజర్లు ఆ కానుక ఏమై వుంటుందా అని రకరకాలుగా వూహించుకున్నారు. రిస్ట్‌వాచీ అని, వాక్‌మన్ అని, ఫారిన్ షేవింగ్ సెట్స్... అని యిలా పలు వూహాగానాలు చేశారు.

అయితే అవేవీ కాదని మధ్నాహ్నం కుచేలరావు చేతిలో ఐటమ్ చూశాక తెలిసింది. అది పేజర్!

దాదాపు అందరి ముఖాలు వెలిగిపోయాయి.

"డియర్ ఫ్రెండ్స్! ఉద్యోగరీత్యా మనం తిరగని చోటువుండదు. అందుకే ఈ పేజర్‌ని మన కంపెనీ మీకందజేస్తోంది'' అని ఒక్కొక్క సూపర్‌వైజర్‌ని పిలిచి, యివ్వడం ప్రారంభించాడు కుచేలరావు.

అందరూ తీసుకున్నారు. ఒక్క అంబేశ్వరరావు తప్ప.

కుచేలరావు బలవంతం చేశాడు.

"నాకా అర్హత లేదుసార్!" అన్నాడు అంబేశ్వరరావు ఫోజుగొట్టి.

"భలేవాడివే! నీ ఏరియాలో మన బ్రైలు తోరణాల్లా వేలాడుతున్నాయి. అయినా పేజర్‌వల్ల ఎన్ని వుపయోగాలు? టీవీలో చూడటం లేదా- సాయంత్రం మీ లవర్ దగ్గరకి పరుగెత్తవచ్చు. మీ ఆవిడకి కూరగాయలు, మీ పాపకి చాక్లెట్లు తీసుకెళ్ళొచ్చు. అడపాదడపా కంపెనీ కూడా నిన్ను కాంటాక్ట్ చేయొచ్చు'' అని వివరించాడు కుచేలరావు.

అయినా అంబేశ్వరరావు లొంగలేదు. "నో థాంక్స్, ప్లీజ్!" అన్నాడు.

అతని మంచితనానికి, వినయవిధేయతలకు ముచ్చటపడ్డాడు కుచేలరావు. మరీ మొహమాటపెట్టేశాడు.

"ఒక్కమాట!" అని కుచేలరావుని

పక్కకు తీసుకెళ్ళి, ఆయన కాళ్ళమీద 'ధడే ల్'మని పడ్డాడు అంబేశ్వరరావు.

"అయ్యా, క్షమించాలి! ఆంధ్రరా ష్ట్రంనిండా నాకు అప్పులే! వారు ఫోన్‌లో తాఖీదులు పంపించినా నేను యింట్లో లేనని, వూళ్ళోలేనని అబద్ధాలు చెప్పి నెట్టుకొస్తోంది నా భార్య.

ఇప్పుడా ఛాన్సు పోగొట్టి, మెసేజ్‌లన్నీ నాకు నేరుగా అందేటంతటి ద్రోహం చేయవద్దు సార్' అని విలపించాడుఅంబేశ్వరరావు.

- పుష్యమి.

---

## సీక్రెట్ ప్లేస్

చాలా కాలం తర్వాత సత్యం మా ఆఫీసుకి వచ్చాడు. చాలా అంటే పదేళ్లు దాటిందేమో? సత్యాన్ని చూసి చాలా సంతోషించాను. మేమిద్దరం బి.ఏ. వరకూ క్లాస్‌మేట్స్‌గా క్లోజ్ ఫ్రెండ్స్‌మి. తర్వాత వాడు వారసత్వంగా వచ్చిన వ్యాపారంలోకి వెళ్ళిపోయాడు. నేనేమో గవర్నమెంట్ సర్వీసులోపడి హైదరాబాద్‌లో సెటిలయ్యాను.

ఆఫీసులో ఐదు దాటేవరకు కబుర్లు చెప్పుకున్నాం.

"పద ఇంటికి పోదాం" అన్నాను ఆఫీసు ఫైల్స్ సర్దుకుని.

"ఇప్పుడెందుకులేరా! వచ్చినపని అయిపోయింది. అబ్బ! ఆ లాయర్ మెదడు తినేశాడనుకో. ఈసారి వచ్చినప్పుడు వస్తాలే' అన్నాడు బ్రీఫ్‌కేస్ చేతిలోకి తీసుకుని.

"మాట్లాడావంటే తంతాను. హైదరాబాద్ వచ్చి రెండురోజుల తర్వాత వచ్చి కన్పించావు. ఇప్పుడేమో ఇంటికి రానంటున్నావ్! నోర్ముయ్'' అన్నాను తీవ్రంగా.

వాడేదేదో కుంటిసాకులు చెప్తుంటే పట్టించుకోకుండా బ్రీఫ్‌కేస్ లాక్కుని బయల్దేరాను. ఇక వాడు గత్యంతరం లేక నా స్కూటర్ ఎక్కి కూర్చున్నాడు.

నేనుండే హౌసింగ్ బోర్డు కాలనీకి తీసుకెళ్ళాను.

స్నానాలు, కాఫీ, టిఫిన్లయ్యాక డాబా ఎక్కి కబుర్లలో పడ్డాం. మా క్లోజ్ ఫ్రెండ్స్ ఎవరెక్కడున్నారో, కాలేజీ రోజులూ అన్నీ తల్చుకుంటుంటే టైమ్ ఇట్టే గడిచిపోయింది.

చీకటి పడింది.

చుట్టాలు వస్తే మా ఆవిడకి ఒకటే సంబరం. స్పెషల్ ఐటమ్ చేయడంలో నిమగ్నమైంది. డాబాపైకి మసాలా వాసన గుమ్మెత్తుతూ ముక్కుల్ని తాకుతోంది.

"ఏరా! మందేమైనా దొరుకుతుందా?" అన్నాడు సత్యం.

"మద్యనిషేధం వచ్చాక మందు సంగతే మర్చిపోయాను. లోగడైతే పాత ఫ్రెండ్స్ ఎవరొచ్చినా మందు లాగుతూ మజామజాగా కబుర్లు చెప్పుకుంటుంటే భలే సరదాగా వుండేది. చ్చ్... చ్చ్... ఆ రోజులే వేరు''

సత్యం మందు మాటెత్తేసరికి నాకు జానీ జ్ఞాపకం వచ్చాడు. జానీ మా ఆఫీసులో అటెండర్. ఈ కాలనీలోనే వుంటున్నాడు. "ఎప్పుడైనా మందు అవసరమైతే చెప్పండి సార్!" అని ఆఫర్ చేసివున్నాడు.

"ట్రై చేద్దాం. మా వాడొకడున్నాడులే. వాడి ద్వారా దొరకొచ్చు. నేవెళ్ళొస్తా! నువ్వు కూర్చో'' అన్నాను.

"ఇక్కడుండి ఏం చేస్తాను. పద నేనూ వస్తాను'' అన్నాడు సత్యం.

ఇద్దరం స్కూటరెక్కి జానీ ఇంటికెళ్లాం.

అదృష్టవశాత్తు జానీ ఇంట్లోనే వున్నాడు. నన్ను చూసి ఆశ్చర్యపోయాడు.

"రండి సార్... రండి..." అంటూ వుబ్బి తబ్బిబ్బైపోయాడు.







"అర్జంటుపని. ఇలా బైటకు రా'' అని పిల్చి అసలు సంగతి చెప్పాను.

"ఓస్ ఇంతేనా! ఈమాత్రం దానికి మీరు రావాలా! ఇందాక ఆఫీసులో చెప్తే ఈ పాటికి తెచ్చి ఇచ్చేవాడిని సార్!" అన్నాడు.

"అప్పుడా ఐడియా రాలేదు'' అన్నాను.

స్కూటర్‌మీద నేను, సత్యం వెళ్తుంటే మా వెంట పెద్ద పెద్ద అడుగులు వేసు కుంటూ ఫాలో అయ్యాడు జానీ. ముగ్గురం కొంత దూరం వెళ్ళాం. జానీ ఒక ఇంటి ముందు ఆగి "సర్దార్'' అని కేక పెట్టాడు.

ఆ సర్దారు బైటకు వచ్చాడు. నా దగ్గర నాలుగువందలు తీసుకుని సర్దారుకి ఇచ్చా డు జానీ. సర్దారు ఇంట్లోనుంచి బాటిల్ తెచ్చి ఇస్తాడనుకున్నాను. అలా జరగలా!

"మీరిక్కడే వుండండి. ఇప్పుడే వస్తాను'' అన్నాడు సర్దార్.

"మళ్ళీ ఎక్కడికి వెళ్ళాలి? నీ దగ్గర లేవా?" అన్నాను అసహనంగా.

"ఎక్కడికీ వెళ్ళక్కర్లేదు సార్! నా దగ్గరే వున్నాయి. ఇంట్లో వుండవు. బైట సీక్రెట్ ప్లేస్‌లో'' అన్నాడు సర్దార్.

సర్దార్, జానీ ఇద్దరూ చీకట్లో ఎటో వెళ్ళి ఐదు నిముషాల్లో వచ్చేశారు. జానీ బాటిల్ స్కూటర్ డిక్కీలో పెట్టాడు.

కొంత దూరం వెళ్ళాక "నేను వుంటాను సార్!" అన్నాడు జానీ.

"సరే! వుండు. అది సరేగాని ఈ సర్దార్ ఎక్కడినుంచి తెస్తాడు బాటిల్స్?" అన్నాను.

"ఏమో సార్! నాకూ తెలీదు''

"నువ్వు అతని వెంట వెళ్ళావుగా''

జానీ పకపక నవ్వాడు.

"వాడెక్కడో కొనుక్కుని తెస్తాడు సార్! తెచ్చి ఇంట్లో పెట్టుకోడు. ఎవరైనా రైడ్ చేస్తే దొరికిపోతాడని భయం. అందుకని సీక్రెట్ ప్లేస్‌లో దాస్తుంటాడు. బాగా తెల్సిన నాబోటి కష్టమర్స్ వస్తే అక్కడ్నుంచి తెచ్చిస్తాడు'' చెప్పాడు జానీ.

"సీక్రెట్ ప్లేస్ అంటే గోడౌన్ మెయింటైన్ చేస్తున్నాడా?"

"నా బొంద. మన కాలనీలో చెత్తకుండీలు పర్వతాల్లా పెరిగిపోతున్నాయిగదా. వాటిని మున్సిపాల్టీవాళ్ళు ఎప్పుడూ తియ్యరు. వీడి సీక్రెట్ ప్లేసెస్ అవే. వాటిల్లో దాస్తుంటాడు. అంతకన్నా సేఫ్టీ ప్లేస్ ఏముంటుంది సార్?"

**-సి. ఎస్. ఆర్. ప్రసాద్**

# చతుర

సంపుటి : 19　　సంచిక : 11　　డిసెంబరు 1996

శుద్ధశ్రోత్రియ కుటుంబంలో పుట్టి, అన్నచాటున, అమ్మచాటున పెరిగిన అందాల భరిణి ఆ అమ్మాయి.

తనకు నచ్చిన, తను ప్రేమించిన వ్యక్తితో జీవితాన్ని పంచుకుని ఆనందమయం చేసుకోవాలని సుందరస్వప్నాలు కన్న ఆ అమ్మాయే... స్వయంగా... ఓ పాపకూపంలోకి ప్రవేశించింది. ఆ జీవితం ఆమెను ఆక్టోపస్‌లా చుట్టి ఉక్కిరి బిక్కిరి చేసింది.

**చదువు సంస్కారం వుండీ... స్వయంగా ముళ్లపొదలాంటి జీవితంలోకి కోరి ప్రవేశించడానికి ఆమెకు ఎదురైన పరిస్థితులు ఎలాంటివి? ఆ జీవితం ఆమెకు మిగిల్చిందేమిటి?**

సామాజిక కట్టుబాట్లను, అవి అధిగమించినప్పటి

ఇక్కట్లను... అక్షరరూపంలో విప్పి చెప్పిన

**గోపరాజు నాగేశ్వరరావు**

# రక్కసిపొదలు

ఈ నెల చతుర సమగ్ర నవల.



భువనేశ్వరీదేవికి వైధవ్యం ప్రాప్తించి ఎంతో కాలం కాలేదు. నీరుకావి మడిబట్టల్లో నిత్యం భగవద్ధ్యానంలో లీనమై తరించే ఆచార పరాయణత్వం వారిది. జపతపాలు, దేవతార్చనలూ, ధూపదీప నైవేద్యాలతో వారి గృహం ఎన్నో తరాలుగా శోభిస్తోంది.

సాత్త్విక దేవుళ్ళతో వారికి ప్రగాఢమైన సాన్నిహిత్యం వున్నా క్షుద్రశక్తులపట్ల భయం లేకపోలేదు. కాలం నిర్దాక్షిణ్యంగా తన భర్తను పొట్టన పెట్టుకోవటం వెనుక క్షుద్రశక్తుల ప్రమేయం వుందనే భువనేశ్వరీ దేవి నమ్మకం!

భర్త జ్ఞాపకాలు మనసులో కలక వేసినప్పుడల్లా ఆవిడ ముక్కు మోదుగు పూవయ్యేంతదాకా చీది, కళ్ళు మందారాలయ్యేంతదాకా ఏడ్చి మెటికెలు విరుస్తూ క్షుద్రశక్తుల్ని రహస్యంగా తిట్టిపోయటం కద్దు.

భర్త గతించేక కాలగమనంలో ఆవిడ మనసులో మరో తర్కం తలెత్తింది. అంతమంది సాత్త్విక దేవుళ్ళకు నిలయమైన తన ఇంటిమీదే క్షుద్రశక్తులలా కన్ను వెయ్యటం, గుండ్రాయిలాంటి భర్త అర్ధరాత్రివేళ గుండె పట్టుకుని విలవిల్లాడుతూ తన కళ్ళముందే క్షణంలో ప్రాణాలు విడవటం.

సంఖ్యాబలంలో సాత్త్విక దేవుళ్ళకన్నా తక్కువైన క్షుద్రశక్తులకు అంతటి మహత్తు ఎలా అబ్బిందో? అన్నదే ఆవిడ తర్కంలోని ప్రధానాంశం!

ఆ తర్కం ఈమధ్యనే ఓ కొలిక్కి వచ్చింది. అన్ని కోణాల్లోనూ దీర్ఘంగా ఆలోచించిన మీదట, ఆధునికకాలరీత్యా ఆధిక్యతకు ప్రధానం సంఖ్యాబలం కాదనీ, అల్పసంఖ్యాకులైన క్రూరకర్ములు అధిక సంఖ్యాకులైన సాత్త్విక జనాన్ని జండా కర్రలతో అదిలించి, బాంబులతో బెదిరించి, కత్తులతో కయ్యాలాడి, కర్రపెత్తనం కాపాడుకుంటోన్నట్లే యిదీనూ, అని!

ఈ విపత్కర పరిణామాలన్నింటికీ కారణం కలిమాయే అని గ్రహించి, తాత్త్వికంగా నవ్వుకుంటారు భువనేశ్వరీదేవి. కాలాన్ని శాశించలేని మనిషి అల్పత్వాన్ని మాయలో భాగంగా గుర్తించి నిబ్బరపడుతోంటారు.

ఆయన ఏ పుణ్యలోకాల్లో మజిలీ చేసేరో కానీ, జీవించి వున్నప్పుడు కరిణీకం నిర్వహించేవారు. కరణం గోవర్ధనరావుగారంటే చుట్టుపట్ల గ్రామాల్లో ఎంత మంచి పేరో. నిత్యం వారు ప్రజల బాగోగులను పర్యవేక్షించేవారు. అతిథులను ఆరాధనగా సత్కరించేవారు. నిత్యాన్నదానాలతో కరణంగారి ఇల్లు అన్నపూర్ణాదేవి నిలయంలా ఎల్లప్పుడూ కళకళలాడేది.

గోవర్ధనరావుగారు స్వతంత్ర సంగ్రామంలో కూడా పాల్గొన్నారు. దేశంకోసం చాలా ఆస్తిని ధ్వంసం చేసేరు. పలుమార్లు జైళ్ళక్కూడా వెళ్ళేరని వినికిడి!

స్వతంత్రం వచ్చాక భారతప్రభుత్వం స్వాతంత్ర సమరయోధులకు చేసిన సత్కారాలనూ, ఇచ్చిన పారితోషికాలనూ తిరస్కరించిన కారణంగా వారు వార్తలకు ఎక్కలేదు. వారి చరిత్ర అలా తెల్లవాడితోటే తెరమరుగై పోయింది!

చాలా సంవత్సరాలక్రితం నాటిమాట.

భువనేశ్వరీదేవి అన్నగారైన సాంబశివరావుగారు ఒకరోజు ప్రొద్దున్నే గుంటూరునించి ఊడిపడ్డాడు. ఆడవాళ్ళకు పుట్టింటి వారిపట్ల వుండే మమకారమే వేరు! అన్నయ్య వచ్చాడన్న ఆనందంతో పొంగిపోయేరు భువనేశ్వరీ దేవి.

కాలకృత్యాలు తీర్చుకుని, స్నానంచేసి, శుచిగా దేవుడి గదిలోకి వెళ్ళి పూజాదికాలు పూర్తిచేసుకుని వచ్చి తాపీగా వాలుకుర్చీలో చేరగిలపడ్డారు సాంబశివరావుగారు.

ఆయన ఎదురుగా చాపను పరుచుకుని కూర్చున్నారు భువనేశ్వరీదేవి.

"బావగారు ఎక్కడికి వెళ్ళేరన్నావూ? "





అని చెల్లాయిని అడిగేరు సాంబశివరావు గారు.

లక్ష్మీదేవి యిత్తడి బొమ్మను బట్టతో తుడుస్తోన్న భువనేశ్వరీదేవి తలెత్తి, "తెల్లవారుజామునే నిద్రలేచి పొరుగూరు వెళ్ళేరు. అక్కడ ఎవరివో గుడిసెలు కాలిపోయాయిట. నిరాశ్రయులకు భోజనం, వసతి గట్రా ఏర్పాటుచేసి వస్తానని వెళ్ళేరు. సాయంకాలానికల్లా వస్తారు" అన్నారు.

"పిల్లలు కనిపించరేం? "

"సెలవులు కదా అన్నయ్యా... అంతా కలిసి వాళ్ళ తాతయ్యగారి ఊరికి వెళ్ళేరు"

సాంబశివరావుగారి ముఖంలో నీలినీడలు పులుంకున్నాయి. శూన్యంలోకి చూస్తూ మౌనంగా కూర్చుండిపోయేరు.

అన్నయ్య అలా మౌనం ఎందుకు దాల్చారో భువనేశ్వరీదేవికి అర్థమైంది.

"పిల్లలు ముందుగా గుంటూరు వెడతామనే సిద్ధపడ్డారు. అంతలో వాళ్ళ తాతయ్యగారు మనిషిని పంపించారు, పిల్లల్ని వెంట పెట్టుకుని రమ్మని. అందుకే తప్పనిసరై అటు వెళ్ళారు" అన్నారు ఆయన్ను సమాధాన పరుస్తూ.

సాంబశివరావుగారి ముఖం క్రమంగా వెల్తురు పుంజుకుని ప్రసన్నంగా మారింది.

"సెలవులకు పిల్లలు వస్తారని మీ ఒదిన ఎంతగా ఎదురు చూస్తోందో..." అన్నారు సాంబశివరావుగారు.

భువనేశ్వరీదేవి మనసు కలుక్కుమంది. కొన్ని విషయాలు ఎంత సున్నితంగా కలత పెడతాయో!

ఆ ఆలోచనలనించి తేరుకుందుకు చర్చను మరోవేపుకు మళ్ళిస్తూ, "ఒదిన కూడా వస్తే బాగుండేది కదా అన్నయ్యా!" అన్నారామె.

సాంబశివరావుగారు కణతల్ని నొక్కుకుంటూ దీర్ఘంగా నిట్టూర్చేరు.

"అమ్మా, భువనేశ్వరీ! మా గురించి నీకు తెలియందేముంది. ఈశ్వరుడి కృపవల్ల కలిమికేం తక్కువలేదు. తరాలుగా కరిగించుకుని తిన్నా తరగనంత ఆస్తిపాస్తులున్నాయి. అయినా ఏం ప్రయోజనం, నాకూ మీ ఒదినకూ మనసుకు శాంతన్న మాటే కరవైంది. పున్నామ నరకంనించి కాపాడి, తలకొరివి పెట్టే సంతాన ప్రాప్తే లేనప్పుడు ఆస్తిపాస్తులెన్నున్నా నిర్భాగ్యులమే మేము. అప్పటికీ నేనూ, మీ ఒదినే వైద్య పరీక్షలన్నీ చేయించుకున్నాం. ఆమె గొడ్రాలయితే సంతాన ప్రాప్తికోసం మరో కళత్రాన్ని కూడా కాదనేవాడ్ని కాదేమో! కానీ లోపం నాలోనే వుందని వైద్యులు సెలవిచ్చేరు. కనుక ఇక మాకీ జన్మకు సంతాన యోగం లేనట్టే. అందుకే బాగా ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చాం. మిమ్మల్ని ఓ కోర్కె కోరేందుకు ధైర్యంచేసి వచ్చాను. నువ్వూ, బావగారూ పెద్దమనసు చేసుకుని నా అభ్యర్థనను అంగీకరిస్తారని నా విశ్వాసం..." అన్నారు సాంబశివరావుగారు.

భువనేశ్వరీదేవి గుండె ఝల్లుమంది!

సాంబశివరావుగారు తమ పెద్దబ్బాయి మార్కండేయులును దత్తత తీసుకోవాలన్న ఆలోచనలో వున్నట్లు ఆమె గతంలోనే విన్నది. అందుకే ఇప్పుడు అన్నయ్య మాటల్లో అన్యాపదేశంగా ధ్వనించిన అర్థాన్ని ఆమె చటుక్కున గ్రహించేరు.

సాంబశివరావుగారు ఆ విషయాన్ని తనతో సూటిగా ప్రస్తావిస్తే అందుకు సమాధానంగా తను అవుననో, కాదనో నిర్ద్వంద్వంగా చెప్పక తప్పదు. ఆ రెండింటిలో ఏది చెప్పేందుకూ ఆమె మానసికంగా సిద్ధపళ్లేకపోతోంది.

'కాదు' అంటే పుట్టింటి మమకారాలకు నిర్వచనం లేనట్టే.

'సరే' అంటే అందుకు తన శరీరంనించి మాంసఖండాలను కోసి యిచ్చిన శిబిచక్రవర్తికి వున్నంతటి ఔదార్యం కావాలి!

నేర్పుగా మాట మారుస్తూ, "ఒదినె కులాసాయేనా అన్నయ్యా? " అని అడిగేరు భువనేశ్వరీదేవి.

సాంబశివరావుగారు విషాదంగా నవ్వేరు.

"ఆ... ఏం కులాసా అంటావ్, అనుక్షణం దిగులుతో కృంగిపోతోంది. సంతానహీనత అనే న్యూనత వయసు మీరేకొద్దీ మరింతగా బాధిస్తోంది. మనిషికి వృద్ధాప్యంలో ఆసరా యిచ్చేది సంతానమే కానీ ఆస్తిపాస్తులు కావు. అందుకే మీ ఒదిన ఎంతగా క్షోభపడుతోందో తెలుసా? " అంటూ చెల్లాయి ముఖంలోకి చూసేరు.

అసహనంగా కదుల్తూ దీర్ఘంగా ఆవులించేరు భువనేశ్వరీదేవి.

"...నిజం చెప్పాలంటే దాని కనుగుడ్లే కరిగి, కన్నీళ్ళుగా కారుతున్నాయన్నంత హృదయవిదారకంగా ఏడుస్తోంది మీ ఒదినె. దానికి మార్కండేయులంటే వల్లమాలిన ప్రేమ. వాడ్ని దత్తత తీసుకుందామని ఎంతో ఆశతో వచ్చాను. మీ ఒదిన కూడా నా వెంట వస్తానంది. కానీ కాలం, కర్మం కలిసిరాక అందుకు మీరు తిరస్కరిస్తే ఇక్కడే అది గుండె పగిలి చస్తుందన్న భయంతోనే దాన్ని వారించాను. ఒంటరిగా వచ్చాను. జీవితంలో ఎన్నో వడిదుడుకులు తట్టుకున్నవాడ్ని కనుక నా గుండె నీరైపోతుందే తప్ప పగిలిపోదు. అందుకే నిస్సంకోచంగా వచ్చాను" అన్నారు సాంబశివరావుగారు.

ఆయన కంఠంలో గాద్గదికంగా ధ్వనించిన సన్నటి జీర ఆమెను కదిలించి వేసింది. ఎవరో మాంత్రికుడు మంత్రదండంతో తుడిచి రాయిగా మార్చినట్లు చేష్టలుడిగిపోయేరు క్షణకాలం.

నెమ్మదిగా కోలుకుని "దత్తతా? మా అబ్బాయినా? " అన్నారు మాటలు పెగల్చుకుంటూ.

సాంబశివరావుగారు మౌనంగా తల పంకించేరు. అలాంటి సందర్భాల్లో మౌనం మహత్తరమైన పాత్ర వహిస్తుందని వారికి బాగా తెలుసు.

అయిపోయింది. అంతా అయిపోయింది. ఏ మాటలన్నైతే అన్నయ్య నోటివెంట వినకూడదని మనసులో ఎందరు దేవుళ్ళకు మొక్కిందో ఆమె. అయినా అన్నయ్య ఆ విషయాన్ని తనతో ప్రస్తావించనే ప్రస్తావించాడు. పేగు బంధాన్ని కోసి యిమ్మని అడగనే అడిగేడు.

మురిపెంగా తీర్చిదిద్దుకునే 'సంసారం' అనే గూట్లోంచి ఒక ప్రాణి వెళ్ళి పరాయి పంచన కుదురుకోవటం ఎంత బాధాకరమో! ఆ ఊహకే చలించిపోతోంది భువనేశ్వరీదేవి.

"మౌనం అర్ధాంగీకార మనుకుందునా అమ్మా? " అడిగేరాయన.

ఆమె సమాధానం చెప్పలేదు.

"అవున్లే, బావగారి అభిమతాన్ని తెలుసుకోకుండా స్వతంత్రించి నువ్వే ఒక అంగీకారానికి ఎలా రాగలవు. బావగారు వచ్చాకనే మనం ఒక నిర్ణయానికి వద్దాం" అని కుర్చీలోంచి లేచి వెళ్ళి పందిరి మంచంమీద మేను వాల్చేరు సాంబశివరావుగారు.

భువనేశ్వరీదేవికి వంటావార్పూ గుర్తొచ్చింది. లేచి నించున్నారు. వెళ్ళి, లక్ష్మీదేవి బొమ్మను పూజామందిరంలో పెట్టి వంట గదిలోకి వెళ్ళిపోయేరు.

ప్రయాణ బడలికతో వున్న సాంబశివరావుగారికి నెమ్మదిగా కునుకు పట్టింది. క్రమంగా ఆయన గాఢనిద్రలోకి జారుకున్నారు.

మధ్యాహ్నం ఒంటిగంటైంది,

అన్నయ్యను భోజనానికి లేపి నిద్రాభంగం కల్గించాలా వద్దా అన్న సంధిగ్దంలో పడిపోయేరు భువనేశ్వరీదేవి. అన్నయ్య పడుకున్న పందిరి మంచం తలగడవేపు నించొని ఆలోచించసాగేరు.





సరిగ్గా అప్పుడే వీధి వాకిట్లోంచి గుర్రం సకిలింపు వినిపించింది.

భర్త ఊర్నించి తిరిగొచ్చారన్న విషయం అర్థమై ఆమె వాకిట్లోకి ఎదురు వెళ్ళింది.

గోవర్ధనరావుగారు గుర్రం దిగి దాన్ని కొట్టంలోకి నడిపించేరు.

గుర్రాన్ని కట్టేసి ఠీవిగా నిలబడి చుట్టూ కలియచూసేరు.

జీతగాడు ఉరుకు పరుగులమీద వచ్చి వినయంగా నించున్నాడు.

గుర్రానికి దాణా వేసి నీళ్ళు పెట్టే పనిని అతడికి గుర్తుచేసి ఇంట్లోకి దారితీసేరు.

గడప దగ్గరే ఎదురొచ్చేరు భువనేశ్వరీ దేవి.

"మన ఇంటికి ఎవరొచ్చారో చెప్పుకోండి చూద్దాం" అంటూ భర్త కళ్ళలోకి చూసేరు భువనేశ్వరీదేవి.

ఆవిడ ముఖంలో జ్వలిస్తోన్న కాంతిని గమనించి, "ఓహ్! ఆ మాత్రం ఊహించ లేనా భువనా... ఎవరో మీ పుట్టింటి వాళ్ళే వచ్చి వుంటారు" అన్నారు గోవర్ధనరావు గారు చిర్నవ్వుతో.

"ఎలా ఊహించగల్గేరు? " అని భర్తకు కాళ్ళు కడుక్కుందుకు నీళ్ళు అందించేరామె.

"నీ ముఖంలో మతాబులు వెలుగుతు న్నాయి కదా" అని దీర్ఘంతీస్తూ భార్య అందించిన తువ్వాలుతో ముఖం తుడుచుకో బోయేరు గోవర్ధనరావుగారు.

ఉడుక్కుంటూ చెంగున ముందుకు దూకి, భర్త చేతిలోంచి తువ్వాలును విసురుగా లాక్కుని, "అయితే, అత్తింటి తరఫు వాళ్ళొస్తే ఎలా ఉంటుందో నా ముఖం? ఆ విషయం చెప్తేనే తువ్వాలు యిస్తాను" అని, కొంచెం దూరం జరిగి కొంటెగా చూస్తూ నించున్నారు భువనేశ్వరీదేవి.

"తువ్వాలు యిస్తేనే నీ ప్రశ్నకు సమా ధానం చెప్తాను"

"నిజంగా? "

"నిజంగానే"

ఆవిడ భర్త దగ్గరికి వచ్చి తువ్వాలు అందించింది.

ముఖం తుడుచుకుంటూ, "అత్తింటివా ళ్ళొస్తే నీ ముఖంలో ఈ పాటికి పేలాలు వేగుతుండేవి కదా!" అన్నారాయన.

భువనేశ్వరీదేవి చిరుకోపం ప్రదర్శిస్తూ, వస్తోన్న నవ్వును బలవంతంగా నొక్కిపట్టి భర్తమీదికి అమాంతం దూకింది, తువ్వాల్ను తిరిగి లాక్కునే ఉద్దేశంతో.

కొట్టంలో గుర్రం పెద్దగా సకిలించింది.

ఇద్దరూ ఒకేసారి అటువేపు చూసేరు.

జీతగాడు అక్కడే వున్నాడని గ్రహించి ఇద్దరూ తలదించుకుని ఇంట్లోకి దారితీ సేరు.

"అలా నువ్వు నామీద విరుచుకుని పడితే నా గుర్రం చూస్తూ వూరుకుంటుందా? అందుకే ఆగ్రహంగా సకిలించింది" అన్నారు గోవర్ధనరావుగారు భువనేశ్వరితో.

ఆమె భర్తవేపుకోపంగా చూసేరు.

ఇద్దరూ ఇంట్లోకి ప్రవేశించారు.

మరి నిద్రనించి ఎప్పుడు లేచేరో కానీ "ఏం బావగారూ.. ప్రజాసేవకు వెళ్ళేర టగా? ఓ పట్టాన తెమిలి త్వరగానే ఇంటికి వచ్చారు. చాలా సంతోషం" అన్నారు సాంబశివరావుగారు.

గోవర్ధనరావుగారి ముఖం చాటంత అయింది. "ఓహ్... సాంబం బావగారా. ఎన్నాళ్ళకు తమరాకతో మా ఇల్లు పావన మైంది. అంతా కులాసాయేనా? " అని ప్రశ్నిస్తూ వెళ్ళి బావగారి పక్కనే మంచం మీద కూర్చున్నారు గోవర్ధనరావు.

"అంతా అంటే ఎంతమందిలెండి. లంకంత కొంపలో లింగూ లిటుకూ మంటూ అదీ నేనూ ఇద్దరమేగా. ఓ పిల్లా,

ఓపీచా..." అని క్షణం విరామం తర్వాత "ఏదో... బాగానే వున్నాం" అన్నారు సాంబ శివరావుగారు.

భువనేశ్వరీదేవి పెద్దగా నిట్టూర్చేరు. "కాలాతీతమైంది. భోజనాలకు లేవండి" అని వంటగదిలోకి వెళ్ళారామె.

అయిదు నిముషాల్లో ఇద్దరూ తెమిలి, విస్తర్లముందు కూర్చున్నారు.

"ఈరోజు అన్నీ నీకు యిష్టమైన కూరలే వండేను అన్నయ్యా. గుత్తివంకాయ, తిరగ మోత పప్పు, అల్లంపచ్చడి, బంగాళాదుంపల వేపుడూ, ఆవకాయ సరే అనుకో" అంటూ పదార్థాలను విస్తర్లలో వడ్డించసాగేరు భువనేశ్వరీదేవి.

వడ్డించటం పూర్తయింది.

ఔపోశన పూర్తిచేసుకుని, తెల్లగా మెరుస్తోన్న అన్నంలో పప్పు కలిపి, అనుపానంగా ఆవకాయ జోడించేరు ఇద్దరూ.

నెయ్యి వడ్డించేరు భువనేశ్వరీదేవి.

పిడికిటితో ముద్ద పైకెత్తుతూ అసంకల్పంగానే ఎందుకో సాంబశివరావుగారివేపు చూసేరు గోవర్ధనరావు.

ఆయన పరధ్యానంగా ఏదో ఆలోచిస్తూ చూపుడు వేలుతో విస్తర్లో సున్నాలు చుడుతూ కనిపించేరు

"బావగారేంటో దీర్ఘాలోచనలో కొట్టుకుని పోతోన్నట్టుంది. ఏంటో విషయం?" అన్నారు గోవర్ధనరావు.

సాంబశివరావుగారి ఆలోచనకు అంతరాయం కల్గింది. ఉలిక్కిపడి బావగారివేపు చూసేరు.

భువనేశ్వరీదేవి విసనకర్రతో మరింత వేగంగా విసుర్తూ, "ముందు భోజనాలు పూర్తిచెయ్యండి. అటు తర్వాత తాపీగా కబుర్లాడుకోవచ్చు" అన్నారు భర్తకు మరికొంచెం నెయ్యి వడ్డిస్తూ.

సాంబశివరావుగారు చెల్లాయి ముఖంలో కనిపించిన అప్రసన్నతను గమనించేరు. అయినా చల్లకొచ్చి ముంత దాచటం వివేకం కాదన్న విషయం ఆయనకు తెలియంది కాదు.

"చెల్లెమ్మా! మరేం లేదు. ఇందాక నీతో చెప్పిన విషయం బావగారి చెవిన కూడా వెయ్యటం అవసరం. వారి అంగీకారం తెలుసుకుంటేనే తప్ప నేను ప్రశాంతంగా భోంచెయ్యలేను. అలాగని విస్తరిమీంచి లేచి మీ మనసుల్ని కష్టపెట్టను కానీ కంటితుడుపుగా నాలుగు మెతుకులు కొరికి అర్థాకలితో లేవటం తప్ప మరేమీ చెయ్యలేను. నన్ను సహృదయంతో అర్థంచేసుకుని ఆదరిస్తారో, నిర్దయగా తిరస్కరిస్తారో మీరే తేల్చాలి" అన్నారు.

భోజనం ముందలా అనటం లౌక్యంలో భాగమే అయినా ఆపాటి లౌక్యం ప్రదర్శించకపోతే కార్యసిద్ధి జరగదన్న విషయాన్ని చెల్లాయి ప్రవర్తన చెప్పకనే చెప్తోంది. కనుకనే సాంబశివరావుగారలా భీష్మించుక్కూర్చున్నారు.

"ఇంతకూ విషయం ఏంటండీ బావగారూ?" అడిగేరు గోవర్ధనరావు.

"మరేంలేదు. ఎవడో పరాయివాడు పరిపాలిస్తూ మన భారతీయుల్ని బానిసల్ని చేసి బాధపెడుతోన్నాడనేగా మీరంతా స్వాతంత్రంకోసం పోరాటం జరిపింది. అదలా వుంచండి. ఎవరివో గుడిసెలు కాలిపోతే ప్రొద్దున్నే లేచి గుర్రంమీద వెళ్ళలా వాళ్ళను ఆదుకున్నారే. ముక్కూ ముఖం కూడా తెలియని పరాయి జనంకోసమే అంతగా స్పందించిన మీరు నా కన్నీళ్ళు మాత్రం తుడవనంటారా బావగారూ?" అని గోవర్ధనరావుగారి ముఖంలోకి సూటిగా చూసేరు సాంబశివరావుగారు.

"అవశ్యం!"

"ప్రాధేయపడి మరీ అడుగుతున్నాను.




సంతాన ప్రాప్తిలేని ఈ నిర్భాగ్యుడికి మీ పెద్దబ్బాయి మార్కండేయుల్ని దత్తత యివ్వరూ? " అడిగేరు సాంబశివరావుగారు.

గోవర్ధన్‌రావుగారు క్షణకాలం అవాక్కయ్యేరు.

శూన్యంలోకి చూస్తూ మౌనంగా కూర్చున్నారు.

క్షణాలు బరువుగా దొర్లిపోతోన్నాయి.

ఉద్వేగంతో ఎవరి నోటివెంటా మాటలు పెగలటంలేదు.

భువనేశ్వరీదేవి చేతిలోంచి విసనకఱ్ఱజారి కిందపడిపోయింది. కొయ్యబారినట్లే నిశ్చలంగా కూర్చుని కన్నార్పకుండా భర్తవేపే చూస్తోంది.

గోవర్ధనరావుగారి పెదాలు సన్నగా కంపించసాగేయి.

"మీ అభీష్టాన్ని కాదనగలిగే శక్తిని భగవంతుడు నాకు ప్రసాదించలేదండీ బావగారూ. అలాగే కానివ్వండి" అన్నారు గాద్గదికంగా.

దొడ్లో బాదం చెట్టుమీంచి గూడుచెదిరిన పక్షి గోలగోలగా అరుస్తోంది.

అందరూ మౌనంగా భోజనాలు ముగించేరు.

ఆ సాయంకాలమే సాంబశివరావుగారు గుంటూరు వెళ్ళేందుకు బయలుదేరేరు.

"మరో నాలుగు రోజులుండి పోకూడదా అన్నయ్యా. మరీ చుట్టం చూపుగా అలా రావటం, యిలా వెళ్ళటం..." వాకిట్లో నిలబడి అన్నారు భువనేశ్వరీదేవి.

ఆయన అదోలా నవ్వేరు.

దత్తత విషయంలో బావగారు అంగీకారం తెలిపిన మరుక్షణంనించే చెల్లాయి మనసులోనే కుమిలిపోతోందన్న విషయం ఆయన గ్రహించకపోలేదు.

భారంగా నడుస్తూ భువనేశ్వరీదేవి దగ్గరికి వెళ్ళి ఆమె తలమీద చెయ్యివేసి ఆప్యాయంగా నిమురుతూ, "నన్ను మన్నించమ్మా, అయిన వాళ్ళను ఆవేదనకు గురిచేస్తామని తెలిసి కూడా కొన్ని విషయాల్లో కఠినమైన నిర్ణయాలు తీసుకోవటం తప్పనిసరి. అయినా మానవమాత్రులం. ఏం చెయ్యగలం. అంతా ఈశ్వరేచ్ఛ" అన్నారు సాంబశివరావుగారు.

ఆమె కళ్ళలో నీళ్ళూరేయి.

ఇంతకూ అన్నయ్య అలా అన్నది ఆయన్ను నాలుగురోజులు వుండి వెళ్ళమన్నందుకో, లేక దత్తత విషయంలో ఆయన సాధించిన విజయం ఆయనకు పరిపూర్ణమైన ఆనందాన్ని యివ్వక ఏదో కొంత బాధకు గురిచేసినందుకో ఆమెకు బోధపళ్ళేదు.

కృష్ణార్జునులకుమల్లే బావ, బావమరుదులిద్దరూ బయల్దేరి బస్టాండుకు చేరుకున్నారు.

గుంటూరు వెళ్లే బస్సు సిద్ధంగా వుంది.

దార్లో గోవర్ధనరావుగార్ని పలుకరించే ప్రయత్నమే చెయ్యలేదు సాంబశివరావుగారు. ఆయన హృదయంలోనూ అంతర్గతంగా చెలరేగుతోన్న ఆందోళనను గ్రహించేరు కాబోలు, స్వాంతనపరిచే మాటలను మననం చేసుకుంటూ నడక సాగించేరు.

బస్సు ఎక్కేందుకు సిద్ధపడుతూ గోవర్ధనరావుగారి భుజంమీద చేత్తో తట్టి, "బావగారూ! ఈ దత్తత స్వీకారంతో మన అనుబంధం మరింతగా బలపడిపోతోంది. ఈ సందర్భంలో మీకు మరోవిషయం చెప్పాలి. తెలుసుగా, మాకు కట్టుకుని పోయేంత ఆస్తి వుంది. అది ఇప్పుడు మన అందరిదీను. మార్కండేయులుతోపాటు మీ పిల్లలందర్నీ నా దగ్గరే వుంచుకుని పై చదువులు చదివిస్తాను. ఆ భాగ్యం కూడా మీరు నాకు కల్పించాలి. మీ దంపతులు యిరువురూ

కూడా వచ్చి మాతోపాటే వుంటే అది మహ ద్భాగ్యంగా భావిస్తాం. కష్టాలు, సుఖాలు కలిసి పంచుకుందాం. పైగా కొడుకు దూర మయ్యాడన్న బాధనించి మీకు ఉపశమనం చిక్కుతుంది" అని, ఒక్క క్షణం ఆగి, "అయినా బావగారూ! పిల్లలను ఎటూ పై చదువులకు పట్నం పంపించాల్సిందే కదా?' ' అన్నారు ఆశగా చూస్తూ.

గోవర్ధనరావుగారు తాత్వికంగా నవ్వేరు.

"నా ఆలోచనను ముందుగానే మీముందు వుంచాలనుకున్నాను. కానీ, దత్తత విషయంలో మీ అంగీకారాన్ని తెలుసుకునే ముందు నా ఆలోచనను మీకు చెప్తే ప్రలోభ పెట్టే ప్రయత్నం చేస్తున్నానని అపార్థంచేసుకుంటారని అన్లేదు. ఇప్పుడు అభ్యర్థిస్తున్నాను" అన్నారు సాంబశివరావు గారు.

"అంతా భగవత్సంకల్పం!" అన్నారు గోవర్ధనరావుగారు.

సాంబశివరావుగారెక్కిన బస్సు గుంటూరు వేపుకు కదిలిపోయింది.

తర్వాత కొద్ది రోజులకే శాస్త్రోక్తంగా దత్తత కార్యక్రమం ముగిసిపోయింది. బావ గారి అనుమతితో పిల్లలందర్నీ గుంటూర్లోనే స్కూళ్ళలో, కాలేజీల్లో చేర్పించేరు సాంబశివ రావుగారు.

"మీ దంపతులు కూడా మాతోపాటే వస్తే బాగుంటుంది కదా బావగారూ" అని మళ్ళీ అడిగేరు సాంబశివరావుగారు.

గోవర్ధనరావుగారు తలను ఎగరవేస్తూ, "కరిణీకం గట్రా బాధ్యతలున్నాయిగా, మరి కొంతకాలం యిలా సాగిపోనివ్వండి. నిదానంగా ఆలోచిద్దాం" అన్నారు గంభీరంగా.

దత్తతకుముందే బస్టాండ్లో ఈ విష యాన్ని సాంబశివరావుగారు ప్రస్తావించిన ప్పుడు తను తృణీకరించలేదు. అలా తృణీకరిస్తే తన బిడ్డను దత్తత అడిగినందుకు మనసు కష్టపెట్టుకున్నట్లు ఆయన భావించ వచ్చు. అందుకే మౌనం దాల్చాడు ఇప్పుడు దత్తత కూడా పూర్తయింది కనుక బావగారి అభ్యర్థనను సున్నితంగా త్రోసిపుచ్చేరు గోవర్ధనరావుగారు.

రోజులు గడిచిపోతున్నాయి.

అలాగే ఏళ్లూ గడిచిపోతున్నాయి.

అడపా దడపా సెలవులకు పిల్లలు గుంటూరు నించి వస్తూపోతోన్నా, గోవర్ధన రావు దంపతులు గుంటూరు వెళ్ళి వస్తోన్నా తమ జీవితంలో ఏర్పడ్డ వెల్తి పూడ్చలేనిది గానే భావిస్తూ వాళ్ళు గుండెల్లోనే బాధను నిక్షిప్తం చేసుకుని నిస్సారమైన జీవితానికి క్రమంగా అలవాటుపడిపోయేరు.

ఓ శుభ ముహూర్తంలో మార్కండేయులు వివాహం జరిగింది. ఆ తర్వాత రెండేండ్లకు సాంబశివరావుగారు, తర్వాత సంవత్సరానికే వారి అర్ధాంగీ కన్ను మూసేరు. దాంతో ఇంటి బాధ్యత, ఆస్తిపాస్తుల వ్యవహారాలూ మార్కండేయులే స్వయంగా చూసుకోవలసివచ్చింది.

తల్లిదండ్రులను గుంటూరు వచ్చి తనతో పాటే వుండమని అడిగేడు మార్కండేయులు.

గోవర్ధనరావుగారు తీవ్రంగా ఆలోచించేరు.

అబ్బాయి కోర్కెను మన్నించి సతీసమేతంగా గుంటూర్లో స్థిరపడటం ఆయనకు సుతరామూ నచ్చలేదు. సాంబశివరావు దంపతులు ఇహలోకాన్ని చాలించి పుణ్యలోకాలకు పయనమై వెళ్ళీవెళ్లకముందే అసలు తల్లిదండ్రులు మకాం మార్చి దత్తు వెళ్లినకొడుకు ఇంట్లో కుదురుకున్నారని లోకం ఆడిపోసుకోకుండా వుండలేదు.

అందుకే ఆ ప్రతిపాదనను ఆయన తిరస్కరించేరు.

★ ★ ★

జీవితాన్ని కళాత్మకంగా మలచుకుంటూ





పొందికగా బ్రతుకు సుఖాలను జుర్రుకుంటూ వడిదుడుకులు లేని జీవితం గడపటంలో మార్కండేయులుకు అతడే సాటి.

ఎదుటివాళ్ళ కష్టాలకూ, కన్నీళ్లకూ కరిగి పోయే మానవత్వం మూర్తీభవించిన మనిషే అయినా సహాయపడే విషయంలో మాత్రం ఆచితూచి అడుగేస్తాడు. 'అది అతని పిసినారితనం' అన్న అపప్రథ కూడా లేకపోలేదు. ఆ ప్రచారాన్ని విన్నా, అందుకు అతడు ఏనాడూ రవ్వంత కూడా వ్యథచెందిన దాఖలా లేదు.

మనిషికి ఎన్ని సిరిసంపదలున్నా విచక్షణ లేని మానవత్వం ఏనాటికైనా శాపంగా పరిణమిస్తుందని, ఆ శాపఫలితంగా సర్వం కోల్పోయి వీధిన నిల్చిన వ్యక్తిని గేలిచేసి ఆనందించేందుకు సహనంతో నిరీక్షిస్తూ వుండే సంఘం అంతదాకా అభినయించే సుహృద్భావం కేవలం కాపట్యంతో కూడిన నటనే అనీ మార్కండేయులు ఉద్దేశం!

అందుకే, 'పిసినారి' అన్న ప్రచారం తనకు కవచంగా జీవితంలో ప్రయోజన పడుతుందన్న భావనతోటే అతడందుకు వ్యథచెందలేదు. సంతోషించేడు కూడా.

పెద్ద చెల్లాయి మిథిలను డాక్టరు కోర్సులో చేర్పిస్తూ ఆమెకి డొనేషన్ కట్టే రోజు చెల్లాయితో అన్నాడు మార్కండేయులు.

"అమ్మా, మిథిలా! సాలీడు చాలా అల్ప జీవి. అయినా దాన్ని చూసి మనం నేర్చుకోవాల్సింది చాలా వుంది. అది నిర్విరామంగా పరిశ్రమించి తన గూడు తనే నిర్మించుకుంటుంది. ఎంతో కళాత్మకంగా మనం కూడా అలాగే పరిశ్రమించాలి. జీవితాన్ని అందంగా నిర్మించుకోవాలి. వైఫల్యం నా దృష్టిలో విధిరాత కానేకాదు. సెంటిమెంట్లకో, ఏదీ సాధించలేమన్న న్యూనతాభావానికో లోనై కార్యశూన్యతలో మనం వైఫల్యాలను ఆహ్వానిస్తాం. మన ఆ బలహీనతను అంగీకరించే ఔన్నత్యం కొరవడి విధాతను దూషిస్తూ మనం మాత్రం పవిత్రులంగానే అభినయిస్తాం. అందరి సానుభూతీ ఆశిస్తాం..."

"ఇదంతా ఎందుకు చెప్తోన్నట్టు? నాపట్ల మీకేమైనా అపనమ్మకం..." అంటూ అర్థోక్తిగా ఆగింది మిథిల.

మార్కండేయులు దీర్ఘంగా నిట్టూర్చేడు.

"మిథిలా! నమ్మకానమ్మకాల ప్రసక్తి నా దగ్గర మరెప్పుడూ తీసుకురావద్దు. ఆ రెండూ ఒక చర్యకుముందే మనసును మంత్రించి నమ్మించే ఆధారరహితమైన భ్రమలు మాత్రమే. ఒక్కోసారి నమ్మకం దుష్ఫలితాన్నిచ్చి అపనమ్మకం ఏర్పడవచ్చు. అపనమ్మకం అనాలోచితమని ఒక్కోసారి సత్ఫలితం నిరూపించవచ్చు. అందువల్ల కేవలం కఠోరపరిశ్రమలను మాత్రమే మనసా, వాచా, కర్మణా ఆరాధించు. నీ జీవితం నిన్ను గేలిచేసే ప్రమాదంనించి బయటపడే మార్గం అదొక్కటే" అంటూ చెల్లాయివేపు పరిశీలనగా చూసేడు మార్కండేయులు.

ఆమె చాలా అసహనంగా కనిపించింది.

"ఇదంతా ఎందుకు చెప్తోన్నట్టు? అని అడిగేవుకదూ... నువ్వు జీవితంలో బాగా రాణించాలి. అలా రాణిస్తావన్న నమ్మకం కానీ, రాణించవన్న అపనమ్మకం కానీ నాకు లేదు. నీ కృషి ఇచ్చే ఫలితమే నీ పరిశ్రమను చెప్తుంది. జీవితం నీది కనుక నీ ఇష్టం. ఇక నాకు సంబంధించినంతవరకు నీ చదువుకోసం నేను ఖర్చుచేసే ప్రతిపైసా ప్రతిఫలం ఆశించే ఖర్చుచేస్తున్నానని మర్చిపోకు. ఆ ప్రతిఫలం నాకే చెందాలన్న స్వార్థం నాకు లేదు. సవ్యంగా సంఘానికి ముట్టినా ఆనందమే. డాక్టర్లు చాలామంది వున్నారు. అలాగే నువ్వూ గోల్డ్‌మెడల్స్ సాధించి ఆ డాక్టర్లలో ఒక డాక్టరుగా కుదురుకున్నంత మాత్రాన నేను ఆనందపడను.

నువ్వు ఆదర్శాలున్న ఓ మంచి డాక్టరువి కావాలి. అదే నేను ఆశించే ప్రతిఫలం. ప్రతిఫలం ఆశించకుండా సహాయపడటమే ఉత్తముడి లక్షణం అంటే నేను ఉత్తముణ్ణి కావాలని కలలో కూడా కోరుకోను. ఏ నిర్భాగ్యుడి శవదహనానికో యిచ్చే కట్టెల ఖర్చు తప్ప ప్రతిఫలం ఆశించకుండా నేను వృథాగా భగవంతుడిక్కూడా కనీసం ఒక నమస్కారం కూడా చెయ్యను" అన్నాడు మార్కండేయులు.

ఎదరగా గోడకు వేలాడ్తోన్న తైలవర్ణ చిత్రం వేపే దీక్షగా చూస్తూ ఆలోచిస్తోంది మిథిల.

సెలయేటి గట్టున వొడుపుగా చేపను పట్టుకుందుకు ఎంతో సహనంతో నిరీక్షిస్తోన్న కొంగ ఆ చిత్రంలో తెల్లగా మెరుస్తోంది.

మిథిల ఆలోచనలు ఓ కొలిక్కి వచ్చేయి.

అన్నయ్య తన చదువుకోసం డబ్బు ఖర్చు పెడుతున్న అతిశయంతో బోధకుడికిమల్లే నీతిసూక్తులు ఎన్ని చెప్తోన్నా, డాక్టరు కోర్సు పూర్తయ్యేదాకా సహనం వహించాల్సిందే. అప్పుడు వొడుపుగా జీవితాన్ని పట్టుకుని కళాత్మకంగా నడిపించుకోవటం సులభం. అంతవరకూ అనువైన సమయంకోసం నిరీక్షించాల్సిందే. అటు తర్వాత డాక్టరుగా స్థిరపడి జీవితాన్ని ఆనందమయం చేసుకోవచ్చు.

"నిస్సందేహంగా నా జీవితాన్ని నేను తీర్చిదిద్దుకుంటాను" అన్నది మిథిల అన్నయ్యవేపు చూడకుండానే.

చెల్లాయిని వెంటపెట్టుకుని మెడికల్ కాలేజ్‌కి వెళ్ళాడు మార్కండేయులు. ఆరోజే కట్టాల్సిన డబ్బంతా కట్టి, కావాల్సిన పుస్తకాలు కొనిపెట్టేడు.

మిథిల శ్రద్ధగా చదువుకుంటోంది.

ఒకరోజు సాయంత్రం చల్లగాలికి ఆరుబయట వాలుకుర్చీ వేసుకుని పడుకున్నాడు మార్కండేయులు. భార్య కాత్యాయిని, అమ్మ భువనేశ్వరీదేవి తులసికోట దగ్గర చాపలు పరుచుక్కూర్చొని పిచ్చాపాటి మాట్లాడుకుంటున్నారు.

"అన్నయ్యా!" అన్న మాటలు వినిపించి కళ్లు తెరిచి చూసేడు మార్కండేయులు.

ఎదురుగా తమ్ముడు రామబ్రహ్మం.

"ఏమిటి? " అడిగేడు మార్కండేయులు.

"నాకిక్కడ మనశ్శాంతిలేదు. సత్యాన్వేషణ విస్మరించి జీవితాన్ని నిరుపయోగంగానూ, నిస్సారంగానూ దొర్లించటం వెగటుగా వుంది" అన్నాడు రామబ్రహ్మం, శూన్యంలోకి చూస్తూ.

మార్కండేయులు నొసలు ముడిపడ్డాయి. ఒక్కక్షణం ఆలోచనలో పడ్డాడు.

తమ్ముడు రామబ్రహ్మం విషయమే ఎవ్వరికీ అంతుపట్టని సమస్యగా పరిణమిస్తోంది రోజురోజుకూ.

అతను డిగ్రీలో చేరకుండా చదువును అర్థాంతరంగా కట్టిపెట్టి, ఆధ్యాత్మిక చింతనలో కూరుకునిపోయేడు.

బాల్యంనించి కూడా రామబ్రహ్మానిది అదోతరహా మనస్తత్వం.

ఎవ్వరితోనూ కలివిడిగా కలిసేవాడే కాదు. అందరికీ దూరంగా ఒంటరిగా కూర్చుని ఏదో ఆలోచిస్తోండేవాడు. అంత చిన్నతనంలో అంతగా ఆలోచించేందుకు ఏముంటుందో ఎవ్వరికీ బోధపడేది కాదు.

అతను పెద్దయ్యాక మాత్రమే బోధపడింది, అది అతడికి జన్మతహా అబ్బిన స్వభావం అని.

రామబ్రహ్మం తాపీగా అన్నయ్య పడుకున్న వాలుకుర్చీకి ఎదురుగా కింద కూర్చున్నాడు.

"అదేంటి? లోపల్నించి కుర్చీ తెచ్చుకో...' ' అన్నాడు మార్కండేయులు.

రామబ్రహ్మం అదేం పట్టించుకోలేదు. బాసినపట్టు వేసుక్కూచున్నాడు.

"అన్నయ్యా, పంచకోశాత్మకమైన ఈ దేహమే తానని భ్రమపడుట మానవుని





అజ్ఞానము. స్థూలదేహమును విచారింపగా అస్థి, చర్మ, నాడీ, రోమ, మాంసములు ఐదు. లాలా, మూత్ర, స్వేద, రక్త, శుక్లము లైదు. అలాంటి స్థూలదేహములో చక్రము లను కల్పించుకుని, ప్రాణమయకోశములో ప్రాణనిరోధము చేయవలెనని మానవుడు వృథాగా శ్రమపడుచున్నాడు. విఫలమై మరణించుచున్నాడు. సద్గురు సన్నిధి లేనిదే ఇలాంటి భ్రమలనుండి బయటపడుట దుస్సాధ్యముగనున్నది"

తమ్ముడు చెప్తోన్నమాటలూ, ఆ భాషా విన్న మార్కండేయులకు కంపరం పుట్టుకొచ్చింది. ఆగ్రహాన్ని అతిప్రయత్నంమీద నియంత్రించుకుంటూ, "సోదరా! అంతటి బృహత్తరమైన మీమాంసతో నీవేల చింతప డెదవు? ఎంచక్కా ఆంధ్రా క్రిష్టియన్ కళా శాలయందు జేరి పట్టాసాధించుము" అన్నాడు వ్యంగ్యంగా.

రామబ్రహ్మం అన్నయ్యవేపు ఎగాదిగా చూసేడు.

అతడికి కోపం రాలేదు. కోపం చర్చకు శ్రీకారం చుడుతుంది. అన్నయ్య అజ్ఞానానికి అసహ్యం వేసింది. అందుకే మౌనంగా లేచి అక్కడ్నించి వెళ్ళిపోయాడు.

తెల్లవారేక చూస్తే రామబ్రహ్మం ఇంట్లో కనిపించలేదు. ఉత్తరం రాసిపెట్టి దేశాలమీదికి వెళ్ళిపోయేడు.

భువనేశ్వరీదేవి నేలలలుక్కుని ఏడ్చింది. చిన్నకొడుకును వెతికి తెమ్మని మార్కండేయంతో పోరాడింది.

కాత్యాయిని కూడా ఆ విషయంలో అత్త గారి తరపున వకాల్తా పుచ్చుకుని మరిదిని గాలించి పట్టుకురమ్మంటూ భర్తతో పోరాడింది.

మార్కండేయులు అందుకు ససేమిరా అంగీకరించలేదు.

"కాత్యాయినీ! రామబ్రహ్మం విషయంలో మా అమ్మ మాటే నా చెవికి ఎక్కనపుడు అదే విషయంలో నువ్వెందుకు షంకుపట్టు పడతావ్? అతడికి ఆవిడ కన్నతల్లి. పేగు బంధం అలా ప్రేరేపించటంలో అర్థం వుంది కానీ వాడి విషయంలో నువ్వంతగా పోరాట్టంలో అర్థంలేదు. అతడు కేవలం నీకు మరిది. అతణ్ణి వెతికించాలన్న ఆసక్తి వుంటే అది మా అమ్మ తర్వాత వుంటే నాకు వుండాలి. నాకే లేనప్పుడు నువ్వంతగా హైరానా ఎందుకు పడతావ్? వెళ్ళు. ప్రశాంతంగా పూజాదికాలు జరుపుకుంటూ ఇంటి వ్యవహారాలు చక్కదిద్దుకో..." అన్నాడు మార్కండేయులు.

అతడి మాటలకు కాత్యాయిని నిలువెల్లా కంపించింది. ఏనాడూ భర్తకు ఎదురుచెప్పి వాదనకు దిగిన అనుభవం ఆమెకు లేదు.

"లోకం... లోకం. వేలెత్తి చూపుతుందండీ..." అంది కాత్యాయిని మాటల్ని ప్రయత్నంమీద పేర్చుకుంటూ.

మార్కండేయులు భళ్ళున నవ్వేడు.

"అయితే నువ్వు కేవలం సంఘభయంతోటే మరిదిని పట్టుకు రమ్మంటున్నావు. కీర్తికండూతి నిన్నలా ప్రేరేపించిందికదూ?" అడిగేడు.

"కీర్తికండూతా? నాకా?" ఆశ్చర్యపోయింది కాత్యాయిని.

"అవును... నీకే. ఏనాడూ భర్తతో వాదనకు దిగని పురాణకాలపు పతివ్రతా స్త్రీలాంటి కాత్యాయిని మరిది విషయంలో భర్తతో వాదులాడి లక్ష్మణుడ్ని అభిమానించిన సీతమ్మవారికి మల్లేనే వ్యవహరించిందన్న కీర్తిని నువ్వాకాంక్షిస్తున్నావు"

"అది నిజంకాదు" వస్తోన్న ఏడుపును బలవంతంగా గుండెలోనే చిక్కపట్టుకుని అన్నది కాత్యాయిని గాద్గదికంగా.

"నిజం కాకుంటే ఇక ఆ విషయం ప్రస్తావించకు" చెప్పేడు మార్కండేయులు.

దుఃఖభారంతో ఒంగిపోయి, పెదాన్ని మునిపంట నొక్కిపట్టి విసవిసా నడుస్తూ పూజామందిరంలోకి వెళ్ళిపోయింది కాత్యాయిని.

అప్పటిదాకా అంతా దూరంగా నిలబడి గమనిస్తోన్న భువనేశ్వరీదేవి సుడిగాల్లా వచ్చింది.

"ఎంత నిర్దయుడివిగా మారిపోయావురా మార్కండేయా! ఏదో, నా ఆవేదన చూళ్ళేక అది రామబ్రహ్మాన్ని వెతికించమని అడిగిం దానికి అంతలేసి మాటలు వడ్డిస్తావా" అన్నది కించిత్తు బాధను రంగరించిన రౌద్రంతో.

"ఆc... అదీ, విషయం! ఎదరగా కని పించే నీ గోడు పళ్ళేక కాత్యాయిని అలా అన్నది కానీ మరిది వెళ్ళాడన్న బాధతో కాదు. మనం మనుషులం! మన ప్రేమ లకూ, అభిమానాలకూ స్థాయీభేధం తప్ప కుండా వుంటుంది. ఆ పరిధిని దాటిన ప్రేమాభిమానాలన్నీ కపటమే. ఆ విషయం ఆమె తెలుసుకుందికే అలా మాట్లాడాల్సివ చ్చింది" అన్నాడు మార్కండేయులు.

కొడుకువేపు విచిత్రంగా చూస్తూ, "ఏమిటో నీ వాలకం. రోజురోజుకూ అర్ధం కాకుండా పోతోంది" అంటూ నొసలు నొక్కుకున్నారు భువనేశ్వరీదేవి.

మార్కండేయులు చివాల్న కదిలేడు. లేచి రెండడుగులు ముందుకు నడిచి అమ్మ భుజాలమీద చేతులు వేసి, ఆమె భుజం మీద తలను వాల్చి మౌనంగా నించు న్నాడు.

ఆ స్పర్శతో భువనేశ్వరీదేవి కోపం పటా పంచలైంది. చేత్తో కొడుకు తలమీద ఆప్యా యంగా నిమురుస్తూ, "ఎందుకురా ఇలా ఏడి పిస్తావ్?" అంటూ మురిపెంగా కొడుకు తలమీద ఓ మొట్టికాయ వేశారు.

"అమ్మా! రామబ్రహ్మం ఎక్కడున్నాడో, ఎలా వున్నాడో నాకు తెలుసు!" అన్నాడు మార్కండేయులు రెండుక్షణాల తర్వాత.

భువనేశ్వరీదేవి ఉలిక్కిపడి "నిజమా?" అడిగేరు ఆశ్చర్యంగా.



"నిజమే. కానీ వాడెక్కడున్నాడో మాత్రం చెప్పను"

"మరి వెళ్ళి వాడ్ని తీసుకుని రాకూడదూ?"

"అదే నేను అంగీకరించని విషయం! రక్త సంబంధం కనుక దూరంనించే వాడి మంచి చెడ్డల్ని గమనిస్తాను. కానీ వాడు నిర్ణయించుకున్న వాడి జీవితానికి అడ్డుపడను. అనుభవం మనిషిని తీర్చిదిద్దే అవకాశం ఇప్పుడే వాడికి వచ్చింది. భగవంతుడిపట్ల, బ్రతుకు పట్ల వాడి సత్యాన్వేషణ వాడ్ని కొనసాగించనీ. అప్పుడే వాడు నిఖార్సయిన ఆస్తికుడో, నాస్తికుడో అవుతాడు. అలాంటివాళ్ళ అవసరం సంఘానికి చాలా వుంది" అన్నాడు మార్కండేయులు.

భువనేశ్వరి అయోమయంగా కొడుకువేపు చూసింది.

భుజాలమీంచి అతని చేతుల్ని తొలగించుకుని దూరం జరిగి నించొని పైటకొంగులో ముఖం దాచుకుని రోదిస్తూ, "మార్కండేయా! నువ్వు నిజంగానే చాలా కఠినంగా మారిపోయావు. తమ్ముడి విషయంలో ఇలా ప్రవర్తిస్తోన్నావు. ఆరోజు మిథిలను కాలేజీలో చేర్పించేటప్పుడు కూడా నిర్దయగా మాట్లాడి దాని మనసును గాయపరిచావు. అది ఎంతగా కుమిలిపోయిందో నీకేమైనా పట్టిందా?, ఎందుకురా ఇలా మారిపోయావ్?" అంటూనే పెద్దగా ఏడ్చేరు భువనేశ్వరీదేవి..

మార్కండేయులు బాధగా చూసేడు. "మిథిలపట్ల నేనేం కఠినంగా ప్రవర్తించలేదే" అన్నాడు నొసలు చిట్లిస్తూ.

చిన్న చెల్లాయి కిరణ్మయి కాలేజినించి ఎప్పుడు వచ్చిందో కానీ విసురుగా మార్కండేయులు దగ్గరికి వచ్చి "అమ్మ అన్నదాన్లో అసత్యమేం లేదు. అక్కయ్య ఆరోజు రాత్రంతా ఏడ్చిన విషయం నాకూ తెలుసు" అంది కల్పించుకుని.

మార్కండేయులు చెల్లాయివేపుకు తిరిగేడు. "రాత్రంతా ఏడ్వాల్సినంతగా మిథిలను ఏం బాధపెట్టానట?" అని అడిగేడు సూటిగా.

"అక్కయ్య గొప్ప డాక్టరవుతుందన్న నమ్మకం కానీ, అపనమ్మకం కానీ లేదనీ, ప్రతిఫలం ఆశించే చదివిస్తోన్నాననీ అన్లేదూ? అయినా సత్ఫలితమే కఠోర పరిశ్రమకు సాక్ష్యమైతే కఠోర శ్రమానంతరం కూడా సత్ఫలితాలు అందని సంఘటనలు ఎన్నుంటాయి జీవితంలో. అంత మాత్రాన శ్రమపడనట్లే అంటే ఎలా" అన్నది కిరణ్మయి కటువుగానే.

చిన్న చెల్లాయి మనస్తత్వం అతడికి బాగా తెలుసు. ఆమె కోపం తాటాకు మంటలాంటిదే. చప్పున చల్లారిపోతుంది. భగ్గున మండనూ మండుతుంది.

మార్కండేయులు ఆలోచన బాల్యంకేసి మళ్ళింది.

"ఒకరోజు అమ్మ తనకూ కిరణ్మయికీ గ్లాసుల్లో తెచ్చి పాలు తాగమని ఇచ్చింది.

అన్నయ్య గ్లాసులో ఎక్కువ పాలు వున్నాయనీ, తన గ్లాసులో తక్కువ వున్నాయనీ ఆగ్రహించి నానారభసా చేసింది.

అప్పుడు మార్కండేయులు తన పాల గ్లాసు కిరణ్మయికి ఇచ్చి, ఆమె గ్లాసు తను తీసుకున్నాడు.

కిరణ్మయి కళ్లు ఆనందంతో మెరిశాయి. పాలు తాగబోయేదల్లా ఆగి, క్షణంసేపు, తన గ్లాసులోని సగంపాలను అన్నయ్య గ్లాసులోకి ఒంపి కిలకిలా నవ్వింది.

అదీ కిరణ్మయి.

"చెల్లాయ్! వాళ్ళంతా సరే, చివరకు నువ్వు కూడా నన్ను అర్థం చేసుకునే ప్రయత్నం చెయ్యటంలేదుకదూ?" అన్నాడు మార్కండేయులు కిరణ్మయివేపు చూస్తూ.

అతడి కళ్ళలో దైన్యం స్పష్టంగా కనిపిస్తోంది.

క్షణంసేపు అన్నయ్య ముఖాన్నే పరిశీలనగా చూసింది కిరణ్మయి. ఏమనుకుందో




ఏమో, "నా ప్రశ్నకు సమాధానం చెప్పు మరీ..." అంటూ దీర్ఘం తీసింది.

మార్కండేయులు గట్టిగా శ్వాస పీల్చుకున్నాడు. చెల్లాయివేపు ప్రేమను వర్షించే కళ్లతో మురిపెంగా చూశాడు.

కిరణ్మయి కుందనపు బొమ్మలా ఎంతగా ముద్దొస్తుందో!

మేలుజాతి వజ్రాల్లా మెరిసే ఆ కళ్లూ, కెంపులపొడి అద్దినట్టుండే పెదాలూ, తేనెలో ముంచి తీసిన గులాబి రేకులా కనిపించే ఆ రంగూ...

చెల్లాయి కిరణ్మయిని చూస్తేనే మార్కండేయులికి వెన్నెల్ని చూసినంత ఆనందం!

"చెల్లాయ్! చదువునేర్పని పాఠాలనెన్నింటినో జీవితానుభవం నేర్పుతుంది. అందుకే జీవితం గురించి జాగ్రత్త వహించమని దాన్ని హెచ్చరించాను. చాలామంది నిర్లక్ష్యంగా ఆటాడుకునేది జీవితంతోటే. తత్ఫలితం అపజయం, ఆవేదన, ఎడతెగని కన్నీళ్లు. ఆనక ఎవర్ని నిందించి ఏం ప్రయోజనం? ఒక్క తప్పటడుగు వేసినా సాము చేసేవ్యక్తి బాణాకర్ర అతడి కాళ్లకే తగుల్తుంది. పదేపదే బ్రతుకులో ఎన్నో తప్పటడుగులు వేస్తూ కూడా మెరుగైన రేపటికోసం మనిషి ఆశిస్తూనే వుంటాడు. అపసవ్య మార్గంలోనే కుంటిబొద్దింకలా నడుస్తూంటాడు. చీకట్లోకి వెడుతూ వెల్తుర్ని ఆశిస్తాడు..."

"ఇది నా ప్రశ్నకు సమాధానం కాదు" అంది మధ్యలోనే కిరణ్మయి.

"కఠోర పరిశ్రమానంతరం కూడా అపజయాలు సిద్ధించటం సహజమే! కానీ, అలాంటి అపజయాలు తాత్వికతతో కూడిన మనోనిబ్బరాన్ని మాత్రమే ప్రసాదిస్తాయి. మనిషిని కృంగదీసి కర్తవ్యశూన్యంగా మార్చవు. విషాదానికి బ్రతుకును అంకితం చేసే అవాంఛనీయ పరిస్థితిని కల్పించవు. కానీ, కర్తవ్యాన్ని విస్మరిస్తూ కేవలం ఊహలతో ఆశాసౌధాలు నిర్మించుకున్నప్పుడే ఆ సౌధాలు కూలిపోయి గుండెపగిలి శకలాలుగా విచ్చిపోతుంది. బ్రతుకు దుర్భరమౌతుంది" అని నిర్లిప్తంగా చూస్తూ "ప్చ్..." అని పెదాలతో చిన్న శబ్దం చేసేడు మార్కండేయులు.

అంతవరకు మౌనంగా అక్కడే నించున్న భువనేశ్వరీదేవి చిన్నగా నిట్టూర్చి అక్కడ్నించి కదిలేరు. పడక గదిలోకి వెళ్ళి నిస్త్రాణగా మంచంమీద వాలిపోయారు.

ఇంకా తన కుటుంబాన్ని గ్రహపీడ వేధిస్తూనే వుందనీ, క్షుద్రశక్తులు విడిచిపెట్టనే లేదనీ, జరుగుతూన్న సంఘటనలను బట్టి రూఢిపరుచుకున్నారు భువనేశ్వరీదేవి.

భయంతో ఆమె గుండె వేగంగా కొట్టుకోసాగింది.

అఘుండుడెవరైనా తారకమంత్రం వేసి తన కుటుంబాన్ని గ్రహపీడ నించి విముక్తం చేస్తేనూ, క్షుద్రశక్తులను వెళ్లగొడితేనూ తప్ప, పొంచివున్న ప్రమాదంనించి బయటపడే మార్గమే లేదన్న నిర్ణయానికి వచ్చారు భువనేశ్వరీదేవి.

అప్పటికే ఆమె సేకరించిన సమాచారం ప్రకారం ఆ అఖండుడెవరైందీ తేల్చుకుని ఆవిడ ఒక దృఢమైన నిర్ణయానికి వచ్చారు.

అందుకు సమర్థుడు పరాత్పరం ఒక్కడే. అతడిచేత శాంతి జరిపిస్తే అంతా శుభం జరుగుతుంది. కానీ, అందుకు మార్కండేయులు ససేమిరా అంగీకరించడు. అతను ఊళ్ళోలేని సమయంలో పరాత్పరంను ప్రయోగించాలనుకున్నారు భువనేశ్వరీదేవి.

అప్పుడుకాని ఆమె మనసుకు ఊరట చిక్కలేదు.

★ ★ ★

దగ్గర్లో తనకున్న పొలం తాలూకు కౌలు బకాయిల లెక్కలు చూసుకుంటూ వరండాలో కూర్చుని వున్నాడు మార్కండేయులు.

ఉదయం పదకొండు గంటలు కావ

స్తోంది.

వీధి తలుపును విసురుగా నెట్టుకుంటూ పెద్ద పెద్ద అడుగులు వేస్తూ లోపలికి వచ్చింది కిరణ్మయి.

ఆ తలుపు శబ్దానికి చిట్టా పుస్తకంలోంచి తలెత్తి చూసేడు మార్కండేయులు.

కిరణ్మయి లోపలికి వచ్చి పుస్తకాలను వరండాలో ఒక మూలకు విసిరికొట్టి వచ్చి మార్కండేయులు పక్కనే చాపమీద కూర్చుంది.

మార్కండేయులు ఆమెను పరీక్షగా చూసేడు.

చెల్లాయి ఏదో ఉపద్రవం తెచ్చిపెట్టి వుంటుందన్న అనుమానం కల్గి, "ఏమ్మా, కాలేజీ విడిచిపెట్టకముందే వచ్చేశావ్?" అడిగేడు మార్కండేయులు.

"నేనిక కాలేజీకి వెళ్ళను" అంది కిరణ్మయి.

"చాలా మంచి నిర్ణయం!" అంటూ మళ్ళీ చిట్టాపుస్తకంలోకి తలదూర్చేడు మార్కండేయులు.

ఉత్సాహమంతా నీరు కారిపోయినట్టు బేలగా ఒక్కక్షణం అన్నయ్యవేపే చూసి, "ఎందుకని అడగవేం?" అంది కోపంగా కిరణ్మయి.

"అలా బుసలు కక్కుతోన్న నువ్వు విషయం మాత్రం కక్కవూ... అందుకే అడగలేదు. ఎటూ నువ్వే వినేదాకా పీడించయినా చెప్తావుగా" అని చెల్లాయి ప్రతిస్పందన కోసం ఆమెవేపు చూశాడు మార్కండేయులు.

ఖస్సుమని తోకమీద లేచిన తాచుపాములే చాపమీంచి లేచి "అయితే చెప్పనులే" అంటూ వెళ్ళేందుకు రెండడుగులు వేసింది కిరణ్మయి.

"చెల్లాయ్!" లాలనగా పిల్చేడు మార్కండేయులు.

కిరణ్మయి ఆగింది.

"ఈరోజుకు ప్రశాంతంగా విశ్రాంతి తీసుకో. రేపటికల్లా కోపంపోయి నిర్ణయం ఎటూ మారిపోతుంది. అప్పుడు వెడుదువుగాని కాలేజీకి" అన్నాడు మార్కండేయులు.

గలగలా నవ్వుతూ రివ్వున వచ్చి చాపమీద కూర్చుంది కిరణ్మయి. "అన్నయ్యా! మరే ఏం జరిగిందంటే..." అంటూ ఏదో చెప్పటం ప్రారంభించింది.

వస్తోన్న నవ్వును నిగ్రహించుకుంటూ వినసాగేడు మార్కండేయులు.

"...రోమన్ సామ్రాజ్యాన్ని గురించి చెప్తూ మా మేడం నీరో చక్రవర్తిని నిందించింది. రోమ్ నగరం తగలబడుతూంటే అతను ఫిడేలు వాయిస్తూ కూర్చున్నాడు. ప్రజలను పట్టించుకోని దుర్మార్గుడు, దుష్టుడు అని ఇంకా ఏదేదో పేలేరు. దాంతో నేను మేడంతో లడాయి వేసుకున్నాను" చెప్పింది కిరణ్మయి.

"ఏమని?" ఆసక్తిగా అడిగేడు మార్కండేయులు.

"అతనలా చెయ్యటం ఇతరుల దృష్టిలో తప్పేకావచ్చు కానీ అతని కోణంనించి ఆలోచించరేం? సంగీతప్రియుడు కనుక ఆ రసాస్వాదనలో తననుతానే మర్చిపోయి పారవశ్యంలో తేలిపోయి వుండవచ్చు ఇహపరమైన సమస్త విషయాలకూ దూరంగా సంగీత ప్రపంచంలో విహరించి వుండవచ్చు అతడి సంగీత ప్రియత్వాన్ని హర్షించకపోతే మానె, పరిపూర్ణమైన దుష్టశిఖామణిగా వర్ణించటం బాగుందా?"

"అతడు కేవలం సంగీత సాధనకే బద్ధుడైతే అతడ్ని నిందించే అధికారం, హక్కు, అవసరం ఎవ్వరికీ వుండేదికాదు. కానీ అతడు పరిపాలకుడిగా ప్రజలకు బద్ధుడు. చక్రవర్తే అయినా, సామాన్యుడు అయినా తన విధిని విస్మరించిన ఎవ్వడ్నీ ఎవ్వరూ హర్షించరు"

కిరణ్మయి కనురెప్పల్నొకసారి టపటపలాడించి అన్నయ్య చెప్తోంది శ్రద్ధగా వింటోంది.




"చూడు చెల్లాయ్! రామాయణాన్నే తీసుకో రాముడు పరిపాలకుడు. కనుకనే అల్పుడెవడో సీత పాతివ్రత్యాన్ని శంకిస్తే భార్యను అడవులకు పంపించాడు. సాధ్వి అయిన సీత శీలాన్ని శంకించి రాముడు నిర్దయగా ప్రవర్తించాడని నిందించవచ్చు కానీ నిజం అది కాదు. రాముడు సీత శీలాన్ని శంకించిన దాఖలాలు ఎక్కడా లేవు. పరిపాలకుడిగా అలా ప్రవర్తించటం అతడి విధి. ఆ విధిని అతడు నిర్వర్తించ కుండా సీతను అక్కున చేర్చుకుని వుంటే దాన్ని ఆసరా చేసుకుని అశ్లీలం అయోధ్యలో రాజ్యాంగబద్ధం అయ్యేది. 'పరిపాలకుడు' అన్న పదానికి అర్థమే పోయేది. అదే రాముడు పరిపాలకుడు కాకుండా ఒక సామాన్యుడే అయివుంటే సీతకు అన్ని కష్టాలు వచ్చేవేకావు. అందుకే పరిపాలకుడి జీవితం అసిధారావ్రతం" అని కిరణ్మయి వేపు చూసి చిరునవ్వు నవ్వేడు మార్కండే యులు.

చివాల్న తలెత్తి, "అయితే పరిపాలకులై నంత మాత్రాన వాళ్ళకు వ్యక్తిగత జీవితం వుండకూడదంటావా? " అని అడిగింది కిర ణ్మయి.

"పరిపాలనా వ్యవహారాలమీద ప్రతిబిం బించని పరిమితమైన వ్యక్తిగత జీవితానికి మాత్రమే వాళ్ళు అర్హులు. మానవ సమాజ పరిణామక్రమంలో జనసమూహాలు తమ ఆస్తులకూ, మానప్రాణాలకూ రక్షకులుగా వుండే విధిమీదనే పరిపాలకులను నియ మించారు. వాళ్లు సర్వకాల సర్వావస్థల యందు ప్రజలకే అంకితమై తమ విధిని నిర్వర్తించాలని శాశించారు. ఒక్కమాటలో చెప్పాలంటే పరిపాలకులు ప్రజలకు బాని సల వంటివారు. అప్పటి రాచరికమే అయినా ఇప్పటి ప్రజాస్వామ్యమే అయినా పాలకులకు నిర్వచనం అదే. సువిశాల సామ్రాజ్యాన్ని పరిపాలిస్తూ కూడా తన భుక్తికోసం టోపీలు అల్లుకున్న ఔరంగజేబు పాలకులందరికీ ఆదర్శం కావాలి. నీరోల్లా వ్యవహరించకూడదు" అంటూ తల తిప్పి పక్కకు చూశాడు మార్కండేయులు.

ఎదురుగా కాత్యాయిని, భువనేశ్వరీదేవి కనిపించేరు.

"ఏమ్మా, కాలేజీనించి అప్పుడే వచ్చేశావ్?" కూతుర్ని ప్రశ్నించేరు భువనేశ్వరీదేవి.

కిరణ్మయి సమాధానం చెప్పేందుకు తట పటాయించింది.

"ఇకనించి కిరణ్మయి కాలేజీకి వెళ్లదుట. చదువుకు ఎగనామం పెట్టినట్లే" చెప్పాడు మార్కండేయులు.

బుగ్గలు నొక్కుకుంటూ కిరణ్మయివేపు చూస్తూ, "ఏమిటీ ఈ చోద్యం. నిక్షేపంగా చదివే చదువును అర్థాంతరంగా మానే స్తావా? " అన్నారు భువనేశ్వరీదేవి.

క్షణం తర్వాత కిరణ్మయి, "లేదమ్మా, నేను కాలేజీ మానుకోను. చదువుకుంటాను" అంది దృఢంగా.

మార్కండేయులు చెల్లాయి వేపుకు తిరి గేడు. పరిశీలనగా ఆమె ముఖంలోకి చూస్తూ, "వద్దమ్మా కిరణ్మయీ! నువ్వా చదువు మానుకోవటమే మంచిది. అందు చేత నువ్విక కాలేజీకి వెళ్ళే ప్రసక్తేలేదు" అన్నాడు.

"ఏం? ఎందుకని? " అడిగింది కిర ణ్మయి.

"నీకు హిందీ అంటే యిష్టంకదూ? "

"అవును"

"సంగీతం అంటే? "

"మహా యిష్టం. ప్రవేశం కూడా వుంది కదా నాకు"

చెల్లాయి కళ్ళలో మెరుపును గమనించేడు మార్కండేయులు.

"అయితే నువ్విక కాలేజీ మానేసి హిందీ పరీక్షలకు సిద్ధంకా. సాయంకాలం వేళల్లో పద్మావతీ సంగీత కళాశాలకు వెళ్ళి సంగీతం లోనైనా ప్రావీణ్యం సంపాదించే ప్రయత్నం

చెయ్యి" చెప్పేడు మార్కండేయులు.

కిరణ్మయి అందుకు అంగీకారంగా తల వూపింది ఆనందంగా.

భువనేశ్వరీదేవి కొడుకువేపు కోపంగా చూస్తూ, "ఏవిట్రా మార్కండేయా ఈ విడ్డూరం? " అడిగేరు అసహనంగా

"ఆసక్తిలేని రంగాల్లో ఎంతటి కఠోర పరిశ్రమగావించినా ఫలితాలు అంతంత మాత్రంగానే వుంటాయి. ఆ ఫలితాలు కంటితుడుపుకు తప్ప కార్యసాధనకు పనికి రావు. కిరణ్మయికి హిందీ అంటే యిష్టం. అందులో పరీక్షలు పాసవుతే ఉద్యోగాలు సులభంగా దొరుకుతాయి. ఎవ్వరిమీదా ఆధారపడకుండా దాని బ్రతుకు అది బ్రతకవచ్చు సంగీతంలో రాణించినా భుక్తితో పాటు కీర్తి కూడా సమకూర్తుంది. అందుకే ఈ నిర్ణయం తీసుకున్నాను" అని మళ్ళీ చిట్టాపుస్తకంలో తల దూర్చేడు మార్కండేయులు.



హైద్రాబాదులో యింజనీరింగ్ కాలేజీలో చదువుతోన్న గోపీకృష్ణ సెలవులకు గుంటూరు వచ్చాడు. అతను సాంబశివరావుగారి అత్తగారి తరపు బంధువు. మార్కండేయులుకు బావ వరుస అవుతాడు.

గోపీకృష్ణ తండ్రి చిన్నప్పుడే, గోపీకృష్ణ స్కూలు ఫైనల్ చదువుతున్నప్పుడే ఏదో యాక్సిడెంటులో మృతిచెందేడు. ఆర్థికంగా కూడా అంత స్థితిపరులేంకాదు. చదువులో గోపీకృష్ణ రాణిస్తోన్న తీరుకు ముగ్ధుడై సాంబశివరావుగారు అతడ్ని పైచదువులు చదివించే బాధ్యత ఆనాడే తీసుకున్నారు.

సాంబశివరావుగారి అనంతరం మార్కండేయులు ఆ బాధ్యతను నిర్వర్తిస్తూ గోపీకృష్ణకి ఎలాంటి యిబ్బందీ కలక్కుండా అతడి అవసరాలు తీరుస్తున్నాడు.

మరో సంవత్సరం చదివితే అతని ఇంజనీరింగు కోర్సు పూర్తవుతుంది.

గోపీకృష్ణ అమ్మగారు రెండు సంవత్సరాల క్రితమే కాలం చేసేరు. అప్పుడు సొంత ఊళ్ళో వున్న పెంకుటింటిని అమ్మేసి ఆ డబ్బు తెచ్చి మార్కండేయులికి ఇవ్వబోయేడు గోపీకృష్ణ.

మార్కండేయులు ఆ డబ్బును చిరునవ్వుతో స్వీకరించి, మరుసటిరోజే గోపీకృష్ణ పేరుతో బ్యాంకులో ఫిక్సడ్ డిపాజిట్టు చేసేడు.

తల్లికూడా చనిపోవటంతో గోపీకృష్ణకు మార్కండేయులు కుటుంబం తప్ప నా అన్నవాళ్ళు మరెవ్వరూ లేకుండా పోయేరు. ఇల్లు కూడా అమ్మటంతో సొంత ఊరితో సంబంధాలు పూర్తిగా తెగిపోయాయి. అప్పట్నించి ప్రతి సెలవులకూ అతను గుంటూరు వస్తూ, పోతూ మార్కండేయులు కుటుంబంలోని వ్యక్తిగానే స్థిరపడిపోయేడు.

తెల్లవారింది!

సుప్రభాత సూర్యుడి పలుకరింపుతో జగత్తు పులకిస్తోంది.

తులసికోట దగ్గర పిచ్చుకల జంటలు గుసగుసలు పోతున్నాయి.

ప్రకృతి భూపాల రాగాలాపనతో మైమరచి పోతోన్నట్లుంది.

ప్రొద్దున్నే నిద్రలేచి హడావుడిగా కాలకృత్యాలు ముగించుకుని తలారా స్నానంచేసి ముస్తాబైంది కిరణ్మయి.

తనకు యిష్టమైన కెంపు వర్ణపు లంగా మీద పసుప్పచ్చ ఓణీ వేసింది. శరీరానికి బిగుతుగా అంటుకునిపోయే కృష్ణవర్ణం




జాకెట్టు తొడిగి, ఆ దుస్తులకు నప్పే ఆకు పచ్చ గాజుల్ని వొత్తుగా అలంకరించుకుంది.

నిలువుటద్దం ఎదురుగా కూర్చొని అద్దంలో తన ప్రతిబింబాన్ని చూసుకుంటూ తనే మురిసిపోతోంది.

ఆమె మనసంతా గోపీకృష్ణే ఆక్రమించు కున్నాడు.

కిరణ్మయి కూర్చున్న గదిలోకి మిథిల ఎప్పుడు వచ్చిందోకానీ ఆమెకు కొంచెం దూరంగా నిలబడి చెల్లాయినే గమని స్తోంది.

ఊహల్లోంచి తేరుకుని అక్కవేపు చూసింది కిరణ్మయి.

"అక్కా! ఏంటలా గుడ్లప్పగించి నావేపే చూస్తున్నావ్? " అనడిగింది చిరునవ్వుతో

"అద్దానికి అతుక్కుని అలా ఎంతసేపు కూర్చుంటావో అని చూస్తున్నాను" అంది మిథిల.

ఎందుకో కిరణ్మయి కనురెప్పలు సిగ్గుతో వాలిపోయేయి.

నిజానికి ఆ సమయంలో కిరణ్మయి మన సంతా ఆనందంతో నిండివుంది. తొలిసారి గూడు వదలి రెక్కలమీద నింగికెగిరి స్వేచ్ఛానుభూతితో పరవశిస్తూ 'యిక ప్రపం చాన్ని జయించటమే ఆలస్యం' అనుకునే కూనపక్షి కళ్లలో కనిపించే అతిశయమే ఇప్పుడు కిరణ్మయి కళ్ళల్లో కనిపిస్తోంది. ఆనందాన్నంతా ముద్దచేసి సొంతం చేసుకో నున్నానన్న అనుభూతి జీవితంలో ఎన్ని దివిటీలను వెలిగిస్తుందో! ఆ అనుభూతి నిజమైతేనే ఆ వెలుతురు శాశ్వతం. లేకుంటే అది అనుభూతితోనే అంతరించిపోతుంది.

"కృష్ణుడు బావ నిద్రలేచాడా అక్కా? " మిథిలను అడిగింది కిరణ్మయి.

"అయ్యగారింకా మంచం విడిచిపెట్టలేదు. నిద్రలేచి ముఖం కడుక్కుంటే కాఫీ ఇవ్వ మని వదినగారి ఆర్డరు! ఆపని నాకు పుర మాయించి ఆవిడగారు మాత్రం చక్కా పూజామందిరం దగ్గర కూలబడ్డారు" కిర ణ్మయి పక్కనే కుర్చీలో కూర్చుంటూ చెప్పింది మిథిల.

"నీకంత విసుగ్గా వుంటే వెళ్ళిపో అక్కా. బావకు కాఫీ నేనిస్తానులే" అంది కిరణ్మయి.

మిథిలలో ఎందుకో కొంచెం తొట్రుపాటు కనిపించింది.

"నీకెందుకులే అంత శ్రమ" అని, కుర్చీ లోంచి లేచి బయటికి వెళ్లిపోయింది మిథిల.

అప్పటికే భువనేశ్వరీదేవి దైవధ్యానం ముగించుకుని పూజ గదిలోంచి బయటికి వచ్చేరు.

"అమ్మా, మిథిలా... కృష్ణుడు బావకు కాఫీ అయినా యిచ్చావా, లేదా? ఇంకా నిద్రలేచాడో లేదో చూడు" అని అక్కడ్నించే కేకవేసి వరండాలోకి వెళ్లిపోయేరు.

సరిగ్గా అప్పుడే పూజగదిలోంచి మిథిలను పిల్చింది కాత్యాయిని.

"వస్తున్నా వదినా..." అంటూ మిథిల పూజగదిలోకి వెళ్లింది.

"ఏంటొదినా? " అని అడిగింది.

"కొబ్బరికాయ కావాలమ్మా? స్టోర్రూమ్‌కు వెళ్ళి ఓ కొబ్బరికాయ తెచ్చి కొంచెం పీచు తీసి యివ్వవూ? " అడిగింది కాత్యాయిని.

"ఇప్పుడే తెస్తాను" అని బయటికి వెళ్ళింది మిథిల.

స్టోర్రూమ్‌కు వెళ్ళి బస్తాలోంచి కొబ్బరి కాయ తీసుకుని వచ్చింది. గోపీకృష్ణ పడు కున్న గది దగ్గర నిలబడి కిటికీలోంచి లోప లికి తొంగి చూసింది.

ప్రయాణ బడలికవల్లనేమో గోపీకృష్ణ ఇంకా నిద్ర లేవలేదు.

కొబ్బరికాయ పీచు తియ్యాలన్న మిషతో గోపీకృష్ణను నిద్రలేపితే? అనుకుంది మిథిల మనసులోనే.

అతడి గదిలోకి వెడదామా, వద్దా అని సంశయిస్తూ గుమ్మం దగ్గరే నించుండిపో యింది.

"ఏంటో ఈ కాలం పిల్లలు. ఇంట్లో మగ

వాళ్లున్నారే, వాళ్ళకు ఎప్పుడు ఏంకావాలో గమనించి సమర్థించుకుని పోరు. ఒక్కర్తి అన్నా వచ్చి గోపికి కాఫీ పట్టుకుపోతేనా ఏంకాలమో, ఏం పిల్లలో" అని పెద్దగా విసుక్కుంటున్నారు భువనేశ్వరిదేవి.

అమ్మ మాటలు మిథిల చెవిన పడ్డాయి. కిసుక్కున నవ్వింది.

అమ్మ వెనుకటితరం మనిషి! పురుషాధిక్యతను ఆనందంగా అంగీకరించి, ఆ ఆధిక్యతకు చిన్నమెత్తు 'అపచారం' జరిగినా సహించని నైజం ఆమెది. ఆ నైజం ఆచారంగా మారి ఆచరణలో స్థిరపట్టంవల్ల పురుషులు సుఖానందాలు పొందాలని మాత్రమే ఆమె ఆకాంక్ష. ఆ తరం స్త్రీలలో అధికశాతం అలాంటివాళ్లే. అలా చేస్తే పుణ్యలోకాలు ప్రాప్తిస్తాయన్నదే వాళ్ళ ఆలోచన. ఆ పుణ్యలోక ప్రాప్తికోసం యిహలోకంలో పురుషుడికి ఆధిక్యత ఇచ్చి ఆరాధించి తరించబోవటం వాళ్ల వ్యూహం కావచ్చు

అలా చిలిపిగా ఆలోచించినందుకే మిథిల కిసుక్కున నవ్వింది.

"మిథిలా... ఏంటమ్మా, ఆలస్యం? " అన్న ఒదిన కేకలు వినిపించాయి.

కొబ్బరికాయకోసం ఆమె హడావుడి పడుతోన్నట్లుంది.

కృష్ణుడు బావను తర్వాత నిద్రలేపుదామన్న ఉద్దేశంతో వెళ్ళి గబగబా కొబ్బరికాయ పీచుతీసి కాత్యాయినికి ఇచ్చేందుకు వెళ్ళింది మిథిల.

కాత్యాయిని పూజకు అంతా సిద్ధం చేసుకుంది అప్పటికే.

మిథిల వచ్చి కొబ్బరికాయ ఇవ్వగానే దాన్నందుకుని వెండిపళ్లెంలో పెట్టి మిథిల వేపు చూస్తూ "అమ్మా, మిథిలా! ప్రశాంతంగా ఇక్కడే కూర్చో అయిగిరి నందిని గానం చెయ్యి అదంటే నాకు మహాఇష్టం" అంది కాత్యాయిని.

మిథిల అయోమయంగా వదినవేపు చూసింది.

"కూర్చో..." అన్నది కాత్యాయిని మళ్ళీ

"బావకు కాఫీ ఇమ్మంది అమ్మ"

"ఎవరో ఒకళ్లు ఇస్తార్లే"

"అయినా అది గానం చెయ్యటం నావల్ల కాదు. వెళ్ళి చెల్లాయిని పంపిస్తాన్లే" అని ఒదిన అంగీకారం కోసం చూసింది మిథిల.

"ఎటూ నువ్వు వచ్చావుగా. మళ్ళీ దాన్ని పిల్చుకురావటం ఎందుకమ్మా. రాగయుక్తంగా పాడాల్సిన పనేంలేదు. చదివితే అంతే చాలు" అంది కాత్యాయిని.

అక్కడ్నించి తప్పించుకుని వెళ్ళేందుకు మిథిలకు మరో మార్గం కనిపించలేదు. ఏమనుకుందో ఏమో, చిన్నగా నిట్టూర్చి ఒదిన పక్కనే కూర్చుండిపోయింది.

పూజా కార్యక్రమం అరగంట పట్టింది.

ఒదిన కోర్కె ప్రకారం చేసి పూజ పూర్తి కాగానే తీర్థం పుచ్చుకుని హడావుడిగా లేచి బయటికి నడిచింది మిథిల.

గోపీకృష్ణ తన గదిలో కనిపించలేదు. పక్కబట్టలన్నీ అస్తవ్యస్తంగా పడివున్నాయి.

గదంతా కలియజూసి బయటికి నడిచింది.

గోపీకృష్ణ వరండాలోకి వెళ్ళివుంటాడన్న ఉద్దేశంతో అటువేపుకు నడవసాగింది.

సరిగ్గా ఇందాక కిరణ్మయి కూర్చున్న గది దగ్గరికి రాగానే లోపల్నించి గోపీకృష్ణ మాటలు వినిపించేయి.

అక్కడే ఒక్కక్షణం ఆగి ఆ మాటల్ని ఆలకించింది.

"ప్లీజ్ కిరణ్మయీ... నీ కోసం హైదరాబాదునుండి వీణ కొనితెచ్చాను. దీన్ని శ్రుతిచేసి రాగాలు పలికిస్తావని ఎంతగా ఆశిస్తున్నానో..." అన్నాడు గోపీకృష్ణ.

మిథిల నొసలు ముడిపడ్డాయి. తలుపులు తోసుకుని గదిలోకి వెళ్ళింది.

సోఫాలో కూర్చుని కనిపించేడు గోపీకృష్ణ. అతనికి ఎదురుగా చాప పరుచుకుని కూర్చుని వీణను కొనగోటితో సుతారంగా మీటుతూ తలవంచుక్కూర్చుంది కిరణ్మయి.




ఎవ్వరూ మిథిలను గమనించనే లేదు.

"ఇంకా ఎందుకా మౌనం? కిరణ్! ప్లీజ్..." అంటూ యాదృచ్ఛికంగా తలెత్తి అప్పుడు చూసేడు గోపీకృష్ణ మిథిలను.

మిథిల సోఫాకు కొంచెం దూరంలో అలాగే నించొని కళ్లు ఇంతలేసి చేసుకుని వీణనూ, కిరణ్మయినీ మార్చి మార్చి చూస్తోంది.

"అక్కడే ఆగావేం మిథిలా? రా... వచ్చి కూర్చో" మిథిలను పిల్చేడు గోపీకృష్ణ.

కిరణ్మయి తలెత్తి మిథిలవేపు చూసింది. మౌనంగా తలదించుకుంది.

ఒక్కక్షణం ఆలోచించి, అమాంతం ముఖంనిండా నవ్వును పులుంకుంటూ వెళ్ళి సోఫాలో గోపీకృష్ణ పక్కనే కూర్చుంది మిథిల.

కొన్ని క్షణాలు నిశ్శబ్దంగా గడిచేయి.

"పొద్దున్నే ఇలా దయచేశారేం?" నిశ్శబ్దాన్ని భంగపరుస్తూ అడిగింది మిథిల.

గోపీకృష్ణ సమాధానం చెప్పకనే చిర్నవ్వు నవ్వేడు.

అప్పుడు కల్పించుకుంది కిరణ్మయి, "బావ నాకు వీణకొని తెచ్చాడు. ఆ సందర్భంగా ఇప్పుడే కాఫీ కూడా ఇచ్చాను" చెప్పింది కిరణ్మయి.

"అవున్లే! నువ్వు సంగీత కళానిధివైతే బావో కళారాధకుడు. ఎందుకు తీసుకురాడు వీణ" అంది మిథిల మూతివిరుస్తూ.

గోపీకృష్ణ అందంగా నవ్వేడు. "అవును మిథిలా! సంగీత కళాశాలలో చేరినరోజే కిరణ్మయి నాకు ఉత్తరం రాసింది. ఎటూ అవసరమే కనుక వీణ తెచ్చాను. పైగా నేను సంగీతం అంటే చెవి కోసుకుంటానుకదా!" అన్నాడు.

"ఉత్తరాలు కూడా రాసుకుంటున్నారా?" అని అగడబోయి తమాయించుకుని ఆగింది మిథిల, లౌక్యంగా.

జీవితంలో ఆపాటి లౌక్యం అవసరం అన్న విషయం ఆమెకు తెలియన్ది కాదు. బంగారాన్ని రాగితోనో, వెండితోనో సమ్మిశ్రితం చేసి కోరుకున్నరీతిలో మలచుకునేట్లే మనిషి తన జీవితాన్ని కొంచెమైనా లౌక్యాన్ని రంగరించుకున్నప్పుడే బ్రతుకును కోరుకున్నరీతిలో తీర్చిదిద్దుకుందుకు వీలుపడుతుంది. అలాకాకుండా లౌక్యానికి దూరంగా మూర్ఖంగా ప్రవర్తిస్తే అపజయాలు ఆత్రంగా ఎదురుచూస్తాయి. మిథిల ఆలోచనలను పూర్తిగా గ్రహించకపోయినా కిరణ్మయికి వీణను బహూకరించి ఆమెకు ఏమీ ఇవ్వకపోవటంతో చిన్నబుచ్చుకున్నదన్న అభిప్రాయానికి వచ్చేడు గోపీకృష్ణ.

అందుకే "మిథిలా! ఉత్తరం రాస్తే నేనే ఆమెకు వీణకొని తెచ్చాను. కానీ నువ్వు ఎలాంటి ఉత్తరం రాయకపోయినా ఈసారి వచ్చేప్పుడు నీకూ ఓ మంచి బహుమతి తెచ్చి ఇస్తానులే" అన్నాడు వాతావరణాన్ని తేలికపరిచే ఉద్దేశంతో.

"ఏం బహుమతి తెస్తావు?" అడిగింది మిథిల.

"తను సంగీతం నేర్చుకుంటోంది కనుక ఆమెకు అవసరపడే వీణ తెచ్చాను. అలాగే నువ్వు డాక్టరువి కనుక నీకు అవసరమయ్యే బహుమతే ఇస్తాను"

"అదే... ఏంటని?" అడిగింది మిథిల.

"డిస్పోజబుల్ సిరంజి!" అని పెద్దగా నవ్వేడు గోపీకృష్ణ.

కిరణ్మయి కూడా అతడి నవ్వుతో శ్రుతి కలిపింది.

మిథిల ముఖం గంటుపెట్టుకుని చిరాగ్గా చూస్తూ, "చిన్న చిన్న బహుమానాలకే మురిసిపోయేందుకు నేనేం కిరణ్మయిని కాదు మిథిలను. నాకు ఏం కావాలో, కావాలనుక్నువి ఎలా సాధించాలో నాకు బాగా తెలుసు" అని చివాల్న లేచి విసవిసా నడుస్తూ బయటికి వెళ్ళిపోయింది మిథిల.

పాలిపోయిన ముఖంతో అలా వెడుతోన్న అక్కవేపే చూస్తూ కూర్చుంది కిరణ్మయి.

అటు తర్వాత వారంరోజులకు గోపీకృష్ణ



హైద్రాబాద్ వెళ్ళిపోయాడు.

★ ★ ★

అనుబంధాలన్నీ మాయలో భాగంగా గుర్తించి సత్యాన్వేషణ జరిపేందుకు ఇంటి నించి వెళ్ళిపోయిన రామబ్రహ్మం ఎన్నెన్నో పుణ్యక్షేత్రాలను దర్శించి చివరకు తిరుపతిలో కుదురుకున్నాడు. తిరుపతికి సమీపంలో వున్న ఓ ఆశ్రమ పీఠాధిపతి ఏదో సందర్భంలో రామబ్రహ్మాన్ని చూట్టం తటస్థించింది.

రామబ్రహ్మం ఎప్పుడూ పరధ్యానంగా ఆలోచిస్తూ మౌనంగా వుండేవాడే అయినా అతడి ముఖంలో ఏదో దివ్యతేజస్సును ఆ పీఠాధిపతి గుర్తించేడు. రామబ్రహ్మాన్ని దగ్గరికి చేరదీసి, పిమ్మట అతడ్ని కూడా తన ఆశ్రమంలో చేర్చుకుని రామబ్రహ్మానికి సంస్కృతం నేర్పించాడు. వేదవేదాంగాలు చదివించేడు. పురాణాలనించి ఉపనిషత్తుల దాకా ఔపోశన పట్టించాడు.

విజ్ఞానం పెరిగేకొద్దీ రామబ్రహ్మం ముఖంలో తేజస్సు కూడా పెరుగుతోంది. ఆ తేజస్సు, మేధోవికాసంతో తలపండిన జ్ఞానులకు మాత్రమే అబ్బుతుంది కనుక నిస్సందేహంగా అతను మహామనీషిగా పరిణతి చెందాడని అందరూ భావించేరు.

ఒక శుభముహూర్తాన ఆశ్రమ పీఠాధిపతి రామబ్రహ్మాన్ని దగ్గరికి పిలిచి "నా తర్వాత ఈ ఆశ్రమ పీఠాధిపత్యం వహించే అర్హతలు నీకు మాత్రమే వున్నాయి. ఎన్నో కఠినపరీక్షల అనంతరమే నిన్ను అందుకు అర్హుడిగా గుర్తించటం జరిగింది. జీవి పుట్టుక గిట్టుకల మధ్యని జీవితం గురించే కాకుండా చావు తర్వాతి జీవితం గురించి కూడా చక్కగా అవగాహన చేసుకున్న నిన్ను ఆ పదవికి అర్హుడిగా ప్రకటించటంలో ఆశ్చర్యమేం లేదు..." అని ఆయన ఆశ్రమ నిర్వహణ, సంఘపరంగా ఆశ్రమ బాధ్యతలు, పీఠాధిపతి కర్తవ్యం గురించి సుదీర్ఘంగా వివరించి చెప్పాడు.

రామబ్రహ్మం అంతా శ్రద్ధగా విన్నాడు. అంతటి పదవిని అలంకరించబోతోన్న ఆనందం కానీ, అంతటి బాధ్యత నిర్వహించాలన్న తొట్రుపాటు కానీ అతన్లో లేశ మాత్రం కూడా కనిపించలేదు. అంతా నిబ్బరంగా విని మౌనంగా తలపంకించేడు.

అలా రామబ్రహ్మం పీఠాధిపతి నిర్వహించిన చివరి పరీక్షలో తేలిగ్గానే నెగ్గాడు.

ఆ చర్చ జరిగిన రెండు మాసాలకే రామబ్రహ్మం ఆశ్రమ పీఠాధిపతిగా బాధ్యతలు స్వీకరించాడు. ఆ పదవీ స్వీకారోత్సవానికి పెద్దలెందరో సకుటుంబంగా హాజరు కావటంతో కార్యక్రమానికి విశేష ప్రచారం లభించింది. రామబ్రహం కాస్తా 'బ్రహ్మంజీ'గా మారిపోయాడు ఆ క్షణంనించే!

★ ★ ★

మార్కండేయులు ఇంటికి ఎడతెరిపి లేకుండా ఫోన్లమీద ఫోన్లు వస్తున్నాయి. బ్రహ్మంజీ విషయంలో అభినందిస్తూ.

మార్కండేయులు ఇంట్లో లేడు. పొలాల వ్యవహారంమీద సింధనూరు వెడుతోన్నాననీ, నాలుగురోజులదాకా రానని ఇంట్లో చెప్పివెళ్ళాడు. అతను ఊరికి వెళ్ళినరోజు మధ్యాహ్నమే బ్రహ్మంజీని పీఠాధిపతిగా నియమించే కార్యక్రమానికి రావలసిందిగా పోస్టులో ఆహ్వానం అందింది.

చాలా కాలానికి కొడుకు భోగట్టా తెలియటం, అందునా అతడు అనూహ్యామైనంతగా ఎదిగి ప్రయోజకుడు కావటంతో భువనేశ్వరీదేవి తబ్బిబ్బైపోయింది మరి 'అవి ఆనందబాష్పాలో' ఇంత కాలంగా కనిపించని కొడుకును గురించిన ఆవేదన అతడి సమాచారం అందగానే మనసు పొరల్ని చించుకుని ఉప్పొంగి ప్రవహించిన కన్నీళ్ళో కానీ ఆరోజంతా ఆమె కంటతడి పెడుతూనే వుంది.

అబ్బాయిని అంతమంది ప్రముఖుల సమక్షంలో అత్యున్నత స్థానంలో చూసేందుకు తిరుపతి వెళ్ళాలని భువనేశ్వరిదేవి




ఉవ్విళ్ళూరిందేకానీ మార్కండేయులు భయంతో ఆ కోర్కె చంపేసుకుంది.

ఆరోజు కార్యక్రమాన్ని టెలివిజన్‌లో కూడా ప్రసారం చేశారు. బ్రహ్మంజీ పుట్టు పూర్వోత్తరాలను ప్రకటించారు.

భువనేశ్వరిదేవితోసహా ఇంటిల్లిపాది అందరూ ఆరోజు కార్యక్రమాన్ని టీవీలో చూసి ఆనందంలో తేలిపోయారు. మరుక్షణంనించే ఎవరెవరో ఇంటికి ఫోన్లు చేసి అభినందించటం మొదలైంది.

తెల్లవారుజామున మార్కండేయులు ఊర్నించి తిరిగి వచ్చాడు.

అప్పటికే నిద్రలేచి కాలకృత్యాలు ముగించుకుని పూజకు సిద్ధమయ్యారు భువనేశ్వరిదేవి. కాత్యాయిని ఇంటిపనుల్లో నిమగ్నమైంది.

ఎందుకో ఆమెకు పరాత్పరం గుర్తొచ్చాడు. అతడిచేత గ్రహశాంతి చేయించాలని మనసులో అనుకున్నారు. కుటుంబానికి ఇంత శుభం జరిగిందంటే ఒక గ్రహశాంతి కూడా చేస్తే మరెంత శుభం జరుగుతుందో అనుకున్నారామె.

ఊర్నించి వచ్చిన మార్కండేయులు మేనువాల్చకనే చకచకా తన పనులన్నీ ముగించుకున్నాడు. స్నానంచేసి ముస్తాబై వరండాలో కూర్చుని అప్పుడే వచ్చిన దినపత్రిక చదవసాగేడు.

పూజ ముగించుకుని హడావుడిగా కొడుకు దగ్గరికి వెళ్ళారు భువనేశ్వరిదేవి.

మార్కండేయులు చేతులో వున్న పత్రికలోకి తొంగిచూసేరు ఆమె.

బ్రహ్మంజీ వార్త మొదటి పేజీలోనే వుంది.

మార్కండేయులువేపు ఎంతో ఆసక్తితో చూశారుకానీ అంచనాకు భిన్నంగా కొడుకు ముఖం నిర్వికారంగా కనిపించింది. దాంతో ఆవిడ వళ్ళు మండింది.

సొంత తమ్ముడు అంతటి మహర్దశకు చేరుకుంటే ఆనందంతో దివిటీలా వెలగాల్సిందిపోయి అలా నిర్లిప్తంగా వున్న మార్కండేయుల్ని ఆమె ఊహించనే లేకపోయారు. అతనే ఆ విషయం ప్రస్తావించే ధాకా తను కూడా ఎత్తకూడదనుకున్నారు మనసులోనే.

"సింధనూరు వెళ్ళిన పనులన్నీ చక్కబడ్డాయా?" అని అడిగిన భువనేశ్వరిదేవివేపు తలెత్తి చూశాడు మార్కండేయులు.

"నేను వెళ్ళింది సింధనూరు కాదు" అన్నాడు వెంటనే.

"ఏ ఊరు వెళ్ళావ్?"

"తిరుపతి!" చెప్పాడు మార్కండేయులు.

భువనేశ్వరిదేవి ఆశ్చర్యంగా చూస్తుండిపోయారు. క్షణం తర్వాత తేరుకుని విప్పారిన ముఖంతో "తమ్ముడి దగ్గరికి వెళ్ళావా?" అని అడిగారు ఆసక్తిగా.

"తమ్ముడి దగ్గరికి కాదమ్మా... బ్రహ్మంజీ దగ్గరికి వెళ్ళాను"

భువనేశ్వరిదేవికి చిర్రెత్తుకొచ్చింది. "ఏంటిరా అబ్బాయ్, అలా అంటావ్ బ్రహ్మంజీ అయితే మాత్రం నీ తమ్ముడు కాదూ..." అని దీర్ఘం తీశారు.

మార్కండేయులు అందుకు సమాధానం చెప్పలేదు. ఏదో తాత్వికంగా నవ్వి వూరుకున్నాడు.

"కార్యక్రమం బాగా జరిగిందా? వాడు ఆరోగ్యంగా వున్నాడా? ప్రెసిడెంటుగార్ని చూశావా?"

"బ్రహ్మంజీని 'వాడు' అనకమ్మా. ఎంత నీ కొడుకైనా సంఘచట్రంలో ముడుక్కున్నంతవరకే ఆ అనుబంధం! బ్రహ్మంజీ ఇప్పుడు తమ పరిధిని విస్తృతం చేసుకున్నారు. మానవ సంబంధాలన్నీ మాయ అని గుర్తించేరు. భౌతిక శరీరాలు అశాశ్వతమై ఏనాటికైనా పంచభూతాల్లో కలిసిపోయేవే కనుక మరణానంతరం మిగిలే ఆత్మలను గురించి అధ్యయనం చేస్తున్నారు. జీవి భౌతిక కాయం కష్టాలకూ నష్టాలకూ గురై జీవం కోల్పోయిన శుష్కదేహం కట్టెల్లో కాలినా,

ఇహలోకంలో అందని సుఖశాంతుల్ని పర లోకంలో అందించే మార్గం బోధిస్తున్నారు. ఇక ఆరోగ్యం అంటావా, ఆ పావుకోళ్లూ ఆశీనులయ్యే జింకచర్మాలూ, పులితోళ్లూ ఆరగించే పండ్లూ, ఫలాలూ ఇక ఆరోగ్యానికేం, నిక్షేపంగా వున్నారు. పొన్నకాయలా నును పుతేలి నిగనిగా మెరుస్తున్నారు. ప్రెసిడెంటుగార్ని గురించి అడిగేవుకదూ... ఆయనా

బాగానే వున్నారు" చెప్పాడు మార్కండేయులు.

భువనేశ్వరిదేవి ఆనందం పట్టలేకపోతున్నారు. "చూసేవ్రా మార్కండేయా... టివిలో అలా బ్రహ్మంజీ కార్యక్రమం చూపించారో, లేదో వచ్చే ఫోన్లకు తెంపులేకుండా పోయింది. విసుగు పుట్టిందనుకో"

"ఎవరెవరు చేశారేం ఫోన్లు? "

"ఎవరని చెప్పనూ... ఒకళ్ళా ఇద్దరా!"

"ఎం.ఎల్.ఏ.గారు చేశారా? " అడిగాడు మార్కండేయులు.

"అవును చేశారు"

"ఎంపీగారు? "

"ఆc..."

"మున్సిపల్ ఛైర్మన్‌గారో? "

"అయ్యో, నా మతిమండా... మర్చేపోయాను. ఛైర్మన్‌గారు సతీసమేతంగా మన ఇంటికి వస్తామన్నారు. నూతన వస్త్రాలతో నన్ను సత్కరిస్తారట. ఎంత కాదన్నా ఓ పట్టాన నన్ను విడిచి పెడితేనా! అంతటి మహానుభావుడికి జన్మనిచ్చిన మిమ్మల్ని సత్కరించటం పట్టణ ప్రథమపౌరుడిగా తన కర్తవ్యం అన్నాడు"

"రైస్ మిల్లర్స్ అసోసియేషన్ వాళ్లు చేశారా? "

"జ్ఞాపకం లేదుకానీ ఛాంబర్ ఆఫ్ కామర్స్ వాళ్ళు మాత్రం రెండుసార్లు చేశారు" చెప్పేరు భువనేశ్వరీదేవి.

బయట తలుపు చప్పుడైంది.

ఎవరో వెళ్ళి తలుపు తీసేరు.

మార్కండేయులు ప్రాణస్నేహితుడు 'కరివేపాకు' లోపలికి వచ్చాడు. వచ్చి మార్కండేయులు పక్కనే ఖాళీగా వున్న కుర్చీలో కూలబడ్డాడు.

భువనేశ్వరీదేవి ఇంట్లోకి వెళ్ళిపోయేరు.

కరివేపాకునే పరిశీలనగా చూసేడు మార్కండేయులు.

ఎంచేతనో కానీ కరివేపాకు గడ్డాలు మీసాలూ పెరిగి, పెరిగి చాలా మురికిగా కనిపించేడు. కళ్ళలో అంతులేని దైన్యం! బాగా నీరసించి పోయినట్టున్నాడు కూడా.

"ఏంటిరా అలా వున్నావ్? " అడిగేడు మార్కండేయులు.

కరివేపాకు సమాధానం చెప్పకుండానే దీనంగా ఒకసారి మిత్రుడివేపు చూసి తల దించుకున్నాడు.

"నాస్తిక మహాసభలకు నర్సరావుపేట వెడుతోన్నానని చెప్పి వెళ్ళావుగా. సభలు జయప్రదంగా ముగిసేయా? " మళ్ళీ మార్కండేయులే అడిగేడు.

కరివేపాకు పేలవంగా నవ్వి, "ఏంచేస్తాంరా మార్కండేయా... పిల్లవాడికి సుస్తి చేసిందనీ, వెంటనే రమ్మనీ మా ఆవిడ కబురు చేస్తే మహాసభల్నించి మధ్యలోనే వచ్చేశాను. ఎంతో ఉత్సాహంతో వెళ్తే అర్ధాంతరంగా వెనక్కు రావలసి వచ్చింది. అందుకే అన్నారేమో, తలచేది ఒకటైతే జరిగేది మరొకటి అని. అయినా కాలం, కర్మం కలిసి రానిదే ఎవరు మాత్రం ఏం చెయ్యగలరు? " శూన్యంలోకి చూస్తూ దీనంగా అన్నాడు కరివేపాకు.

"పిల్లవాడికి బాగోలేదా? ఏం జరిగింది? " ఆత్రుతగా అడిగేడు మార్కండేయులు.

"ఒకటే వాంతులూ, విరోచనాలూ. పైగా నూటరెండుకు తగ్గటంలేదు జ్వరం, ఆస్పత్రిలో చేర్పించి నాలుగు రోజులైనా"




చెప్పేడు కరివేపాకు.

కరివేపాకు కళ్ళలో తడిని గమనించాడు మార్కండేయులు!

"ఏ ఆస్పత్రిలో చేర్పించారు? " అడిగేడు ప్రశాంతంగా.

"ప్రభుత్వ ఆస్పత్రిలో!".

మార్కండేయులు తలెత్తి మిత్రుడివేపు చూసేడు.

"నాలుగురోజులు ప్రభుత్వ ఆస్పత్రిలో, అందునా వాంతులు, విరోచనాలతో వున్నాడంటే మీవాడు గట్టిపిండమే! ఉన్న రోగం తగ్గకపోగా అక్కడ వేరే యిన్‌ఫెక్షన్ కూడా అంటుకుంటుంది. ప్రైవేటు ఆస్పత్రిలో చేర్పించకపోయారా? " ప్రశ్నించేడు మార్కండేయులు.

ఒకక్షణం తటపటాయించేడు కరివేపాకు. "నా దగ్గర నామమాత్రంగా డబ్బుంటే నాస్తిక మహాసభలకు వెళ్ళాను. జేబులో ఎర్ర యాగాని లేదు. నీకోసం వస్తే ఊరికి వెళ్ళావన్నారు..."

"నేను లేకపోతే మాత్రం ఏమైంది. అంతగా డబ్బు అవసరమైతే అమ్మనో, కాత్యాయిన్నో అడిగి తీసుకోకపోయావా? "

"అనుకున్నాను! కానీ అప్పుడు వాళ్ళు పూజలో వున్నారు. డిస్టబ్ చెయ్యకూడదు కనుక వెళ్ళిపోయాను" చెప్పాడు కరివేపాకు.

మార్కండేయులు కుర్చీలోంచి లేచి లోపలికి వెళ్ళి డబ్బు తెచ్చి కరివేపాక్కు యిస్తూ "వెంటనే వాడ్ని ఏదైనా ఓ మాంచి ప్రైవేటు ఆస్పత్రిలో చేర్పించు. ఎంత ఖర్చయినా వెనకాడకు. ఏ క్షణంలో ఎంత డబ్బు అవసరమైనా నిస్సంకోచంగా వచ్చి పట్టుకుపో" అన్నాడు మార్కండేయులు.

వణుకుతోన్న చేతులతో డబ్బు తీసుకుని జేబులో పెట్టుకుని భారంగా నడుస్తూ వెళ్ళిపోయాడు కరివేపాకు.

హాల్లో కూర్చుని కాత్యాయినీభువనేశ్వరీదేవి ఏదో మాట్లాడుకుంటొన్నారు. మధ్యలో కరివేపాకు పేరు వినిపించింది. మార్కండేయులు దూరంనించే చెవులు రిక్కించి వినసాగేడు.

"నాస్తికత్వం అంటూ వాడు అజ్ఞానంలో కొట్టుకుంటున్నాడు. భగవంతుడ్ని ధిక్కరించి శ్లేష్మంలో ఈగలాగా బతుకుతూ ఆ కరివేపాకుగాడు ఏంసాధిస్తాడట? పేరు కూడా ఎంచక్కా మార్చుకున్నాడో చూడు! మరీ విడ్డూరంగా లేదూ? దేవుడ్ని ధిక్కరిస్తే ఇంటిల్లిపాదీ రోగాలూ రొష్టులతో తీసుకోక మర్లేమౌతుందిట!" అంటున్నారు భువనేశ్వరీదేవి.



సింధనూరునించి పద్మరాజుగారు రాసిన ఉత్తరం ఆరోజు ఉదయమే అందింది. మార్కండేయను వెంటనే బయలుదేరి రమ్మని ఆ ఉత్తరం సారాంశం.

అక్కడ మార్కండేయులుకున్న పొలాల విషయంలో పరిష్కరించాల్సిన కొన్ని సమస్యలున్నాయి. వాటికోసం పోయిన నెల్లోనే సింధనూరు వెళ్ళాలనుకున్నాడు మార్కండేయులు. కారణాంతరాలవల్ల ప్రయాణం వాయిదా పడింది.

మళ్ళీ వెళ్ళాలని సిద్ధపడితే తిరుపతినించి స్నేహితుడొకడు ఫోనుచేసి ఆశ్రమపీఠాధిపత్యం రామబ్రహ్మానికి బదిలీ అవుతోన్న విషయం చెప్తే సింధనూరు వెళ్ళకుండా తిరుపతి వెళ్ళాడు.

ఉత్తరాన్ని మడిచి బల్లమీదపెట్టి ఆలోచించేడు మార్కండేయులు.

పద్మరాజుగారు చాలాకాలంగా సింధనూర్లో పొలాలను అజమాయిషీ చేస్తూ ఎంతో నమ్మకంగా మార్కండేయులు వద్ద గుమాస్తాగా పనిచేస్తోన్న వ్యక్తి. అంతంత మాత్రం సమస్యలు ఎదురైతే తనే పరిష్క

రించి యజమాని మెప్పు పొందాలని ఉబలాటపడే స్వభావం అతనిది. అలాంటి వ్యక్తి తనను రమ్మని మళ్ళీ ఉత్తరం రాసేడంటే అక్కడ తన అవసరం చాలా వుందని గ్రహించేడు మార్కండేయులు.

సింధనూరు వెళ్ళాలని నిర్ణయించుకుని సూట్ కేస్ సర్దే పనిని కాత్యాయినికి పురమాయించేడు.

కొద్దిసేపటి తర్వాత ఇంటిముందు మున్సిపల్ ఛైర్మన్‌గారి కారు ఆగింది.

భార్యాసమేతంగా దిగేరాయన.

ఆహ్వానాలు, కుశలప్రశ్నలు, పరామర్శలు, పొగడ్తలూ అన్నీ అయ్యేక ఛైర్మన్, అతని సతీమణి కలిసి భువనేశ్వరీదేవి కాళ్ళకు సాష్టాంగ నమస్కారం చేసేరు. ఆమెకు ధవళవస్త్రాలు కాత్యాయినికి చాలా ఖరీదైన కంచిపట్టు చీర, రవిక బహూకరించబోయేరు.

కాత్యాయినికి భయమేసింది!

ఆ బహుమానాలను స్వీకరించాలా, వద్దా? అన్నట్లు మార్కండేయులు వేపు చూసింది.

ఆమె మనోభావాన్ని యిట్టే పసిగట్టేడు మార్కండేయులు. చిరునవ్వు నవ్వుతూ, 'స్వీకరించండి' అని సైగచేసేడు.

వచ్చినపని ముగించుకుని అందరి దగ్గర సెలవుతీసుకొనిఛైర్మన్ వెళ్ళిపోయేడు సకుటుంబంగా!

సింధనూరు వెళ్ళేందుకు మార్కండేయులు సూట్ కేస్ అందుకుని వరండాదాకా వచ్చి ఆగేడు. వీడ్కోలు చెప్పేందుకు అప్పటికే వీధి గుమ్మం దగ్గర నించొని వుంది కాత్యాయిని.

మార్కండేయులు గమనించేడు. భువనేశ్వరీదేవి హాలుకూ వరండాకూ మధ్యనున్న గుమ్మం దగ్గర పరదాల వెనగ్గా నించొని వున్నారు.

కాత్యాయిన్ని దగ్గరకు పిల్చేడు మార్కండేయులు.

"కాత్యాయినీ! నేను త్వరగానే తిరిగి వస్తాను. ఈలోగా కరివేపాకు వస్తే వాడు అడక్కపోయినా అవసరాలను ఆరాతీసి మీరే వాడికి డబ్బు యివ్వండి" చెప్పాడు మార్కండేయులు.

కాత్యాయిని తలూపింది.

"ఇకపోతే, ఛైర్మన్‌గారు నీకూ, అమ్మకూ బహూకరించిన నూతన వస్త్రాలను మన పనివాళ్ళకు యివ్వండి" అని చెప్పి మౌనంగా తల దించుకుని వెళ్ళిపోయేడు మార్కండేయులు.

పరదాల వెనకనించి బయటికి వచ్చారు భువనేశ్వరీదేవి.

అత్తా కోడళ్ళు ఒకరి ముఖాలు ఒకళ్ళు చూసుకున్నారు. కళ్ళతోటే మాట్లాడుకున్నారు. వెళ్ళి వస్త్రాలను తెచ్చి పనివాళ్లకిచ్చారు.

మార్కండేయులు ఆదేశం అయిదు నిముషాల్లో అమలు జరిగిపోయింది.

ఆరోజు సాయంత్రం తన వెంటరమ్మని కిరణ్మయిని హెచ్చరించి బయటికి వెళ్ళే సన్నాహంలో వున్నారు భువనేశ్వరీదేవి.

**పరాత్పరం**ను కలిసేందుకూ, క్షుద్రశక్తుల పీడను గురించి అతనితో చర్చించేందుకూ అదే అనువైన సమయంగా ఆమెకు తోచింది. రహస్యంగా కాత్యాయినితో చెప్పింది.

"అమ్మాయ్! ఏదో ఎవరినమ్మకం వారిది. అందులో తప్పేం లేదు. పరాత్పరంతో క్రతువులు జరిపిస్తేనే తప్ప క్షుద్రశక్తులపీడ విరగడకాదన్న విషయంలో సందేహం లేదు. మీ మామయ్యగారు కాలం చేసిన క్షణంనించే నా మనసులో అలాంటి గిలి ఏర్పడింది. అయినా సమయం, సందర్భం




కలిసిరాలేదు. ఇప్పుడు కలిసొచ్చింది కనుక కార్యరంగంలోకి పోతాను. ఏతావాతా నేను చెప్పొచ్చే దేంటంటే ఈ విషయం మాత్రం కొంచెం గోప్యంగా వుంచు. మార్కండేయులుకు తెలిసిందంటే నానా రభసా చేస్తాడు''

కాత్యాయిని ముఖ కవళికల్లో మార్పేం కనిపించలేదు. పరధ్యానంగా ఆలోచిస్తోంది.

"ఏమ్మా, మాట్లాడవేం? " రెట్టించి అడిగేరామె.

"సరే... మీ యిష్టం. అలాగే కానివ్వండి అత్తయ్యా!" అంది కాత్యాయిని క్షణం తర్వాత.

అత్తయ్య చెప్పిందానికి ఎలాంటి సమాధానం చెప్పాలో ఆ విరామ సమయంలో ఆలోచించి ధర్మసూక్ష్మం తెలుసుకుంది కాత్యాయిని!

భర్త ఆమోదం లేకుండా, అందునా వారి దగ్గర, రహస్యం దాస్తూ అత్తయ్య అభిమతం నెరవేర్చుకుందుకు అంగీకరించటం పతివ్రతా ధర్మాల సమ్మతమా? కాదా? అన్న మీమాంసనించి 'సమ్మతమే' అన్న పరిష్కారానికి వచ్చింది.

భర్త దగ్గర నిజం దాచటం భార్యగా అనుచితమే అయినా భర్తకు జన్మనిచ్చిన మాతృమూర్తి ఆదేశం కనుక దానిని ఆచరించుటే ధర్మం అన్న నిర్ణయానికి వచ్చింది.

"నిజం అత్తయ్యగారూ... వారికి చస్తే నిజం చెప్పను" అంటూ మళ్ళీ హామీ యిచ్చింది కాత్యాయిని.

కిరణ్మయిని తోడుగా వెంటపెట్టుకుని రిక్షాలో పరాత్పరం ఇంటికి బయల్దేరేరు భువనేశ్వరీదేవి.

ఎక్కడికి వెడుతోంది ముందుగా కిరణ్మయికి చెప్పలేదు.

వాళ్ళెక్కిన రిక్షావాడిక్కూడా పరాత్పరం ఇల్లు తెలుసట! అడ్రసు వెతుక్కునే అవస్థ తప్పింది. శుభ ఘడియలు వస్తేనే అంతా అలా సానుకూల పడుతుంది. శుభఘడియలు వచ్చేశాయి అనేందుకు హేతువు చిక్కింది.

భువనేశ్వరీదేవి మనసు ఎంత ఆనందంతో పొంగిపోతోందో!

రిక్షా ఊరు దాటి దూరంగా వెడుతోంది.

"ఏంటబ్బాయ్, పరాత్పరంగారి ఇల్లు ఊరికి కొంచెం బయటగా వుంటుందని విన్నాను కానీ మరీ యింత దూరమా? " అనుమానంగా రిక్షావాడివేపు చూస్తూ అడిగేరు భువనేశ్వరీదేవి.

"వొచ్చే వొలుకుల కాడే ఆయనుండేది. ఓ అల్లదుగో- ఆడ తెల్లంగ అగుపిస్తున్నాయే, అయ్యే వొలుకులు" అంటూ రిక్షాను మరి కొంచెం వేగంగా తొక్కసాగేడతను.

కిరణ్మయి తనకేం పట్టనట్లు మౌనంగా కూర్చొని చూస్తోందల్లా ఉలిక్కిపడి చూసింది. మరో నాలుగు నిముషాల తర్వాత రిక్షా ఓ స్మశానం దాటాక ఆగింది. అక్కడ ఓ ఆశ్రమంలాంటిది ఉంది.

"ఇంక దిగండమ్మా, ఆ గుడిసెలోనే ఆయనుండేది" అంటూ రిక్షావాడు అటు చూపించేడు.

అది రోడ్డువారగా ఎంక్రోచ్‌మెంటు స్థలంలో వేసుకున్నట్లున్నారు.

గుండ్రంగా ఓ మట్టిగోడ, దానికి 'ప్రవేశ ద్వారం' అనే ఓ కంతా, ఆ కంతకు వెదురు బద్దల తడికె తలుపూ, ఆ గుండ్రటి గోడ మీద, తెరిచిన గొడుగులా పరచిన వెదురు బొంగులూ, వాటిమీద కొబ్బరి తాళ్ళతో కదలకుండా కట్టిన తాటాకుమట్టల పైకప్పూ, చుట్టూ ఏవేవో మొక్కలూ, చెట్లూ.

"నాయనా! మేము ప్రశ్న చెప్పించుకుందామని వచ్చాం. ఇంతకూ పరాత్పరంగారి ఇల్లు యిదేనంటావా? " అని అనుమానంగా అడిగేరు భువనేశ్వరీదేవి.



రిక్షావాడికి కోపం వచ్చినట్లుంది. సీటు మీంచి అమాంతం కిందికి దూకి "యావ మ్మోవ్, సిత్తరంగా వుందే నీ యవ్వారం! నువ్వు జెప్పిన కాడికే తెచ్చా. అయిగో, వొలుకులు. అదే నువ్వడిగిన మడిసి ఇల్లు. మరి ప్రశ్నలే చెప్పించుకుంటారో, డోలే కొట్టించుకుంటావో నాకెందుగ్గానీ బాడిగె డబ్బిస్తే ఎళ్ళి రిక్షా తోలుకుంటాను"

అన్నాడు గుడ్లు మిటకరిస్తూ.

అప్రాచ్యుడెవడో తోలు బెల్టుతో కొట్టినట్టే ఉలిక్కిపడ్డారు భువనేశ్వరీ దేవి!

రిక్షాలోంచి అమాంతం కిందికి దూకి, మెటికెలు విరుస్తూ,

"ఏమన్నానని అంత మాటన్నావురా జష్ట వెధవ. పెద్దా, చిన్నా తారతమ్యం తెలిసి మాట్లాడవద్దట్రా ముదనష్టపు వెధవా..." అని.

కోపం మరీ తారాస్థాయికి చేరుకోగా మాటలు దొర్లటమే కష్టంగా వుందన్న విషయం గ్రహించి,

"దేవుడే వుంటే నీ కళ్ళు పోతాయిరా, నడ మంత్రపు వెధవా!" అని క్లుప్తంగా ముగిం చేరు భువనేశ్వరీదేవి.

రిక్షావాడు కోపంగా హేండిల్‌కు కట్టిన తాడు బలంగా లాగుతూ, రెండుసార్లు గంటకొట్టి, "యావమ్మోవ్, తిట్టినట్టున్నావ్? నేన్నిన్నేమన్నానని ఈనిన పందిలాగా అరు స్తావ్?" అన్నాడు కోపం తమాయించు కుంటూ శాంతంగానే.

"ఏమీ అన్లేదని అబద్ధమాడతావేం?"

తను ఎంత తమాయించుకుంటోన్నా ఆమె యింకా అలాగే ప్రవర్తించటం రిక్షావా డికి మింగుడు పళ్లేదు.

"చాల్లేపోవమ్మా! సత్తెప్రెమాణకంగా నేనే సెడుమాట అన్లేదు. అలాంటోడ్ని గూడా అస్సలికే కాదు. రుచ్చా ఏస్తన్నంత మాత్త రాన తక్కువోడ్ని అనుకోకు! మాదీ హైక్లాసు ప్రామిలీనే. రుచ్చా పేతురుగాడంటే ఎసు మంటోడో ఎళ్ళి జిన్నాటవరుకాడ ఏ రుచ్చా వాడ్నయినా అడుగు, సెప్తారు" అన్నాడు గర్వంగా.

"ఇంకా నయం! స్వర్గంలోనో, నరకంలోనో వెదికి పట్టుకుని ఆ జిన్నానే అడగమన్నావు కాదు" అన్నారామె మూతి విరుస్తూ.

అప్పటిదాకా వాళ్ళ చర్చలో జోక్యం కల్పిం చుకోలేదు కిర్మణయి. ఇందాకటినించి ఎక్కడో ఆలోచిస్తోంది. చివరికి ఏదో స్ఫురించి కాబోలు

"ఇదిగో బాబూ... పెద్దామెతో ఎందుకు కానీ నాతో మాట్లాడు. ఇంతకూ పరాత్పరం గారంటే పద్మావతీ సంగీత కళాశాల ప్రోగ్రా ములకు అప్పుడప్పుడూ డోలు వాయిస్తుం టారు, ఆయనేనా?" అని అడిగింది శాంతంగా.

కిరణ్మయి జోక్యంతో వాతావరణం పూర్తిగా మారిపోయింది. వాన వెలిసినట్ల యింది.

"అదేంటో తెలవదుగానీ ఆయన మాత్రం డోలు వాయిస్తాడు. పెద్దపెద్దోళ్ళు భజనల క్కూడా పట్టుకపోతుంటారు. సింతామణి డ్రామా కూడా ఆడిస్తుంటాడు. పొద్దుగాల, పొద్దుమీంకి ప్రెశ్నలు చెప్తాడు. లీడరు కూడా. మంత్రగాడని ఊరందరికీ తెలుసు" వివరించేడు రిక్షావాడు.

భువనేశ్వరీదేవి అంతా విని మనసులోనే నొచ్చుకున్నారు. నిష్కారణంగా వాడితో గొడవపట్టం క్షుద్రశక్తుల పీడ విరగడైపోతూ పోతూ చివరిసారిగా చూపించిన ప్రభావం అని భావించి, బొడ్లోంచి డబ్బు తీసి అతనికి యిస్తూ, "మరేం అనుకోకు" అన్నారు సౌమ్యంగా.

అతను డబ్బును కండువాలో పెట్టి మెలి పెట్టి తలకు చుట్టుకుని వెడుతూ వెడుతూ, "ఆ ఇంటికాడ రుచ్చా ఎక్కితే మార్కండేయ





లుగోరి మడుసులనుకున్నా. అందుకే మర్యాదిచ్చా..." అని కొరకొరా ఒకసారి భువనేశ్వరీదేవివేపు చూసి హాండిల్ పట్టుకుని వెళ్ళేందుకు ముందుకు లాగేడు.

భువనేశ్వరీదేవి గుండె ఝుల్లుమంది!

"అబ్బాయ్... నాయనా... ఆగాగు" పిల్చేరామె.

రిక్షా ఆగింది.

"మరేం లేదు! మళ్ళీ వెళ్ళేందుకు రిక్షా దొరక్కపోతే యిబ్బంది పడతాం. పెద్ద ముండను. పనయ్యేదాకా ఓపికపట్టి ఆగేవంటే మళ్ళీ నీ రిక్షాలోనే ఇంటికి వెడతాం. నువ్వడిగినంత బాడుగ యిస్తాను". అన్నారు భువనేశ్వరీదేవి.

"అట్లాగే!" అంటూ అతను రిక్షాను రోడ్డు పక్కకు తీసి ఆపేడు.

"రిక్షా అబ్బాయీ... మేం పరాత్పరంగారి కోసం వచ్చినట్లు ఎవ్వరికీ చెప్పబోకేం!" అని అతడికి వినిపించేట్లు పెద్దగా చెప్పి, ఆ ఇంటివేపు నడిచేరు భువనేశ్వరీదేవి.

కిరణ్మయి "నేను రాన్లే అమ్మా, నువ్వు వచ్చేంతవరకు రిక్షాలోనే కూర్చుంటాను" అంది భువనేశ్వరీదేవితో.

ఆమె విన్లేదు బలవంతంగా కిరణ్మయి చెయ్యి పట్టుకుని పరాత్పరం గుడిసెలోకి లాక్కుపోయింది.



పూరిల్లే అయినా లోపలికి వెడితే అది చాలా విశాలంగా వుంది.

అందులో ఒక మూలగా మూడడుగుల ఎత్తు మట్టిగోడపెట్టి మధ్యలో చిన్న పొయ్యి కట్టి వుంది. దాని పక్కనే వంటచెరకుగా వినియోగించే ఎండిపోయిన జపాన్ తుమ్మ కంప పుల్లలున్నాయి. అక్కడ గోడలన్నీ పూర్తిగా మసిబారి అసహ్యంగా కనిపిస్తున్నాయి. రెండో, మూడో జర్మన్ సిల్వర్ అంట్లగిన్నెలూ, ఓ మట్టికుండా, దానిమీద ఓ మూకుడూ తప్ప మరేం లేవు.

అది పరాత్పరం వంటగది!

ఆ వంటగది మూడడుగుల గోడకు కొంచెం అవతలగా గుడిసె గోడకు మేకులు కొట్టి ఇంగ్లీషు 'యు' ఆకారంలో వేలాడదీసిన పాత రిబ్బనుమీద రెండు ప్యాంట్లూ, మూడు చొక్కాలూ వేలాడుతోన్నాయి. అవి బాగా పాతబడిపోయి స్నేహపూర్వకంగా పట్టిలాగినా పర్రున చిరిగిపోయేట్టున్నాయి.

పరాత్పరం ఇంట్లోకి వెళ్ళగానే కిరణ్మయి ముందుగా గమనించింది ఆ వాతావరణాన్నే.

"అమ్మా! ఈ మంత్రగాడి యింట్లో అన్నీ ఫారిన్ సామాన్లే!" అంది భువనేశ్వరి చెవిలో రహస్యంగా.

"ఫారిన్ సామాన్లా? " ఆశ్చర్యపోయింది భువనేశ్వరి.

"అవును! జపాన్ తుమ్మకంపా, జర్మన్ సిల్వర్ గిన్నెలూ..."

"చాల్లే నోర్మూసుకో! గొప్పవాళ్ళంతా అలా నిరాడంబరంగానే వుంటారు!" మందలించేరు భువనేశ్వరీదేవి.

అప్పటికే విధి బాధితులు కొంతమంది అక్కడ చాపలమీద కూర్చుని పరాత్పరంగారి కరుణా కటాక్ష వీక్షణాలకోసం తమ వంతు ఎప్పుడు వస్తుందా అని ఎదురుచూస్తూ సహనంగా కూర్చున్నారు.

భువనేశ్వరీదేవి, కిరణ్మయి కూడా వాళ్ళ

తోపాటు కూర్చున్నారు.

సందర్శకులు కూర్చున్న చాపలకు ఎదురుగా వున్న గోడకు కాళికమ్మవారి తైలవర్ణ చిత్రం వేలాడ్తోంది. ఆ చిత్రానికి చుట్టూ మట్టిగోడ నెర్రెల్లో వెలిగించి దూర్చబడ్డ అగరువత్తుల పొగలు స్ప్రింగులు వదుల్తోన్నాయి.

అమ్మవారి చిత్రానికి ముందు మరేవో చిన్నచిన్న లోహపు విగ్రహాలు, చెదలు సహం కొరుక్కుతిన్న నాలుగో ఐదో పాతకాలపు పుస్తకాలూ కనిపించేయి.

వాటి పక్కగా మట్టి మూకుళ్లలో నిశ్చలంగా వున్న నూనెలోంచి పొడుచుకొచ్చి మూకుళ్ళ అంచులమీద విశ్రాంతి తీసుకుంటో వత్తులు వెలుగుతోన్నాయి.

మందంగా వెలుగుతోన్న ఆ వత్తుల కాంతికి మూకుళ్ళలోని నూనె రక్తంలా ఎర్రగా కనిపిస్తోంది!

అమ్మవారి చిత్రానికి ముందు నేలమీద అరగజం పరిధిలో అరంగుళం మందంగా కుంకుమ చల్లివుంది. ఆ ఎర్రటి కుంకుమ పొడి మధ్యలో అక్కడక్కడా డాగుల్లా పసుపు కనిపిస్తోంది. ఆ పసుపు డాగుల మీద ఓ డజను దాకా కుంకుమలో ముంచిన నిమ్మకాయలున్నాయి.

పరాత్పరం ధ్యానంలో వున్నారు. ఒక్కో నిమ్మకాయనే చేత్తో తీసుకుని నొసటికి ఆన్చిపెట్టి తనలోతనే ఏవో మంత్రాలు చదివి నిముషం తర్వాత ఆ నిమ్మకాయను ముక్కుదగ్గర పెట్టుకుని వాసన చూసి మళ్ళీ ఆ పసుపుమీద పెడుతోన్నాడు.

అలా నిమ్మకాయలన్నింటినీ మంత్రమయం చేసింతర్వాత పరాత్పరం ఇహలోకంలోకి వచ్చి సందర్శకుల వేపు పరిశీలనగా చూశారు.

అక్కడ అంతా నిశ్శబ్దంగా వుంది!





పరాత్పరంను కిరణ్మయి గుర్తుపట్టింది!

నల్లటి రంగులో సన్నగా, పీలగా వున్నాడు. అతని పిట్ట తలకాయమీద సూదుల్లాంటి రాగిరంగు వెంట్రుకలు పోరుకు సిద్ధమైన ముళ్ళపంది శరీరాన్ని గుర్తుచేస్తోన్నాయి. మధ్యలో నరికిన బైండింగ్ వైర్ల గుత్తిలా పొడుచుకొచ్చే ఆ వెంట్రుకలు అతడ్ని చూడగానే ఏదో విభ్రమానికి గురిచేసేందుకు దోహదపడుతోన్నాయి.

అతడి కళ్లలో క్రౌర్యం స్పష్టంగా కనిపిస్తూ కనికట్టు చేస్తోన్నట్టుంది! వేషధారణలో కూడా విలక్షణతే! ముదురు రంగు లాల్చీ దర్భపుల్లల్లాంటి కాళ్ళకు అంటుకుపోయిన బిగుతు పైజమా...

"అమ్మా... కాళీ!" పెద్దగా అరిచేడు పరాత్పరం.

సందర్శకుల్లో చలనం!

ఊపిరి బిగబట్టి అందరూ ఆయనవేపే ఆత్రంగా చూస్తున్నారు.

పరాత్పరం పక్కనే వున్న నశ్యం డబ్బాలోంచి చిటికెడు నశ్యాన్ని బయటికి తీశాడు. బొటనవేలుకూ చూపుడు వేలుకూ మధ్య బిగించిన నశ్యాన్ని ముక్కుదగ్గర పెట్టుకొని గట్టిగా ఎగపీల్చి "హా..." అంటూ నోటితో గాలి వదిలేడు, తమకంలో -తేలిపోతూ.

అతను కళ్ళు విప్పార్చి చూసేడు. చూపులు ఒక్కొక్కర్నీ తడుముతూ చివరకు కిరణ్మయిమీద క్షణకాలం నిశ్చలంగా ఆగేయి.

అతడి కళ్ళు జ్యోతుల్లా ఎర్రగా మండుతోన్నాయి.

నశ్యం డబ్బా కిందపెట్టేడు. చేత్తో, మంత్రించిన నిమ్మకాయ ఒకదాన్ని పైకి తీసి నొసటిదగ్గర పెట్టుకుని కళ్ళు మూసుకుని తిరిగి ధ్యానంలోకి వెళ్ళిపోయేడు.

అంతా నిశ్శబ్దంగా వుంది.

"ఈరోజే కొత్తగా నా దగ్గరికి వచ్చిన బాధి

తులకు క్షుద్రశక్తుల పీడ అధికంగా వుంది. అయినా, ఆశ్రమ పీఠాధిపతి మీవాడైన ప్పుడు మీరు నన్ను శరణుకోరటం విచిత్రం కదూ? " అన్నారు పరాత్పరంగారు కళ్ళు తెరవకుండానే.

భువనేశ్వరీదేవి ఉలిక్కిపడి చూసింది.

సందర్శకులంతా ఒకళ్ళ ముఖాలొకళ్ళు చూసుకున్నారు.

"ఆశ్చర్యపోతారేం? ఇదేం నా మహత్యం కాదు. ధ్యానంలో వుండగా అమ్మ చెప్పిందే. కిరణ్మయీ! మీ ఇంట్లో అందరికన్నా గ్రహాలు నీకు మాత్రం చాలా అనుకూలంగా వున్నాయి. అందువల్లనే యింకా ఎక్కువ అనర్థాలు జరక్కుండా మీ కుటుంబం కాపాడబడుతోంది!" అన్నాడు మళ్ళీ పరాత్పరం.

కిరణ్మయి మౌనంగా వింటోంది. సందర్శకులంతా గుసగుసలు పోతున్నారు.

పరాత్పరం సందర్శకులందర్నీ కలియ చూసి, "అరుగో అందరికన్నా వెనగ్గా ఈరోజే కొత్తగా యిక్కడికి వచ్చిన వారిని గురించే అమ్మ చెప్పింది. ఆవిడ పేరు భువనేశ్వరీదేవి. బ్రహ్మాంజీ కన్నతల్లి. ఆవిడ కూతురే కిరణ్మయి" అన్నారాయన శాంతస్వరంతో.

సందర్శకులంతా తలలు తిప్పి భువనేశ్వరీదేవి వేపు ఆరాధనగా చూశారు. అటు తర్వాత పరాత్పరం దివ్యదృష్టినీ, మహిమనూ కొనియాడుతూ ఆనందంలో మునిగి పోయేరు.

భువనేశ్వరీదేవికి పరాత్పరంమీద ఆ క్షణంలోనే అపారమైన భక్తివిశ్వాసాలు కుదురుకున్నాయి.

"ఎంచక్కా కిరణ్మయీ... అంటూ పేరు కూడా చెప్పేరు చూడు. పెద్దావిడే పీఠాధిపతి తల్లి అని కూడా చెప్పారు. విచిత్రంగా లేదూ? " అంటోందెవరో ప్రౌఢ పక్కన కూర్చున్న స్త్రీతో.

అందరికళ్లూ భక్తిపారవశ్యంలో అర్థనిమీలితాలయ్యాయి.

పరాత్పరం మళ్ళీ చెప్పాడు.

"భువనేశ్వరీదేవిగారూ! అంతా అమ్మ మహిమ! మీరు నా దగ్గరికి సకాలంలో వచ్చారు. మీ సమస్యలకు పరిష్కారం అమ్మ చూపిస్తుంది. మీ సమస్య చాలా గడ్డు సమస్య కనుక సందర్శకులంతా వెళ్ళిపోయాక అమ్మవారికి ప్రత్యేక పూజ జరిపి మీ విషయం మొత్తం ఆరాతీస్తాను. అటు తర్వాత పరిష్కారం ఏంటో అమ్మనే అడిగి చెప్తాను" అన్నాడు పరాత్పరం.

భువనేశ్వరీదేవి వినమ్రంగా తలూపింది.

"పరాత్పర స్వామీ! మా పిల్లాడు బడికి వెళ్ళలేదని వాళ్ళమ్మ కొడితే ఇంట్లోంచి పారిపోయాడు. వాడి ఆచూకీ చెప్పండి స్వామీ!' ' అంటూ ఎవరో ముందుకు వెళ్ళి పూజా కుంకుమ మధ్యలో వున్న సిల్వర్ పళ్ళెంలో పదిరూపాయల కాయితంవేసి, నమస్కరించి కూర్చున్నారు.

పరాత్పరం మళ్ళీ నిమ్మకాయతో క్షణ కాలం ధ్యానంలోకి వెళ్ళి "ఆc... చిన్నవాడే అయినా మీ అబ్బాయి చాలా అభిమానస్తుడు. తల్లిదండ్రులకు పేరు తెచ్చేవాడే. కానీ గ్రహబలం వక్రంగా వుంది. అందుకే ఇంట్లోంచి పారిపోయాడు" అన్నాడు.

పిల్లవాడి తల్లి గర్వంగా అందరివేపూ ఒక సారి చూసి, "అయితే స్వామీ మాకు పేరు తెచ్చేవాడే అంటారా? " అడిగింది ఆసక్తిగా.

అదే ఆమె చేసిన పొరపాటు!

అందుకు ఆగ్రహించారు పరాత్పరం. "ఛీ... ఛీ... మీ అలవాట్లు కాట్లోకి వెళ్ళినా పోవు. తాటాకు బుట్టల సోదెమ్మలను క్రాస్ ఎగ్జామినేషన్ చేసినట్లు కాళికామ్మవార్ని కూడా చేస్తావా? ఎంత అహంకారం!" అని గద్దించేరాయన.

ఆమె భయపడి మౌనంగా కూర్చుంది.

"అయినా ఆ పిల్లవాడ్ని అంత నాసిరకం స్కూల్లో ఎందుకు చేర్చారు? " అడిగేరాయన



ధ్యానంలోనే.

"నాసిరకం స్కూలా? అబ్బే కాదే! వేల రూపాయలు కట్టి సెయింట్ మేరీ స్కూల్లో కదా వాడ్ని చేర్పించింది..."

"అజ్ఞానం అంటే అదే! అర్థం కాదీ అల్ప జీవులకు. 'నాసిరకం' అంటే కిరస్తానీయుల బడియని భావన" అన్నారాయన.

ఆమె తన అజ్ఞానానికి సిగ్గుతో కుంచించుకుపోయింది.

"పిల్లవాడ్ని కొడితే మాత్రం అంత మూర్ఖంగా కొట్టాలా? వాడి వీపుమీద ఎంత దెబ్బతగిలిందో తెలుసా?"

"లేదు స్వామీ... వీపుమీద కొట్టనేలేదు. ఓ డజను మొట్టికాయలు తలమీద వేశానంతే"

"అదే అజ్ఞానం! ఆవేశంలో నువ్వు మొట్టికాయలు తలమీద వేసినా కొన్ని వాడివీపు మీద తగిలాయి. వాడు ఇల్లు విడిచి వెళ్ళింది తలమీద వేసిన మొట్టికాయలక్కాదు. వీపుకు తగిలిన మొట్టికాయలకు!"

ఆమె భయం భయంగా భర్తవేపు చూసింది. ఆయన కొరకొరా భార్యవేపొకసారి చూసి తల పక్కకు తిప్పి-

"స్వామీ! జరిగిందేదో జరిగింది. ఇంతకూ మా అబ్బాయి ఎక్కడున్నాడో, ఏం చేస్తున్నాడో, ఎప్పుడు వస్తాడో సెలవిస్తారా?" అని అడిగేడు సూటిగా.

పరాత్పరం మళ్ళీ ఇంకో నిమ్మకాయతీసి నొసటి దగ్గర పెట్టుకుని కళ్లు మూసుకున్నాడు.

అందరూ ఆసక్తిగా ఆయనవేపే చూస్తున్నారు.

"పిల్లలకు అందుబాట్లో విలువైన నిధులుంచి ఆదమరిస్తే అవ్వందుకుని పిల్లలు పారిపోరూ?" అన్నాడు పరాత్పరం

"అంత పెద్ద నిధులేం లేవు. మేక్కు తగిలించిన నా చొక్కాజేబులో ఓ యాభైవుంటే కొట్టేసి వెళ్ళాడు" చెప్పాడు పిల్లవాడి తండ్రి.

"బలహీనుడు వద్ద ఒక్క రూపాయ వున్నా అది అతడికి నిధికిందే లెఖ్ఖ. ఇక పోతే, మీ అబ్బాయి మన రాష్ట్రం దాటిపోలేదు. పట్టుకుపోయిన డబ్బులో కాస్తో కూస్తో మిగిల్తే ఇప్పుడే ఓ ఇరానీ హోటల్లో పరోటా, పాయా తింటున్నాడు. దుష్టగ్రహాలు బలహీనపడ్డ మరుక్షణమే అతను తప్పక తిరిగివస్తాడు"

"స్వామీ, అపచారం! పరమ ఆచార పరాయణులైన బ్రాహ్మణులం. మావాడు ఇరానీ హోటల్లో పాయా, పరోటా తింటం ఏమిటి?"

"పిదపకాలం నాయనా, మనం చెయ్యగల్గిందేం లేదు" అని పరాత్పరం కళ్లు తెరిచేరు.

"స్వామీ! మా ఇద్దరికీ పెళ్ళై ఐదేండ్లయినా ఇంకా సంతానప్రాప్తి కలగలేదు..." మరెవరో జంట తమ గోడు చెప్పుకున్నారు.

"మీ పడకగదిలో దోషం వుంది. వెంటనే దాన్ని పడగొట్టి వీధివాకిటి పక్కనే కట్టించండి" చెప్పారు పరాత్పరం.

భువనేశ్వరీదేవి కూతురువేపు చూస్తూ, "చూసేవటే అమ్మాయీ... పరాత్పరంగారికి వాస్తులో కూడా ప్రవేశం వుంది" అన్నారు.

అమ్మ అన్న మాటల్ని కిరణ్మయి పట్టించుకోలేదు. కానీ ఆ మాటలు విన్న ఎవరో స్త్రీమాత్రం కల్పించుకుని, "ఒక్క వాస్తేనా, స్వామివారు ఆలిన్నాల్!" అని భువనేశ్వరి చెవి దగ్గర మూతిపెట్టి "చాతబళ్లు కూడా చేస్తారట. వారు చేస్తే తిరుగే వుండదట!" అంది రహస్యంగా.

త్వరగా తెమిల్చి అందర్నీ పంపించివేశాడు పరాత్పరం. భువనేశ్వరీదేవినీ, కిరణ్మయినీ ముందుకు వచ్చి కూర్చోమని సైగచేశాడు.

ఇద్దరూ వెళ్ళి ఆయన ముందు చాపమీద కూర్చున్నారు.

"నీ భర్త చనిపోయిందగ్గర్నించి మీకు అరిష్టాలు ఎక్కువయ్యాయికదూ?" భువనే





శ్వరీదేవి ముఖంలోకి సూటిగా చూస్తూ అడిగేడు పరాత్పరం.

ఆమె 'నిజమే' అన్నట్లు తలవూపింది.

పరాత్పరం మరో నిమ్మకాయ చేత్తో తీసుకుని మళ్ళీ ధ్యానంలోకి వెళ్ళబోతోన్న సమయంలో ఎవరో హడావుడిగా వచ్చి 'స్వామీ!' అని పిల్చేరు పెద్దగా.

పరాత్పరం కళ్లు తెరిచిచూశాడు.

"స్వామీ! తప్పిపోయిన మా అమ్మాయి కాకాని గుడి దగ్గర వుందనీ, మర్రిచెట్టు ఊడలు పట్టుకుని ఉయ్యాల లూగుతున్నదనీ, వెంటనే వెళ్ళి అమ్మాయిని తెచ్చుకోమనీ మీరు సెలవిస్తే ఆఘమేఘాలమీద వెళ్ళాను. తీరా వెడితే అక్కడ మా అమ్మాయి కనిపించలేదు" అన్నాడు ఆ వచ్చిన వ్యక్తి ఖిన్నవదనంతో

"నేను చెప్పిన తర్వాత ఎంత సేపటికి మీరు అక్కడికి వెళ్ళారు? "

"అరగంటలోనే! మోటారుబైక్ మీద వెళ్ళాను"

"కాకాని గుడి దగ్గర ఊడలమర్రి వుందా? "

"ఉంది స్వామీ"

"మీ అమ్మాయి ఊగింది ఆ ఊడలకే! మీరక్కడికి వెళ్ళేదాకా అమ్మాయి ఆగలేదు. కొంచెంసేపు ఊగి తర్వాత ఎటో వెళ్లుంటుంది. శుభఘడియలు రాగానే కనిపిస్తుంది" చెప్పాడు పరాత్పరం.

ఆ వ్యక్తి వెళ్ళిపోయాడు.

భువనేశ్వరీదేవి అతను వెళ్ళిపోయాడని నిర్ధారించుకుని దీనంగా పరాత్పరం వేపు చూస్తూ, "ఇన్నాళ్లకు మిమ్మల్ని కలవటం కుదిరింది. శుభఘడియలంటే అలాగే వుంటాయేమో! ఇప్పుడు నాకు కొంచెం స్థిమితం చిక్కింది. ఎన్నాళ్లనించి మనసులోనే మధనపడుతున్నానో..." అంది.

"అర్థమైంది... క్షుద్రశక్తులు మిమ్మల్ని వేధిస్తున్నాయి. ఆ పీడ అంత తేలిగ్గా వదిలేది కాదు. ఆవాహన జరిపి వాటిని నేర్పుగా కట్టడి చెయ్యాలి"

"మీరు ఏమైనా చెయ్యండి. అవి నిష్కారణంగా నా భర్తను బలితీసుకున్నాయి. మా పెద్దబ్బాయి మార్కండేయుల్ని కూడా అవి పట్టి ఆడిస్తున్నట్లు నాకు అనుమానం. వాడి మాటతీరే అదోరకంగా వుంటోంది" చెప్పిందామె.

"వెంటనే కార్యక్రమం ప్రారంభిస్తాను. క్షుద్రశక్తుల పీడనించి మిమ్మల్ని కాపాడ్తాను" హామీ ఇచ్చాడు పరాత్పరం.

"ఇంతకూ మమ్మల్ని ఏం చెయ్యమంటారు? "

"మీరు చేసేదేం లేదు. అంతా నేనే చేస్తాను. మీ పని అల్లా డబ్బు ముట్టచెప్పటమే. దాన్ని నేను ఆశించను. నా బ్రతుకు తెరువు నాకుంది భుక్తికోసం నేను వేరే కష్టపడి డబ్బు సంపాదిస్తుంటాను. భజనలకూ, సాంస్కృతిక కార్యక్రమాలకూ డోలు వాయిస్తాను. వాస్తుదోషాలు చెప్పి పదో పరకో అడిగి తీసుకుంటాను. అంతేకానీ అమ్మవారి వ్యవహారంలో మాత్రం వ్యాపారం చెయ్యను. ఇక్కడ వచ్చే డబ్బంతా అమ్మవారి ఖర్చులకే వెచ్చిస్తాను" చెప్పాడు పరాత్పరం.

"తమర్ని మేం శంకించటంలేదు. కేవలం ఎంత ఖర్చవుతుందో అన్న అంచనా కోసం మాత్రమే..." నసిగేరు భువనేశ్వరిదేవి.

"మరెంతో కాదు... త్రిరాత్రులు కాళీమాత పూజలు జరిపి, క్షుద్రశక్తులకు ప్రతిగా మరింత బలమైన క్షుద్రమంత్రాలతో వాటిని కట్టడి చెయ్యాలి. మీకు చెప్పకూడని క్రతువులు ఎన్నో జరిపించాలి. అంతా కలిసి ఎంతా, వెయ్యయితే ఎక్కువా, తొమ్మిదొందల తొంభై తొమ్మిదైతే తక్కువా!"

క్షణంసేపు ఆలోచించి, "సరే... సాయంత్రం డబ్బు పంపిస్తాను. ఇక భారమంతా మీదే!" అన్నారు భువనేశ్వరిదేవి.

"నిస్సందేహంగా వెళ్ళండి. అమ్మ దయవల్ల అంతా సవ్యంగానే జరుగుతుంది. ఏ విషయంలోనూ ఏలాంటి సంకోచం వద్దు.



అన్నింటికీ నేనున్నానుగా. నా సత్తా ఎలాంటిదో మీకు తెలియకపోవచ్చు. కానీ మీ అమ్మాయి కిరణ్మయికి బాగా తెలుసు" అన్నాడు పరాత్పరం కిరణ్మయి ముఖంలోకి అదోలా చూస్తూ.

కిరణ్మయి ఒళ్లు భయంతో కంపించసాగింది.

"నా బ్రతుక్కు అడ్డం రాకుంటేనే నీ రహస్యం దాచేది. జాగ్రత్త" అన్నట్లు భువనేశ్వరి చూడకుండా కిరణ్మయిని చూశాడు పరాత్పరం

★ ★ ★

ఆ రాత్రంతా కిరణ్మయికి కంటిమీద కునుకే లేదు. తీవ్రంగా ఆలోచిస్తూనే వుంది.

తన కళ్ళముందే అమ్మ పరాత్పరం వలలోపడిపోతున్నా, పరాత్పరం దగ్గర ఎలాంటి మహిమలూ లేవని చెప్పే సాహసం ఆమెకు కరువైంది.

కొన్ని సంఘటనలు జీవితాలను ఎంత అనూహ్యంగా మలుపు తిప్పుతాయో!

గాఢంగా నిట్టూర్చి మంచంమీంచి లేచింది కిరణ్మయి. వెళ్ళి కిటికీ దగ్గర నించొని కిటికీ కమ్మీల మధ్యనించి బయటికి చూసింది.

ఆకాశంలో చంద్రుడు కంగాళీగా పరుగులు పెడుతున్నాడు.

సమయం మూడు గంటలు కావస్తోంది.

భయం, ఉత్సుకత, ఆవేశం, ఆరాధన, న్యూనత, ఇత్యాది భావావేశాలన్నీ కలగాపులగంగా ముట్టడించిన అదోరకం మానసిక స్థితిలో కిరణ్మయి గోపీకృష్ణ జ్ఞాపకాల అలలమీద తేలిపోతోంది.

ఘటనో, దుర్ఘటనో తెలియనిదే అయినా అనుక్షణం ఆమెను గోప్యంగా వ్యధ పెడుతోన్న ఆ సంఘటన మనోఫలకంమీద అక్షరాలుగా సూదులతో పొడిచి చెక్కుతోంది.

ఆరోజు...

గోపీకృష్ణ కిరణ్మయికి వీణను బహూకరించిన సాయంత్రం రోజుటికి మల్లేనే సంగీత కళాశాలకు వెళ్లింది కిరణ్మయి.

ఆరోజు విద్యార్థులెవరూ ఇంకా కళాశాలకు రాలేదు.

"అమ్మా! కిరణ్మయీ! నేను అర్జంటుగా బజారుకు వెళ్ళిరావాలి. త్వరగానే వచ్చేస్తాను. ఈలోగా నువ్వు నీకు ఇష్టమైన కృతులను వల్లెవేస్తుండు. ఎవరైనా వస్తే వాళ్ళ పాఠాలను బట్టి సాధన చేయిస్తుండు' ' అని చెప్పి సంగీతం టీచరుగారు బజారుకు వెళ్ళారు.

అప్పుడు కిరణ్మయి తప్ప అక్కడ మరెవ్వరూ లేరు.

ఉబుసుపోక, అక్కడే వున్న వీణను కిందికిదించి ముందుపెట్టుకుని మంద్ర స్వరంతో రాధామాధవీయం గానంచేస్తూ సుతారంగా వీణమీటుతూ ఆ గానంలో లీనమై తన్ను తానే మర్చిపోయింది కిరణ్మయి.

అలా ఎంత సమయం గడిచిపోయిందో కానీ ఎవరో లయబద్ధంగా కొట్టిన చప్పట్లకు కిరణ్మయి ఉలిక్కిపడి చూసింది.

ఎదురుగా గోపీకృష్ణ!

తన గానాన్ని బావ విన్నాడని గ్రహించిన ఆమె గుండెలయ తప్పింది. రక్తనాళాల్లో ప్రసరణ అధికమైంది. సిగ్గుతో బరువెక్కిన కనురెప్పలు వాలిపోయాయి. చేష్టలుడిగినట్లు ఆమె నిశ్చలంగా నించుండిపోయింధి.

గోపీకృష్ణ అడుగులో అడుగు వేస్తూ కిరణ్మయి దగ్గరికి వచ్చాడు. ఆమెవేపు అపురూపంగా చూస్తూ, "కిరణ్! నా అంచనా తప్పలేదు. ఆ నిర్జీవ వీణాతంత్రులకు జీవం పోసి రాగం పలికించినట్లే, నా అన్నవాళ్ళెవ్వరూ లేని ఈ నిర్భాగ్యుడికి బ్రతుకు గమనంలో వెలుగు చూపించగల దివ్వెవూ నువ్వే. నీ సహచర్యం నాకు ప్రాణవాయువు. నీ ప్రేమకు పాత్రుడనై నిన్ను అర్ధాంగిని చేసుకుని ఆజన్మాంతం నీ భర్తగా ఆరాధకుడిగా జీవితాన్ని ఆనందమయం చేసుకునే అవకాశం నాకు కల్పించవూ?" అంటూ మరికొంచెం ముందుకు జరిగి,




దోసిలితో అమాంతం ఆమె గులాబి బుగ్గల మీద ఆబగా, ఆవేశంగా- అలసిపోయేంత దాకా చుంబించేడు.

ఏదో వివశత్వం.

ప్రతిఘటించాలన్న ఆలోచన ఎంత బలంగా కల్గిందో అంతే బలంగా ఆ ఆనం దాన్ని అనాలోచితంగా ప్రతిఘటించి కోల్పో వద్దనిపించింది.

మంచి, చెడుల విశ్లేషణకు అవకాశమేలేని అనిర్వచనీయమైన అద్భుత ఆనంద సమ యమది.

సున్నితంగా ప్రతిఘటిస్తూనే అంతకన్నా సున్నితంగా గోపీకృష్ణ గుండెమీద వాలిపో యింది కిరణ్మయి.

అతడిలో ఏదో ఒకమూల బిక్కుబిక్కు మంటూన్న కొద్దిపాటి జంకూ ఆమె అలా గుండెమీద వాలిందో లేదో ఇట్టే మటుమా యమైంది.

మరింతగా విజృంభించి నేర్పరి చిత్రకారు డికిమల్లే కొనగోటితో ఆమె నునులేత శరీ రంమీద ఏవేవో చిత్రాలు గీసేడు. మునిప ళ్లతో ఆ చిత్రాలకు రంగులు అద్దాడు.

కిరణ్మయికి అప్పుడు సంఘం, నియ మాలు, కట్టుబాట్లూ ఏమీ గుర్తులేదు.

తనెవరో తనకు గుర్తులేదు.

తన చుట్టూ ఓ ప్రపంచం వుందన్నదీ గుర్తులేదు.

అన్నీ గుర్తుండాలన్నది అసలు గుర్తేలేదు.

అంతా ఏదో మైకంగా వుంది.

ఆ మైకంలో తనకు మరేదో కావాలనిపిం చింది తన ఎదరగానే వుందనిపించింది.

అమాంతం అతడ్ని లతలా అల్లుకుపో యింది.

తను వొంపులు తిరుగుతూ అతడూ అందుకు ప్రతిగా తిరుగుతూన్న వొంపు వొంపుకూ ఆనందపుటంచులు తాకుతూ, ఆ ఆనందం అలాగే శాశ్వతం కావాలనుకుంటూ శాశ్వతం కాకుండా చెదిరి పోతుందేమో అన్న భయంతో అతడ్ని మరింత గాఢంగా పెనవేసుకుపోయింది కిర ణ్మయి.

ఆ ఘట్టం ఇట్టే ముగిసిపోయింది.

ఆ తుఫాను ఇట్టే తీరందాటి తేలిపో యింది.

అంతలోనే... "హి... హి... హి... హి! అని వికృతంగా వినిపించిందో నవ్వు.

ఇద్దరూ ఉలిక్కిపడి చూశారు.

ఆ నవ్వు నవ్వింది పరాత్పరం.

అంతే...

క్షణంలో బట్టలు సరిచేసుకుని కిరణ్మ యికి మాటమాత్రం చెప్పకుండానే బయటికి పరుగుతీశాడు గోపీకృష్ణ.

నిర్ఘండెపడ్డట్లు అలాగే నించుండిపో యింది కిరణ్మయి.

అలాంటి స్థితిలో ఆమెను ఒంటరిగా విడి చిపెట్టి పలాయనం చిత్తగించిన అతడి చర్యను బట్టి గోపీకృష్ణ స్వభావాన్ని అంచనా వేసుకుని వుంటే కిరణ్మయి చరిత్ర ఎలా వుండేదో.

కానీ, గోపీకృష్ణదే తప్పన్న నిజాన్ని విస్మ రించింది. ఇలాంటి సమయాల్లో అందరూ వ్యవహరించినట్లే ఆమే వ్యవహరించింది. దోషిత్వం మొత్తం తనదే అన్నట్టు చూస్తో నించుంది.

"ఎవడా కుర్రాడు? మొత్తానికి అంద గాడ్నే పట్టావ్" అన్నాడు పరాత్పరం వ్యంగ్యంగా.

ఆ వ్యంగ్యాన్ని గమనించేస్థితిలో ఆమె లేదు. కోల్పోయిన ధైర్యాన్ని కూడగట్టుకుం దుకు ప్రయత్నిస్తోంది.

"ప్రేమించుకున్నారా? అయితే మాత్రం ఇలా బరితెగించి పవిత్రమైన సంగీత కళా శాలలో, అందునా నటరాజ విగ్రహం ముందు..."

ఆమెలో అహం నిద్రలేచింది.

"ఏం నేరం చేశాం? అతను మా బావ. మేం పెళ్ళికూడా చేసుకోబోతున్నాం. మా ఇద్దరికీ ఇష్టమైనప్పుడు లోకులకేం బాధ?"





అంది కటువుగానే.

అతడు హేళనగా నవ్వేడు. "అయితే మానభంగం కాదన్నమాట. అదనుకుని పోలీసు రిపోర్టు ఇద్దామనుకున్నాను" అన్నాడు ఓరగా చూస్తూ.

"ఇచ్చుకో పో..." అని కిరణ్మయి చెదిరిన తలను చేత్తో సరిచేసుకుని టీచర్ వస్తోందేమో అని వీధిలోకి చూసింది.

ఆమె వస్తోన్న జాడే లేదు.

ఆ సమయంలో తనది ఎంతో పైచేయిగా వుంటుందని భావించాడు పరాత్పరం. కానీ పరిస్థితి అడ్డం తిరిగింది. మొదట కిరణ్మయి కొంచెం తొట్రుపాటు చెందినా క్రమంగా ధైర్యం పుంజుకుని అతడ్ని లక్ష్యపెట్టటంలేదు.

"నా కడుపులో ఇలాంటివి దాగవు తెలుసా? " అన్నాడు గంభీరంగా.

"దాక్కపోతే దండోరా వేసి అందరికీ చెప్పుకో" అంది కిరణ్మయి కోపంగా.

పరాత్పరం అహం దెబ్బతింది. అదే కనుక కిరణ్మయి పారిపోయి గోపీకృష్ణ అక్కడ వుండి అలా మాట్లాడివుంటే పరాత్పరం అంతగా పట్టించుకునే వాడు కాదు. ఒక ఆడదలా మాట్లాడటం అతనికి వింతగా తోచింది. తోకతొక్కిన తాచులా లేచింది అహం! క్రూరంగా ఆమెవేపు చూస్తూ "అయినా పెళ్లి కాకుండానే ఇదేంపని? " మీరు గొప్పోళ్లకదూ? " అడిగేడు వెకిలిగా నవ్వుతూ.

ఆ మాటలకు ఉలిక్కిపడ్డది కిరణ్మయి.

తాము ఉన్నతులమనీ, చాతుర్వర్ణ వ్యవస్థలో అగ్రభాగాన వున్నామనే జ్ఞాపకం తనకు లేకున్నా పదే పదే సంఘం పనిగట్టుకుని గుర్తుచేస్తూ స్వేచ్ఛను హరించివేసేందుకు ఎంతగా తపన పడుతుందోనని ఆమెకు గుర్తు వచ్చింది.

జనామోదంకాని చర్యలనే సమాజం ఆసక్తిగా పట్టి చూస్తుంటుంది. ఆ పట్టింపులో నాగరిక చిహ్నాలు అధికమయ్యే కొద్దీ స్వేచ్ఛకు సంకెళ్లు మరింత బలంగా బిగుసుకుపోతుంటాయి.

కిరణ్మయితో మార్కండేయులు నీరో చక్రవర్తి స్వేచ్ఛను నిరశించింది అందుచేతనే కామోసు!

"మీరు పరమపవిత్రులు కదూ? " మరో దెబ్బ వేశాడతను.

ఆమె కళ్లు తవ్వివన చలమలయ్యాయి బేలగా చూసింది. భళ్లున ఏడ్చింది.

పరాత్పరం కళ్ళలో, తన స్థాయికి అందని అందాల చందమామను ఎవరో అందుకున్నారన్న అసూయ తప్ప ఆమెకు అపచారం జరిగిపోతుందన్న బాధేంలేదు. కించిత్తు ఆనందం కూడా మెరుపులా అతడి కళ్లలో మెరవకపోలేదు. మేడ కాలిపోతుంటే గుడిసె ఆనందపడ్డట్టు!

ఆమె ఆలా వెక్కిళ్లు పెట్టి ఏడుస్తూనే వుంది.

క్షుద్రపూజల పేరిట నిశిరాత్రి వేళల్లో నక్కల ఊళలు వింటూ, నిప్పుల్లో కాలి, చిట్లే కపాలాల చిరుగజ్జల చప్పుళ్ళ మధ్య క్రౌర్యమే వృత్తిగా, ప్రవృత్తిగా, క్రూరజంతువుల రాగాలాపనకు మాత్రమే పరిమితమైన అతడి కర్ణేంద్రియాలకు ఆమె విలాపం భూపాల రాగంలా శ్రావ్యంగా వినిపించినట్లుంది.

అతడి అహం నెమ్మదిగా, అంచెలవారిగా శాంతించింది. దాని స్థానంలో అల్పమైన లౌక్యం తలెత్తింది. ఆ వెకిలి నవ్వునే మంద్రంగా నవ్వుతూ అదే మంద హాసమనుకుని బొంగురు గొంతుతో "అమ్మాయీ! అయిందేదో అయింది. అలా అయిందని అట్టే కుమిలిపోకు. నీ గుట్టు రట్టు చెయ్యకుండా గుండెలోనే అట్టేపెట్టుకుంటాను. కక్కుర్తి మనిషిని కాను. కాళీ ఉపాసకుడ్ని. కాకుంటే నేను అనుగ్రహించినంతవరకే అంతా సవ్యంగా వుంటుంది. ఏమాత్రం ఆగ్రహించినా అనర్థం జరుగుతుంది" అని ఆమెవేపు పరీక్షగా చూసి, "నాకు ఆగ్రహం తెప్పించవుకదూ? " అని అడిగేడు సూటిగా.

ఛిన్న వదనంతో ఆమె ప్రశ్నార్థకంగా చూసింది.

"సమయం, సందర్భం వచ్చినప్పుడు నా కోసం నువ్వేం చెయ్యాలో నేనే చెప్తాను. అంతవరకూ ఏమీ జరగనట్టే ఎప్పటిలాగే వుందాం" అన్నాడు పరాత్పరం.

బయట అలికిడైంది. ఇద్దరూ అటువేపు చూశారు.

సంగీతం టీచరు వచ్చింది.

ఏదో ప్రోగ్రాంలో డోలు వాయించిన డబ్బు తీసుకుని, సంగీతం టీచరుకు చెప్పి అతను వెళ్ళిపోయాడు.

కిరణ్మయి ఇంటికి వెళ్ళింది. ఆరోజంతా గోపీకృష్ణ ఆమెకు ఎదురుపడకుండా తప్పించుకుని తిరిగి, ఇంకా సెలవులు పూర్తికాకముందే ఏదో అర్జెంటుపనులు వున్నాయని ఇంట్లో చెప్పి తెల్లవారగానే హైదరాబాద్ వెళ్ళిపోయాడు.

జరిగిందంతా అలా స్మృతిపథంలో కదలి కిరణ్మయి కిటికీ కమ్ములమీద తలను ఆన్చిపెట్టి తనివితీరా ఏడ్చింది.

ఆవేదన గడ్డకట్టి హృదయం బరువెక్కింది.

అలసిన మనసు విశ్రాంతిని కోరినట్లుంది, వెళ్ళి మంచంమీద వాలిపోయింది.

శరీరం తన ధర్మం తను పాటించింది. కిరణ్మయి క్రమంగా నిద్రలోకి జారుకుంది.

★ ★ ★

క్షుద్రశక్తులు తమను పట్టిపీడిస్తున్నాయనీ, వాటిని కట్టడి చెయ్యమనీ పరాత్పరంను కోరిన రోజు సాయంత్రమే అతను అడిగిన డబ్బు కూడా అతనికి అందే ఏర్పాటు చేశారు భువనేశ్వరిదేవి.

ఆ రాత్రికే కార్యక్రమం ప్రారంభిస్తాననీ, శ్మశానంలో ఆరాధన జరిపి క్షుద్రశక్తులను





రప్పించి వాటిని కట్టడిచేసి భువనేశ్వరిదేవి కుటుంబానికి పట్టిన పీడ విరగడ చేస్తాననీ, ఆ కార్యక్రమం మొత్తం మూడు రాత్రుల్లో ముగించి, నాలుగోరోజు ఉదయమే ఇంటికి వచ్చి శుభవార్త చెప్తాననీ భువనేశ్వరిదేవికి కబురుపెట్టాడు పరాత్పరం.

ఆ ఉదయం రానే వచ్చింది.

పొద్దున్నే నిద్రలేచి వరండాలో కూర్చుని పరాత్పరం కోసం ఎదురుచూస్తున్నారు భువనేశ్వరిదేవి.

వీధిగుమ్మం దగ్గర అలికిడైంది.

ఆమె చివాల్న లేచి వీధిగుమ్మం వేపుకు నాలుగు అడుగులు వేసిందో లేదో. పరాత్పరం ఖాకీ గుడ్డతో కుట్టిన సంచిని చేత్తో పట్టుకుని లోపలికి వచ్చేడు.

భువనేశ్వరిదేవి గుండె వేగంగా కొట్టుకుంటోంది. "అంతా సవ్యంగా జరిగినట్టేనా? " అడిగేరు లోగొంతుతో.

"అనుమానమా? ఈ పరాత్పరం పేరు చెప్తేనే వలలకు చిక్కని జీవాలు కూడా మంత్రించినట్లే నిలబడిపోవాలి" అంటూ ఎంతో స్వతంత్రంగా ఆమెను తప్పించుకుని నేరుగా వెళ్ళి వరండాలో వున్న ఓ కుర్చీలో కూర్చున్నాడు పరాత్పరం.

భువనేశ్వరిదేవి మనసెందుకో చివుక్కుమంది. అలాంటివాడు అలా స్వతంత్రించి వచ్చి అలా దర్జాగా కుర్చీలో కూర్చోటం ఆమెకు ఎబ్బెట్టుగా తోచింది.

వేరే సందర్భాల్లో అయితే ఆవిడ ప్రవర్తన ఎలా వుండేదో కానీ ఇప్పుడు ఆమె కార్యార్థి కనుక కోపాన్ని దిగమింగుకుంటూ అతని దగ్గరికి వెళ్ళి దూరంగా నించుంది.

పరాత్పరం ఖాకీ సంచిలోంచి ఖాళీసెలైన్ బాటిల్ ఒకటి బయటికి తీశాడు. మూతిని బిరడాతో బిగించి లక్కతో సీలు చేసి ఉందది.

"ఇదేంటో అర్థమైందా? " అడిగేడు పరాత్పరం సెలైన్‌సీసా ఆమెకు చూపిస్తూ.

ఆమె ఆశ్చర్యంగా చూస్తోంది.

"అర్థం కాలేదూ... మిమ్మల్ని ఇంతకాలం పట్టి పీడించిన క్షుద్రశక్తులను ఈ సీసాలో బంధించి సీలు కూడా వేశాను. ఇక మీకేం భయంలేదు. శుక్రమహర్దశ ఆరంభమై మీరు పట్టిందల్లా బంగారం అవుతుంది. శుభం జరుగుతుంది. దీని బిరడా వూడిపోతే మాత్రం మహాప్రమాదం! క్షుద్రశక్తులు సీసాలోంచి బయటికొచ్చి మళ్ళీ విజృంభిస్తాయి. ఇప్పటికన్నా కసిగా ప్రతీకారం తీర్చుకుంటాయి. ఇదిగో! మీ సీసా మీరే తీసుకోండి. భూమిలో పాతేపెడతారో, బావిలోనే వేస్తారో మీ ఇష్టం" అని పరాత్పరం సెలైన్ సీసాను భువనేశ్వరిదేవికి ఇవ్వబోయాడు.

"ఏంటో అనుకుని అనాలోచితంగా చేయి ముందుకు చాపిందల్లా షాకు కొట్టినట్లయి వెనక్కు లాక్కున్నారు భువనేశ్వరీదేవి. "మరేం అనుకోక నాకు మరో సహాయం చేస్తావా? " అని అడిగింది.

"ఏంటో అది!" అని ఆమెవేపు ప్రశ్నార్థకంగా చూశాడతను.

"మరో యాభై ఇస్తాను కానీ బాపట్లలో బస్సుదిగి సూర్యలంక వెళ్ళు. అక్కడ బంగాళాఖాతంలో ఈ క్షుద్రశక్తుల సీసాను విసిరేసొచ్చావో నీ మేలు మర్చిపోను"

"అట్లాగే" అన్నాడు పరాత్పరం

భువనేశ్వరిదేవి లోపలికి వెళ్ళి ఓ యాభై రూపాయలు తెచ్చి పరాత్పరంకిచ్చింది.

డబ్బు జేబులో పెట్టుకుని, గాలికి ఎగిరిపడుతోన్న గుమ్మం పరదా ఖాళీలోంచి హాల్లోకి తొంగిచూస్తూ, "ఏదీ, మీ అమ్మాయి కిరణ్మయి కనిపించదేం" అడిగేడు పరాత్పరం.

అతని వేపు ఇబ్బందిగా చూస్తూ, "లోపల ఏం చేస్తోందో, ఏమో. అయినా దాంతో పనేంటీ...? " దీర్ఘం తీశారు భువనేశ్వరిదేవి.

పరాత్పరం అదోలా నవ్వేడు.

సరిగ్గా అదే సమయంలో ఊర్నించి వచ్చాడు మార్కండేయులు.

సూట్‌కేసును వరండాలోపెట్టి తలెత్తి పరాత్పరంవేపు చూశాడు.

పరాత్పరం కనీసం కుర్చీలోంచైనా లేవ కుండా నిర్లక్ష్యంగా మార్కండేయులువేపు చూశాడు.

మార్కండేయులు అదేం పట్టించుకున్నట్లు లేదు. వరండా బయట వున్న నీళ్ళగాబు దగ్గరికి వెళ్ళి కాళ్ళు కడుక్కుని వచ్చి పరాత్పరం ఎదురుగా కుర్చీలో కూర్చొని అతని వేపు చూసి పలుకరింపుగా చిరునవ్వు నవ్వేడు.

"నన్ను పరాత్పరం అంటారు!" తన్ను తాను పరిచయం చేసుకున్నాడతను.

"తెలుసు! చూట్టమే కాదు, మిమ్మల్ని గురించి విన్నాను కూడా" అన్నాడు మార్కండేయులు.

భువనేశ్వరీదేవి గుండె భయంతో వేగంగా కొట్టుకుంటోంది!

సరిగ్గా ఆమె ఏ విషయమైతే మార్కండేయులు దగ్గర అత్యంత రహస్యంగా దాచాలనుకుందో ఆ రహస్యం బయటపడే అనూహ్య పరిస్థితి దాపురించింది.

ఒకవేళ పరాత్పరం మాటల సందర్భంలో క్షుద్రపూజల విషయం మార్కండేయులుతో చెప్తే అందుకు మార్కండేయులు ఎలా ప్రతిస్పందిస్తాడో? అని ఆమె వణికిపోతూ అలాంటి పరిస్థితే వస్తే కళ్ళతో చూసే ధైర్యంలేక ఆమె గబగబా ఇంట్లోకి నడిచింది. హాలు గుమ్మానికి కట్టిన పరదాలవెనుక నిలబడి వరండాలో వాళ్ళిద్దరూ మాట్లాడుకునే మాటల్ని వినేందుకు చెవులు రిక్కించింది.

మరోవంక కిరణ్మయి పరిస్థితి కూడా అలాగే వుంది!

పరాత్పరం, అన్నయ్యా ఎదురుబొదురు కావటంతో మా ఇంటికి ఏం పనిమీద వచ్చావు? అని అన్నయ్య ఒకవేళ అడిగితే అందుకు పరాత్పరం గత్యంతరంలేక తన రహస్యం బయటపెట్టవచ్చు

అందుకే, భయాన్ని ప్రయత్నంమీద నిగ్రహించుకుంటూ పరదాల వెనుక నించొని వుంది కిరణ్మయి.

"అమ్మా... సమయానికి ఇక్కడే వున్నావు. వృద్ధాప్యం కదా, సరిగా వినిపించకపోవచ్చు. కొంచెం వాళ్ళేం మాట్లాడుకుంటారో జాగ్రత్తగా విని చెప్పమ్మా..." అన్నారు భువనేశ్వరీదేవి.

కిరణ్మయి అంగీకారంగా తలూపి మౌనంగా నించుంది.

పరాత్పరం మాట్లాడుతున్నాడు. "ఏదో కాళీమాత ఉపాసకుడ్ని. కళాకారుడ్ని కూడా! కల్చరల్ ప్రోగ్రామ్స్‌కు డోలు కూడా వాయిస్తుంటాను..."

"దాందేముంది లెండి, ఎవరి బతుకుతెరువు వారిది" అన్నాడు మధ్యలోనే కల్పించుకుని మార్కండేయులు.

"నేనేం వేదవేదాంగాలు చదవలేదు. భాషా పరిజ్ఞానం లేదు. అయినా దేవీ ఉపాసకుడ్ని కావటం నా పూర్వజన్మ పుణ్యఫలమే అనుకుంటాను" అన్నాడు పరాత్పరం కించిత్తు గర్వంగా.

"మీకు పూర్వజన్మలమీద నమ్మకం వుంది కదూ? "

పరాత్పరం కిలకిలా నవ్వేడు.

"ఇంతకూ మీరేం పనిమీద వచ్చారు? " అడిగేడు మార్కండేయులు.

పరదాల వెనుక పిడుగు పడ్డట్టే అదిరిపడ్డారు కిరణ్మయి, భువనేశ్వరీదేవి.

"మరేంలేదు. నేను 'మద్యపోస' అధ్యక్షుణ్ణి కూడా మా ఉద్యమాన్ని మరింత ఉధృతం చెయ్యాల్సిన సమయం వచ్చింది. అందుకుగాను ధనం కావాలిగదా చందాలు




వసూలు చేస్తున్నాం. ఆ సందర్భంగా మీకోసం వచ్చాను. ఊళ్లో లేరంటే వెళ్ళిపో బోతోండగా సమయానికి మీరు వచ్చేశారు. అంతా కాళీమాత దయ!" అన్నాడు పరాత్పరం ఖాకీ సంచిలోంచి రసీదు పుస్తకం బయటికి తీస్తూ.

కిరణ్మయి, భువనేశ్వరీదేవి 'హమ్మయ్య' అని గాలి పీల్చుకున్నారు.

"మవ్యపోస అంటే? " అడిగేడు మార్కండేయులు.

"మనువు వ్యతిరేకపోరాట సమితి"

మార్కండేయులు నొసలు చిట్లించి అతని వేపు ఆశ్చర్యంగా చూసి క్షణం తర్వాత "మనువు జీవించి లేడుగా? " అన్నాడు నెమ్మదిగా.

"మనువు లేకపోవచ్చు కానీ యింకా మనుధర్మం వుంది కదా వర్ణవిభజన పేరిట కొందర్ని అందలం ఎక్కించి అగ్రజాతులంటూ, మరికొందర్ని అధముల కింద జమకట్టటం అన్యాయం. అందుకే మా పోరాటం"

"మీ పోరాటం మనువుమీదనా మనుధర్మం మీదనా? "

"మీరే అన్నారుగా మనువులేడని. మనుధర్మం మీదనే!"

"మనువు వుండి వుంటే? "

"అతడిమీదా అతడి ధర్మం మీదనూ..."

"మనువు ఇప్పుడు లేడు కనుక మనుధర్మాన్ని జీర్ణించుకున్న మనుషులను ద్వేషిస్తారా మీరు? మనుధర్మాన్ని మాత్రమే ద్వేషిస్తారా? "

"అలాంటి మనుషులనూ, మనుధర్మాన్నీ కూడా! ఆ ధర్మం ప్రకారం మమ్మల్ని అధములుగా వేరు చేసి ఊరి బయట గుడిసెల్లో నివశించే దౌర్భాగ్యం పట్టించారు. అగ్రవర్ణాలవారు మమ్మల్ని అణచివేశారు. చివరకు భాషను కూడా అగ్రవర్ణాల భాషగా మార్చారు"

"మనుధర్మాన్ని జీర్ణించుకున్న అధములు కూడా వున్నారు కదా, మరివారిని సంస్కరించి మీవాళ్ళుగా తీర్చిదిద్దేందుకు మీ ప్రణాళిక ఏమిటి? "

"అది మేం ఆలోచించుకోవాలి!"

"సరే, అందరి విషయం అలా వుంచండి! మీరు చాలా మంచి భాష మాట్లాడుతున్నారు. మిమ్మల్ని మీరు సంస్కరించుకునే అవకాశం వుందా? "

"భా... భా... భాష సరే! ఆదినించి సాహిత్యం కూడా మీ కొమ్మే కాస్తోంది. మీకూ రాజవంశాలవారికీ విశేష ప్రచారం యిస్తూ అగ్రవర్ణాలవారు సాహిత్యాన్ని కూడా సొంతం చేసుకున్నారు. మమ్మల్ని అణగదొక్కారు"

"అందుకు మిమ్మల్ని మీరే నిందించుకోవాలి!"

"ఎందుకంటారూ? "

"వాల్మీకి కులం ఏమిటి? "

"బోయవాడు"

"అతను సంస్కృతంలో రామాయణం రాసేడు. రాజవంశపు చరిత్ర రచించాడు.

కర్మలకు విశేషప్రచారం ఇచ్చాడు. అందుకని!"

"ఎప్పుడో ఆదికాలంలో జరిగిన వాల్మీకి విషయం యిప్పుడెందుకు? "

"ఎప్పుడో ఆదికాలంలో వర్ణవిభజన చేసిన మనువు విషయం మాత్రం యిప్పుడెందుకు? " అన్నాడు మార్కండేయులు వెంటనే.

పరాత్పరం సమాధానం చెప్పకుండా రసీదు పుస్తకాన్ని మార్కండేయులు ముందుకు తోసేడు.

మార్కండేయులు దానివేపు చూడకుండానే "'మవ్యపోస' అధ్యక్షులు మీరు

కదూ? " అడిగేడు.

"అవునవును!"

"మీ సంస్థ యంత్రాంగాన్ని ఎలా రూపొం దించారు? "

"మామూలే! ఎగ్జిక్యూటివ్, కౌన్సిల్, జనర ల్ బాడి, యింకా కొన్ని ప్రజా సంఘాలు న్నాయి. కీలకమైన అంగాలలో ఉద్యమం పట్ల పూర్తి అవగాహన వున్న మేధావులను నియమించాం. కిందిస్థాయి అంగాలలో సాధారణ కార్యకర్తలు పనిచేస్తారు. కీలక మైన అంగాలు నిర్ణయాలను తీసుకుం టాయి. వాటిని కిందిస్థాయి ఉపాంగాలకు చెందిన కార్యకర్తలు అమలు జరుపుతారు" వివరించాడు పరాత్పరం

"అలాగే ఆ కాలంలో మనువు మానవ సమాజాన్ని నడిపించేందుకు సమాజ సభ్యుల స్థాయీ బేధాలనుబట్టి వారిని శ్రేణు లుగా విభజించి వుండవచ్చు గదా! ఆనాటి సాంఘిక పరిస్థితులకు ఆ విభజన అనువు గానే వుండి వుండవచ్చుగదా! అలా లేని పక్షంలో ఆనాటి సమకాలీన సాహిత్యంలో వర్ణవిభజనను నిరశించి ఉద్యమాలు నడి పిన దాఖలాలు కనిపించేవి!"

పరాత్పరం నొసలు చిట్లించి వింటో న్నాడు.

"పరాత్పరంగారూ! ఆలోచించండి. మీరు మీ ఉద్యమాన్ని సక్రమంగా నడిపేందుకు కార్యకర్తల స్థాయీ బేధాలనుబట్టి వారిని వివిధ శ్రేణులుగా విభజించారు కదా. భవి ష్యత్తులో మీ ఉద్యమం ఊపందుకుని మీరే సమాజాన్ని నడిపించే దశకు చేరుకుంటే క్రమంగా మీ విధానాలు వ్యవస్థలో పాతుకు పోయి కుదురుకుంటాయి. కాలగమనంలో మీ ఉద్యమంలోని కిందిస్థాయి శ్రేణులకు చెందిన వాళ్ళు మిమ్మల్ని భవిష్యత్తులో మరో మనువుగా అభివర్ణించే అవకాశం లేదంటారా? " అడిగేడు మార్కండేయులు.

అతను యింకా ఏదో చెప్పబోతోంటే మధ్యలోనే అన్నాడు పరాత్పరం "సాహిత్యం కూడా అగ్రవర్ణాల సృష్టేకదా" అని.

"నిజమే! అయినా తనువాదాన్నీ, పెత్త నాన్నీ, వ్యవస్థ గతంనించి జీర్ణించుకున్న అవాంఛనీయత్వాన్నీ నిరశిస్తూ జరిగిన ఏ చారిత్రక సంఘటనలనూ సాహిత్యం విస్మ రించదు. కాకుంటే దాని ప్రచారపు తీరు వేరుగా వుండవచ్చు తమను ధిక్కరించిన వారిని రాక్షసులుగానో, నీచులుగానో వర్ణిం చటం సాహిత్యకారులకు తప్పనిసరి! లేకుంటే, ప్రత్యర్థుల వాదాన్ని జన బాహు ళ్యంలోకి పంపించిన వాళ్ళవుతారు" అని మార్కండేయులు గాలి పీల్చుకుని.

"పరాత్పరంగారూ! మీ వాదనే నిజమైతే మనకు కనీసం చార్వాకుల చరిత్ర కూడా లభించేది కాదు. కర్మలూ, భగవంతుడూ మాత్రమే ప్రపంచాన్ని నడిపిస్తోన్నాయని అధిక శాతం జనం నిర్ద్వందంగా విశ్వశిం చిన ఆ రోజుల్లోనే దేవుడు లేడంటూ నాస్తి కవాదంతో అశితకేశకంబళుడు ప్రవర్తించిన తీరు చరిత్ర కెక్కేదే కాదు. జాబాలి ఎవరో తెలిసేదే కాదు"

"సరే! మీ వాదనే నిజం అనుకుందాం. ఆనాటి సాంఘిక పరిస్థితుల కారణంగా వర్ణ విభజనను ఎవ్వరూ ప్రతిఘటించి వుండక పోవచ్చు కానీ ఈ ఆధునిక కాలంలో కూడా మేము అస్పృశ్యులుగా ఊరిబయటే ఎందుకు వుండాలి? "

"ఆదికాలంలో కూడా అస్పృశ్యత హైందవ సాంఘిక వ్యవస్థలో అంతర్భాగం కానేకాదు. ఆచారంగా మార్పబడ్డ వ్యవ హారం మాత్రమే. అయినా యిప్పుడు ఎవరు కాదన్నారు, ఊళ్ళోకి రాండి!"

"తరాలుగా ఆర్థికంగా అణగద్రొక్కబడిన మేము ఒక్కసారిగా ఈ జనజీవన స్రవం తిలో న్యూనతకు గురికాకుండా కలిసిపోగ లమా? "

"ఆర్థిక అసమానతలు అన్ని కులాల్లోనూ





వున్నాయి. ఇక అస్పృశ్యత అంటారా, ఆ కాలంలోనే పలనాటి బ్రహ్మనాయుడు అన్ని కులాలవారినీ కలిపి చాపకూడు పెట్టి ఆ నాడే అభ్యుదయవాదిగా చరిత్రకెక్కాడు. ఆ కారణంగా యుద్ధాలు జరిగి రాజవంశాలు అంతరించి పోతోన్నా ఖాతరు చెయ్యలేదు. అలాంటి ఉదాహరణలు యింకా చాలా వున్నాయి. కానీ యిప్పుడు అంత పోరాటం, త్యాగం అనవసరం. అందరం కలిసి హోటళ్ళలో భోజనం చేస్తూనే వున్నాం" అన్నాడు మార్కండేయులు.

"విద్యను కూడా మాకు లేకుండా చేశారు కదా!"

"చదువుకోండి! అందుకు మీకున్న అవకాశాలు యిప్పుడు మరెవ్వరికీ లేవు. అలాగే ఉద్యోగాల్లోనూ. ఏనాడో మనువు ద్రోహం చేశాడని ఈనాడు కుమిలిపోకండి. అంబేద్కర్‌కుమల్లే అవిశ్రాంతంగా కృషి చేసి విద్యావంతులు కండి. మేధావుల సరసకు చేరిపోండి" చెప్పేడు మార్కండేయులు.

మళ్ళీ ఏదో గుర్తొచ్చి "పరాత్పరంగారూ! స్వతంత్రపోరాట కాలంలో కర్మసిద్ధాంతాన్ని నమ్మే హిందూత్వానికి దేశభక్తిని ముడిపెట్టారు. ప్రజల విశ్వాసాలను వినియోగించుకోవటం తద్వారా దేశభక్తిని ప్రేరేపించటం మాత్రమే వాళ్ళ తక్షణావసరం! ఒరిస్సాలో వరదలకు కారణం ఆంధ్రరాష్ట్రంలోని గుంటూరు జిల్లా, ముప్పాళ్ళగ్రామంలో అస్పృశ్యత పాటించటమే అని ఆ గ్రామం వచ్చిన సందర్భంగా గాంధీగారు అన్నారు. హాస్యాస్పదమే అయినా అది వారి అవసరం! అలాగే శాస్త్రీయ విజ్ఞానం అభివృద్ధి చెందకముందు అస్పృశ్యతకూ, చాతుర్వర్ణ వ్యవస్థకూ ముడిపెట్టటం జరిగి వుండవచ్చు' ' అన్నాడు మార్కండేయులు.

పరాత్పరం చాలా అసహనంగా కనిపించేడు! అప్పటిదాకా కేవలం మర్యాదకోసం మార్కండేయులు వాదనను విన్నాడు కానీ, ఆ వాదనలోని మంచి చెడ్డల విశ్లేషణ జోలికి వెళ్ళేందుకు అతనికి అవసరమేం కనిపించలేదు. సరిగదా పరదాల వెనుకనించి ఎవరో తమ చర్చను వింటోన్నారన్న విషయం గ్రహించేడు.

చర్చలో తనది క్రింది చెయ్యి అయితే ఆ చిన్న ఓటమే భవిష్యత్తులో అనేకమైన వైఫల్యాలకు దారితీయవచ్చు!

అందుకే, ఆవేశాన్ని తెచ్చిపెట్టుకుంటూ,

"మీ వాదన మీ యజ్ఞోపవీతానికిమల్లే ఒక్కోసారి సవ్యంగానూ, మరోసారి అపసవ్యంగానూ వుంటుంది. అయినా యిలాంటి వాదనలతో మాకేం పని? అదిగో, జంఝామారుతంగా, ప్రళయ కాలప్రభంజనంలా వస్తోంది మా ఉద్యమం. తరతరాల దోపిడి, పీడనలకు చెల్లు చీటీ యిచ్చేందుకు 'పదండి ముందుకు పదండి తోసుకు పోదాం, పోదాం పైపైకి' అంటూ. అవిగో, వినపడలేదా యముని మహిషపు లోహ ఘంటలు"!

"స్టాప్!" పెద్దగా అరిచేడు మార్కండేయులు.

జలప్రవాహానికిమల్లే గలగలా దూకుతోన్న పరాత్పరం వాక్ప్రవాహం స్థంభించిపోయింది.

"అన్ని అసమానతలకూ కారణం దోపిడీ వర్గమే అనీ, వర్గపోరాటంద్వారా పీడకుల బారినించి పీడితులను విముక్తం చేసి శ్రామికవర్గ జయకేతనాన్ని భూగోళంమీద ఆవిష్కరించాలనీ, విశ్వమానవుల ముంగిళ్ళలో వెలుగులు నింపాలనీ అడుగడుగునా ఉద్యమిస్తూ, విప్లవిస్తూ రక్తతర్పణలు చేస్తోన్న మహత్తర సిద్ధాంతానికి ఊతంయిస్తూ రాసిన మహాగీతాన్ని కులపోరాటపు స్థాయికి దిగజార్చి విద్రోహులు కాకండి" అన్నాడు మార్కండేయులు ఆవేశంతో కంపిస్తూ.

పరాత్పరం అతనివేపు విస్మయంగా



చూశాడు. ఓటమిని ఒప్పుకునేందుకు అతని అహం అంగీకరించటంలేదు. చిన్నగా దగ్గి, గొంతు సరిచేసుకుని "ఓహ్! మీరూ... ఆ గీతాన్ని రాసిన శ్రీశ్రీ కూడా ఒకటేగదూ! అందుకే దాన్ని మేం వాడుకుంటే మీకు కళ్ళు పుట్టింది!" అన్నాడు కోపంగా.

"దయచేసి బయటికి వెళ్ళిపోండి" ఆదేశించాడు మార్కండేయులు.

పరాత్పరం చివాల్న కుర్చీలోంచి లేచి బల్ల మీంచి రసీదు పుస్తకాన్ని విసురుగా తీసి ఖాకీ సంచిలో కుక్కి, అంతే విసురుగా బయటికి వెళ్ళిపోయాడు.

పరదాల వెనుక భువనేశ్వరీదేవి, కిరణ్మయి చెవులో రహస్యంగా అంది "అమ్మాయీ! మార్కండేయులు కొంచెం నిగ్రహం పాటిస్తే బాగుండేది. పరాత్పరం ఎంత విసురుగా వెళ్ళేడో చూసేవుగా! ఆ కోపంలో అతను మళ్ళీ క్షుద్రశక్తుల్ని బయటికి తీసేందుకు సీసా బిరడా తీస్తాడో, ఏంపాడో"

కిరణ్మయికి అదేం వినిపించలేదు. ప్రమాదాన్ని శంకిస్తూ భయంతో ఒణికిపోతోంది.



మార్కండేయులు తన పనులన్నీ ముగించుకుని త్వరగానే భోజనం చేసి విశ్రాంతిగా పడుకున్నాడు.

కొడుకుతో మాట్లాడేందుకు భువనేశ్వరీదేవికి ప్రొద్దుట్నించీ వీలు చిక్కలేదు. సమయం చూసుకుని, కొడుకు పడుకున్న మంచం దగ్గరికి వెళ్ళి "బాబూ, మార్కండేయా! నిద్రపోతున్నావా? " అడిగేరు భువనేశ్వరీదేవి.

మార్కండేయులు ఫక్కున నవ్వేడు. వొత్తిగిలి అమ్మవేపుకు తిరిగి పడుకుని "కూర్చోమ్మా..." అంటూ అవతలికి జరిగేడు.

భువనేశ్వరీదేవి కొడుకు ముఖంలోకి చూస్తూ "సింధనూరు వెళ్ళిన పనులన్నీ చక్కపెట్టుకుని వచ్చావా? " అడిగారు.

"ఊ... సమస్య పెద్దదే కానీ పరిష్కారం చిన్నదే కనుక త్వరగానే తెమిలింది" చెప్పాడు మార్కండేయులు.

"పద్మరాజుగారు అంత హడావుడిగా కబురెందుకు చేసేరో? "

"మరేం లేదమ్మా, అక్కడ మన పొలాల్లో పనిచేస్తోన్న వాళ్ళకు ఎవరో నాయకులు వ్యవసాయ కార్మిక సంఘం పెట్టి సమ్మెచేయించారు. దాని పరిష్కారం కోసం"

"ఇక ఇబ్బందేం లేదుగా? "

"లేదు! నిజానికి అక్కడ అందరికన్నా హెచ్చు కూలి యిస్తోంది మనమే. అయినా వాళ్ళు సమ్మెకు దిగేరు. అదంతా పార్టీల పోరాటంలే! మరోపార్టీ వాళ్ళ కార్మికసంఘం బలం పుంజుకుంటోందని వీళ్ళు తమ ఉనికికోసం సమ్మెచేయించారు. నాయకుల్నీ, కార్మికుల్నీ పిలిపించి మిగతా అందరూ యిచ్చేంత కూలి యిస్తానన్నాను. దాంతో రాజీ కొచ్చారు. కూలి తగ్గించవద్దని ప్రాధేయపడ్డారు. పనుల్లోకి వెళ్ళారు"

భువనేశ్వరీదేవి తృప్తిగా గాలిపీల్చుకున్నారు. కొడుకు నిద్రలోకి జారుకుంటోన్నాడని కొంచెం సేపటికి గ్రహించి ఆమె చప్పుడు చెయ్యకుండా మంచంమీంచిలేచి వెళ్ళిపోయేరు.




# ఏరిన ముత్యాలు

☆ ఆత్మకు మంచి, చెడులాంటి గుణాలు లేవు. ఉన్న గుణాలన్నీ మనస్సుకే.

-రమణ మహర్షి

☆ విద్య మనిషినుండి వేరుచేయలేని ఒక గొప్ప వరం.

-ఎపిక్టేటస్

☆ విద్యారంగాన్ని విస్మరిస్తే దేశప్రగతి కుంటుపడుతుంది.

-విశ్వనాథ

☆ భిన్నత్వంవైపు పురోగమనమే నాగరికత.

-స్పెన్సర్

☆ శాంతంగా, నిబ్బరంగా ఉండటమే నిజమైన శక్తికి నిదర్శనం.

-వివేకానంద

☆ పని అనేది మనిషిలోని విచారాన్ని పోగొట్టి ఆనందం కలగజేస్తుంది.

-సిసిరో

☆ తననితాను సమర్థించుకోవడానికి ఎల్లవేళలా సిద్ధంగా ఉండేదే మానవ మేధస్సు.

-లీవీ

☆ ఏ ఆదర్శం లేనివ్యక్తి తెడ్డులేని పడవ వంటివాడు.

-గాంధీజీ

☆ అభివృద్ధి క్రమంలో ఒక సమస్యకు దొరికిన పరిష్కారం మరో సమస్యను మన ముందుకు తెస్తూవుంటుంది.

-లూథర్‌కింగ్

☆ నీకు ఇష్టం వచ్చినదల్లా చేయడం నష్టం కలిగించవచ్చు. నీవు చేసే ప్రతి పనీ నీకు ఇష్టాన్ని కలిగించాలి.

-చర్చిల్

☆ అహంకారం, మమకారం అంతరించినప్పుడే పరిపూర్ణమైన శాంతి లభిస్తుంది.

-గౌతమబుద్ధుడు

☆ మతాతత్వం భ్రాతృ భావాన్ని రూపుమాపివేస్తుంది. అనేకసార్లు దానిలో చిక్కుకునే మనిషి వ్యర్థుడైపోతాడు.

-నెహ్రూ

☆ సమాజంలో సోమరిపోతులు దొంగలతో సమానం.

-మహాత్మాగాంధీ

☆ వ్యక్తిగా ప్రతివారినీ గౌరవించు. కానీ విగ్రహంగా మార్చి పూజించకు.

-ఐన్‌స్టీన్

---

సేకరణ: శ్రీగిరి శ్రీకాంత్

ఓ గంట తర్వాత కరివేపాకు వచ్చేడు.

వరండాలోనే ఎదురయ్యాడు భువనేశ్వరీ దేవికి.

కరివేపాకును "కూర్చో నాయనా..." అని ఓ కుర్చీ చూపించి, అతను కూర్చోగానే "మీ పిల్లవాడికి ఎలా వుంది?" అని అడిగేరు ఆప్యాయంగా.

"ఏదో, మీ అందరి దయవల్ల కోలుకు న్నాడు. పొద్దున్నే ఆస్పత్రినించి ఇంటి క్కూడా తెచ్చాం..." అని లోపలికి తొంగి చూస్తూ "మార్కండేయులు లేడా?" అని అడిగేడు కరివేపాకు.

"ఊర్నించి పొద్దున్నే వచ్చాడు. నిద్రపోతు న్నాడు" చెప్పేరామె.

"అయితే నిద్రపోనివ్వండి. మరేం లేదు, అబ్బాయి బాగున్నాడన్న విషయం చెప్పిపో దామని వచ్చాను" అన్నాడు కరివేపాకు.

"నిద్ర లేవగానే నేను చెప్తాన్లే. అన్నట్లు, నీకేమైనా డబ్బు కావాలా?"

ఎంతో ఆప్యాయంగా అడిగిన భువనేశ్వరీ దేవివేపు కళ్ళార్పకుండా చూశాడు కరివే పాకు.

మరెందుకోగాని అతడి గుండెలోతు ల్లోంచి దుఃఖం పొంగుకొచ్చింది. "మొన్న మీరిచ్చిన డబ్బు అన్నింటికీ సరిపోయిం దమ్మా, మీ మేలు ఈ జన్మలో మర్చిపో లేను!" అన్నాడు గాద్గదికంగా.

మార్కండేయులుకు ఎందుకు మెళకువ వచ్చిందో కానీ మంచంమీంచి లేవకుండానే వాళ్ళ సంభాషణను శ్రద్ధగా వింటూ పడు కున్నాడు చిరునవ్వు నవ్వుతూ!

"చూడు నాయనా కరివేపాకూ! నువ్వు నాస్తికుడివే కావచ్చు కానీ ఒక్క విషయం మాత్రం గుర్తుంచుకో. భగవంతుడున్నాడు. పిలువగానే వచ్చి కనిపించడు కనుక కొంత మంది ఆయన్ను విశ్వశించరు. ఇంకా నూరేండ్లకయినా సుభాష్‌చంద్రబోసు జీవించే ఉన్నాడన్నా నమ్ముతారు కానీ దేవుణ్ని నమ్మరు. అందుకు కారణం ఆయన ఒక్కసారన్నా మనకు కనిపించకపోవటమే! అయినా భగవంతుడి శక్తిముందు అల్పమా నవుల శక్తి ఏపాటిదంటావ్? ఏదో, పెద్ద ముండను చెప్తున్నాను విను, వింటావా?" అని అడిగి కరివేపాకు ముఖంలోకి సూటిగా చూశారు భువనేశ్వరీదేవి.

"ఏమిటో చెప్పమ్మా..."

"మరేంలేదు. మీ అబ్బాయి కోలుకు న్నాడు, సంతోషమే. కానీ, గవర్నమెంటు ఆస్పత్రిలో కూడా కొద్దిరోజులున్నాడు కదా, అక్కడికి చాలామంది నష్టజాతకులు వస్తుంటారు. రకరకాల గ్రహపీడలు ఆశి స్తాయి. అవి సమయం చూసి దెబ్బతీ స్తాయి. అందునా వాడు మరీ పసివాడు!" అని అర్థోక్తిగా ఆపేశారామె.

"ఒక్కగానొక కొడుకమ్మా వాడు. వాడికి ఏదైనా జరగరానిదే జరిగితే అదీ, నేనూ తట్టుకోలేం" అని భువనేశ్వరీదేవివేపు జాలిగా చూశాడు కరివేపాకు.

"ఒక పని చెయ్యి, నేన్నీకు కనకదుర్గ పూజా కుంకుమ యిస్తాను. పరమశివుడి విబూది పొట్లాం కట్టిస్తాను. కొంచెం విబూది పిల్లాడి నోట్లో వేసి, వాడి నొసటన అమ్మవారి కుంకుమ బొట్టుపెట్టు. అంతంత మాత్రం గ్రహపీడలు యిట్టే పారిపోతాయి" చెప్పారు భువనేశ్వరీదేవి.

"ఎంత అభిమానమమ్మా నామీద మీకు." అంటూ కరివేపాకు ఆమెవేపు కృతజ్ఞతాపూ ర్వకంగా చూశాడు.

భువనేశ్వరీదేవి చప్పున కుర్చీలోంచి లేచి ఇంట్లోకి వెళ్ళి పూజగదిలోంచి రెండు పొట్లాలు తెచ్చి కరివేపాకు చేతులో పెట్టారు.

ఆ పొట్లాల నొకసారి అపురూపంగా చూసి జేబులో పెట్టుకుని "అమ్మా... ఈ




విషయం మార్కండేయులుతో మాత్రం అనకండేం!" అని అభ్యర్థించి, లేచి హడావుడిగా వెళ్ళిపోయేడు కరివేపాకు.

మార్కండేయులు కరివేపాకును పలకరించాలని అనుకున్నవాడల్లా ఒక్కక్షణం ఆలోచించి ఆగిపోయేడు.

పిల్లవాడు అనారోగ్యానికి గురై కరివేపాకు ఎంతటి అశాంతికి లోనయ్యాడో. ఆ అశాంతి, సంక్షోభంనించి ఏదో ఒక విశ్వాసంతోనైనా నిబ్బరపడగల్గితే అంతేచాలు. దేవుడి ఉనికినీ, మహిమలనూ తర్కిస్తూ, ఒక నమ్మకం కల్గించిన ఆనందాన్ని, ధైర్యాన్నీ ధ్వంసం చేసే హక్కు ఎవ్వరికీ లేదు. అలాంటి హక్కును ఆశించటం ఒక హత్య చేసేందుకు అనుమతి ఆశించటం వంటిదే!

కానీ, కొన్ని సందర్భాల్లో అజ్ఞానం ఆనందాన్నిస్తుంది. జ్ఞానం ఆ ఆనందాలను ధ్వంసం చేస్తుంది. అది అవాంఛనీయం కాదు. కానీ, దేవుడి విషయం అలా కాదు! రామకృష్ణపరమహంస అసలు నమ్మకం అన్నదే హేతువుకు అందని ఒక విశ్వాసం అని వివేకానందుడికి చెప్పినట్లు దేవుడు ఉన్నాడని నమ్మినా, లేడని నమ్మినా రెండూ హేతువులేని నమ్మకాలే!

మార్కండేయులు మళ్ళీ నిద్రలోకి జారుకున్నాడు.

భువనేశ్వరీదేవికి ఉబుసుపోవటంలేదు. కొంచెంసేపు వరండాలో తచ్చాడి, మరి కొంచెంసేపు తులసికోట దగ్గర కూర్చొని తనకు వచ్చిన రెండో, మూడో కీర్తనలను గొణిగి, యింకా సమయం గడవక పూజగదిలోంచి దేవుళ్లను తెచ్చి బావిదగ్గర చింతపండుతో తోమి స్నానం చేయిస్తోన్నారు.

కిరణ్మయి తన గదిలో మంచంమీద వెల్లికిలా పడుకుని ఓ దుస్వప్నంలా మలుపు తిరిగిన తన జీవితాన్ని గురించే ఆలోచిస్తోంది.

గోపీకృష్ణ అజాపజాలేడు. వెళ్ళిన రోజు నించి ఒక్క ఉత్తరం ముక్కయినా రాయలేదు.

శరీరం తన భౌతిక ధర్మాన్ని పాటించో, అవకాశం, అవసరం, అందుబాటూ సమకూరో తను గోపీకృష్ణకు అర్పితమైనా, అన్నమాట ప్రకారం అతను తనను పెళ్ళిచేసుకుంటే ఇప్పుడు దుస్వప్నంలా తోస్తోన్న జీవితమే అప్పుడు ఆనందమయం అనిపిస్తుంది. ఆనందానికీ, విషాదానికీ మధ్య నిర్ణాయకశక్తిగా నిల్చేడు గోపీకృష్ణ. అతడి నిర్ణయం ఆమె జీవితాన్నే శాశిస్తోందంటే ఆమె ఎంతగా స్వతంత్రాన్ని కోల్పోయిందో!

దేవుళ్ళను శుద్ధిచేస్తూ భువనేశ్వరీదేవికి, నిద్రతో మార్కండేయులుకూ సమయం గడిచినట్టే తెలియదు.

కిరణ్మయికి మాత్రం బెంగతో సమయం ఎంతకూ గడవనట్టే వుంది.

అయినా సమయానికే సాయంకాలమైంది!

మార్కండేయులు నిద్రలేచేడు. స్నానం చేసి ముస్తాబై కరివేపాకు ఇంటికి బయల్దేరేడు, పిల్లాడ్ని చూసొద్దామని.

కరివేపాకు ఇల్లు అక్కడికి దగ్గరే.

ప్రకృతికి దానిమ్మపండు రంగులు పులుంతోన్న సాయంకాలపు నీరెండలో నెమ్మదిగా నడుచుకుంటూ కరివేపాకు ఇంటికి చేరుకున్నాడు మార్కండేయులు.

కరివేపాకు వరండాలోనే కుర్చీలో కూర్చొని కనిపించేడు.

ఆనందంతో మురిసిపోతూ కరివేపాకు పిల్లవాడ్ని వొళ్ళో కూర్చోబెట్టుకుని పరిసరాలను మర్చిపోయి ఆడిస్తున్నాడు. మార్కండేయుల్ని అతను గమనించనేలేదు. పిల్లవాడి రెండు చేతుల్నీ తన చేతులతో పట్టుకుని లయగా చప్పట్లు కొట్టిస్తూ "తారంగం

తారంగం- తాండవకృష్ణ తారంగం" అని పాట పాడుతున్నాడు. పిల్లవాడి నొసటన అమ్మవారి కుంకుమబొట్టు ఎర్రగా మెరుస్తోంది.

ఎందుకో పాటను మధ్యలోనే ఆపి కరివేపాకు యాదృచ్ఛికంగా తలను పైకెత్తి మార్కండేయులును చూశాడు. తొట్రుపాటుతో కదిలేడు. పిల్లవాడి నొసటి కుంకుమను రహస్యంగా చెరిపి "రా... రా, కూర్చో" అని మార్కండేయులును ఆహ్వానించేడు.

అతని పక్కనే స్థిమితంగా కూర్చొని చేత్తో భుజంమీద తట్టి,

"కరివేపాకూ! నేను ఆస్తికుల్నీ ద్వేషించను. నాస్తికులనూ ద్వేషించను. నేను ద్వేషించేది కాపట్యాన్నే" అన్నాడు గంభీరంగా.

కరివేపాకు ముఖం ఎండిపోయింది!

★ ★ ★

రోజులు వేగంగా గడిచిపోతోన్నాయి. వారాలు, నెలలూ అలా... అలా...

మిథిల పరీక్షలు పూర్తయి ఫలితాలు కూడా వచ్చాయి. ఆమె అనుకున్నట్లే ప్రథమ శ్రేణి విద్యార్థుల్లోనూ ఆమే అగ్రస్థానంలో ఉంది. మిథిల ఆనందం అంతా యింతా కాదు. ఇంటిల్లిపాది అందరూ మిథిల విజయానికి అమితంగా సంతోషించారు. మార్కండేయులు మాత్రం ఓ చిరునవ్వు నవ్వి మౌనందాల్చేడు.

అందరికి మల్లే అన్నయ్యకూడా తనను గొప్పగా పొగిడి అభినందించి ఆనందిస్తాడన్న నమ్మకం మిథిలకు లేకున్నా, మొక్కుబడిగా నవ్విన ఆ చిరునవ్వుకు మారుగా పెదవి విప్పిమాట్లాడి ఆమె కృషిని ప్రసంశించిఉంటే ఆమె సంతోషించేది. కానీ అలాంటి అవకాశం మార్కండేయులు ఆమెకు కల్పించనేలేదు.

ముఖం గంటుపెట్టుకుని తన గదిలోకి వెళ్ళి కూర్చుంది మిథిల.

ఆలోచిస్తోంది.

సాలీడు సామ్యం చెప్పి ఆరోజు మార్కండేయులు హెచ్చరించిన మాటలు ఆమె చెవుల్లో ఇంకా వినిపిస్తూనే ఉన్నాయి.

నిజమే! సాలీడు గూడు సాలీడుకు తప్ప మరెవ్వరికీ పనికిరాదు. దాని జయాపజయాలతో ఎవ్వరికీ నిమిత్తం లేని స్వేచ్ఛదానికుంది. గూడుకట్టుకుంటుంది. అది మధ్యలో చెదిరిపోయినా మళ్ళీమళ్ళీ నిర్మించుకుంటో కిందపడుతూ, పైకిలేస్తూ.

మిథిల కళ్ళలో ఏదో కాంతి! ఆ కాంతి వెనుక దాగిన భావాలు గూఢంగా ఆమె మనసులో లోహత్వాన్ని నింపుతూ తమ పని తాము చేసుకుని పోతోన్నాయి, నిర్విరామంగా.

వారంరోజులు గడిచేక హటాత్తుగా ఊడిపడ్డాడు గోపీకృష్ణ.

పరీక్షలు కాగానే స్నేహితులతో కలిసి ఏవేవో ఊళ్ళు తిరిగి ఫలితాలు తెలిసేక గుంటూరు వచ్చాడు.

గోపీకృష్ణ కూడా పరీక్షల్లో ఉత్తీర్ణుడయ్యేట్ట.

అతను రావటంతో కిరణ్మయికి కొంచెం ఊరట చిక్కింది. సమయం చూసుకుని అతడితో తన పెళ్ళి విషయం తేల్చుకుందామని అనుకుంది కానీ అతను కిరణ్మయిని తప్పించుకొని తిరుగుతూ ఆమెకలాంటి అవకాశమే యివ్వలేదు.

ఆ రోజు సాయంత్రం ఇంట్లో ఎవ్వరూ లేరు.

యథావిధిగా కిరణ్మయి సంగీతం స్కూలుకు వెళ్ళిపోయింది. భువనేశ్వరీదేవి, కాత్యాయిని శివాలయానికి వెళ్లేరు. ఉదయం నించి మార్కండేయులు ఇంట్లోలేదు.

మలిసంధ్య సూర్యుడు పడమటి కనుమ




ల్లోకి వొరిగిపోతూ నారింజరంగు చల్లి ప్రకృతిని కాంతిమంతం చేస్తున్నాడు.

ఉన్నట్లుండి క్షణంలో వాతావరణం పూర్తిగా మారిపోయింది. ఏదో భీభత్సం సృష్టించేందుకా అన్నట్లు ఆకాశంలో కారు మబ్బులు గుమికూడేయి.

పల్చటి చీకటి తెరలు కప్పుకుని ప్రకృతి మసకబారిపోయింది.

అంతవరకూ తన గదిలో కూర్చొని ఏవో పుస్తకాలు తిరగేస్తోన్న గోపీకృష్ణ పుస్తకాలను. దూరంగా గిరాటేసి మంచంమీంచి లేచి నించున్నాడు.

ఉబుసుపోక నెమ్మదిగా నడుస్తూ మిథిల గదివేపుకు దారితీసేడు.

మిథిల అప్పుడే స్నానం ముగించుకుని టవల్‌తో శరీరాన్ని కప్పుకుని బాత్రూంలోంచి బయటికొచ్చింది. నిలువుటద్దం ముందు నించొని కూనిరాగాలు తీస్తూ, పక్కనే మంచంమీద ఉన్న బట్టలను కట్టుకుందుకు వెళ్ళబోయి 'కెవ్వున' అరిచింది.

దగ్గరికి వేసి ఉన్న తలుపుల్ని తోసుకుని లోపలికి వస్తోన్న గోపీకృష్ణ ప్రతిబింబం ఆమెకు అద్దంలో కనిపించింది.

"బావా... ప్లీజ్, గో ఔట్!" అని పెద్దగా అరిచింది.

తలెత్తి ఆమెవేపు అప్పుడు చూసేడు గోపీకృష్ణ.

అది కలో, నిజమో అన్నంతగా విభ్రమానికిలోనై ఎవడో మాంత్రికుడు తన మంత్రదండంతో తుడిచి తనను శిలాప్రతిమను చేసినట్టో విప్పారిన కనురెప్పల్ని సైతం ఆర్పకుండా చేష్టలుడిగి అలాగే నిల్చుండిపోయేడు గోపీకృష్ణ.

అతడి శరీరంలో విద్యుత్తు ప్రవహిస్తోంది!

గుండె వేగంగా కొట్టుకుంటూ ఏదో తమకంలో తేలిపోసాగేడు.

ఆ హటాత్సంఘటనకు చేతన కోల్పోయిన మిథిల క్షణంలో తేరుకున్నా ఆమె శరీరం సన్నగా కంపిస్తోనే ఉంది.

సిగ్గుతో కుంచించుకుని పోతూ లేడిలా మంచం దగ్గరికి దూకి చీరెను చేత్తో అమాంతం అందుకుని, అస్తవ్యస్తంగా ఒంటికి చుట్టుకుని, గువ్వలా మంచంమీద ఒదిగి కూర్చుంది.

గోపీకృష్ణ యాంత్రికంగా నడుస్తూ ఆమె దగ్గరికి వెళ్లేడు. అద్భుత చిత్రాన్ని చూసినట్టే ఆబగా ఆమె అణువణువునూ చూపులతోటే క్షణకాలం స్పృశించి అమాంతం ఆమె తలను రెండు చేతుల మధ్య యిరికించుకుని ముఖమంతా ముద్దులతో నింపేడు.

మిథిల ఒణికిపోయింది. తన ప్రమేయం లేకుండానే ఏదో అదృశ్యశక్తి శాసించినట్లు అతడి శరీరాన్ని ఆలంబన చేసుకుంది.

తలుపు చప్పుడైంది!

ఇందాక స్నానానికి వెళ్లేప్పుడు తలుపు గడియ వెయ్యకుండా మిథిల ఏ పొరపాటైతే చేసిందో ఇప్పుడు గోపీకృష్ణ కూడా అదే పొరపాటు చేసేడు.

తలుపులు కిర్రుమని తెరుచుకున్నాయి.

ఏదో ధ్యాసలో తలవంచుకుని లోపలికి వచ్చేడు మార్కండేయులు.

గోపీకృష్ణ, మిథిల తలలు వంచుకుని నించున్నారు.

పరిస్థితి మార్కండేయులుకు అర్థమైంది.

గిర్రున వెనక్కు తిరిగి బయటికి వెడుతూ అరక్షణం ఆగి "మీ ఇద్దరూ వెంటనే నా గదిలోకి రాండి!" అని చెప్పి వెళ్లిపోయేడు.

గోపీకృష్ణ భయంగా మిథిలవేపు చూసేడు. జరిగిందానికి ఆమె ముఖంలో ఎలాంటి పశ్చాత్తాపమూ మచ్చుకైనా కనిపించలేదు.

"అన్నయ్య ఆర్డరు విన్నావుగా, వెళ్దాంపద బావా..." అంది మిథిల ప్రశాంతంగా.

గోపీకృష్ణ గమనించలేదుకానీ అన్నయ్య అలా బయటికి వెళ్లిన మరుక్షణంలోనే

మిథిల వేగంగా ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చింది.

అన్నయ్య దగ్గర భోరుమని ఏడ్చి కుటుంబపు పరువు ప్రతిష్టలను జ్ఞాపకం చేస్తే ఇద్దరికీ పెళ్లి చెయ్యటం మినహా అతనికి మరో మార్గం ఉండదు. జరిగిందానికి చింతపడే కన్నా దాన్నే ఆసరా చేసుకుని బతుకును నిర్మించుకోవచ్చు

గోపీకృష్ణకేం అందగాడు. పైగా ఇంజనీరు. ఇద్దరికీ పెళ్లయితే ఒకరు డాక్టరుగా, మరొకరు ఇంజనీరుగా స్థిరపడి నాలుగు చేతులా డబ్బు సంపాదించవచ్చు

అన్నయ్య అంచనాలకు్కడా అందనంతగా ఎదిగిపోయి ఆనందమయమైన జీవితాన్ని గడిపే అవకాశం వస్తోందన్న ఆలోచన కల్గింది మిథిలకు.

"మీ అన్నయ్య ఏమైనా అంటాడేమో!" అప్పుడు పెదవి విప్పి మాట్లాడేడు గోపీకృష్ణ.

"ఏమీ అనడు. అయినా నీకు తోడుగా నేనున్నప్పుడు నీకెందుకు భయం? " అని కొరకొరా అతని వేపు చూసింది మిథిల.

ఏమనుకున్నాడో ఏమో గోపీకృష్ణ మౌనంగా ఆమె వెంట నడిచేడు.

అన్నయ్య గదిలోకి వెళ్తూనే పెద్దగా ఏడుస్తూ "నన్ను క్షమించు అన్నయ్యా..., మన పరువు ప్రతిష్టలుపోయే పని చేశాను" అంది మిథిల ముఖం చాటుచేసుకుంటూ.

"ముందా ఏడుపు మానేయ్. అదంటేనే నాకు అసహ్యం!" గద్దించేడు మార్కండేయులు.

ఆమె చాలా సులభంగానే నిగ్రహపడింది.

మిథిల ఇక ఏడ్చే సాహసం చెయ్యదని నిర్ధారించుకుని "జరిగిందానికి మీరేం సంజాయిషీ ఇచ్చే ప్రయత్నం చెయ్యకండి. అది మీ వ్యక్తిగత విషయం. జరగాల్సిందేంటో కూడా మీరే నిర్ణయించి చెప్పండి. అది మీ బాధ్యత. నిజానికి మీ బాధ్యతను మీకు గుర్తుచేసే అవసరం నాకు లేదు. నీ. ఉమ్మడి కుటుంబం కనుక కుటుంబ పెద్దగా ఇష్టం లేకున్నా కొన్ని విషయాల్లో తలదూర్చక తప్పదు. అందుకు విలువైన కొంత సమయాన్ని వృధాగా ధ్వంసం చేసుకోవటం కూడా తప్పదు. మీరొక నిర్ణయానికి వచ్చే ముందు ఈ కుటుంబపు పరువు, ప్రతిష్టలు యిత్యాది మురిగిపోయిన మాటల్ని మననం చేసుకోకుండా మీ కోసం మీరేం చెయ్యదల్చుకున్నారో, అది నిష్కపటంగా నాకు చెప్పండి" అన్నాడు మార్కండేయులు.

గోపీకృష్ణ, మిథిల ఒకళ్ల ముఖాలొకళ్లు చూసుకున్నారు.

"మేమిద్దరం పెళ్లి చేసుకుంటాం" క్షణం తర్వాత చిన్నగా అంది మిథిల.

"నీ అభిప్రాయం చెప్పేంతవరకే అధికారం నీకుంది. గోపీకృష్ణ మౌనాన్ని నేనెలా అర్థం చేసుకోవాలి? "

అన్నయ్య భావాన్ని అర్థం చేసుకుంది మిథిల.

"బావా! మనం పెళ్లి చేసుకుంటామని అన్నయ్యకు చెప్పవేం? " అంది అతని చేతి మీద రహస్యంగా గిచ్చుతూ.

"అవును, మేం పెళ్లి చేసుకుంటాం" చెప్పేడు గోపీకృష్ణ.

"మీరిక వెళ్లొచ్చు" అన్నాడు మార్కండేయులు.

ఇద్దరూ నిష్క్రమించేరు.

ఒక గంట తర్వాత ఇంటి పురోహితుడు వచ్చేడు. ముందుగానే అతనితో మిథిల, గోపీకృష్ణల పెళ్లి విషయం మాట్లాడి సాధ్యమైనంత త్వరగా ముహూర్తం నిర్ణయించమని ఫోన్లోనే చెప్పాడు.

పురోహితుడు మరికొంతమందితో చర్చించాక హడావుడిగా మార్కండేయులు ఇంటికి వచ్చాడు.

పెళ్లి జరిపిస్తే మరో పది రోజుల్లోనే మంచి ముహూర్తం ఉందిట. అది తప్పితే మరో నాలుగు నెలల వరకు లేవట.





పురోహితుడు చెప్పిందానికి సాలోచనగా తలపంకిస్తూ, "సరే ఆ ముహూర్తమే ఖాయం చెయ్యండి" అని చెప్పేడు మార్కండేయులు.

భువనేశ్వరీదేవి, కాత్యాయిని ఆశ్చర్యపోయేరు!

అంత కొంపలు ములిగినట్లు హడావుడిగా పెళ్లి నిశ్చయం చెయ్యటం వెనుకగల మార్కండేయులు ఆంతర్యం వాళ్లకు అర్థం కాలేదు.

"చూడరా అబ్బాయీ, మార్కండేయా! దూరాభారాన ఉన్న చుట్టపక్కాలకు శుభలేఖలు అందేంత సమయం కూడా లేకుండా ఇంత త్వరగా ముహూర్తం పెట్టించటం బాగాలేదు. అయినా ఇప్పుడు దాని పెళ్లికేం తొందరొచ్చిందనీ..." అంటూ కొడుకు పక్కనే కూర్చుని దీర్ఘం తీసేరు భువనేశ్వరీదేవి.

మార్కండేయులు సమాధానం చెప్పలేదు.

ఆమె ఇంకా ఏవేవో ప్రశ్నలు వేస్తూ అతడి ఆంతర్యాన్ని రాబట్టేందుకు ఇంకా విఫలయత్నం చేస్తూనే ఉంది.

ఇక మాట్లాడి ప్రయోజనం లేదనుకుని భువనేశ్వరీదేవి అక్కణ్ణించి లేచివెళ్లిపోయింది.

కొంచెంసేపటికి ఎవరో వచ్చి అచ్చయిన శుభలేఖలు ఇచ్చి వెళ్లేరు.

మార్కండేయులు ముందు కొంచెం ధైర్యంగా మాట్లాడగలిగేది ఒక్క కిరణ్మయి మాత్రమే!

తన మనసులో ఉన్న అసంతృప్తిని వెళ్లగక్కేందుకు కిరణ్మయి కోసం చూసేరు భువనేశ్వరీదేవి.

సంగీతం స్కూల్లో ఏవో సాంస్కృతిక ప్రదర్శనలు జరుగబోతూన్నందువల్ల కిరణ్మయి చాలా పని వత్తిడిలో వుంది. సరిగ్గా ఇంటిపట్టున కూడా ఉండటంలేదు.

ఆరోజు బాగా పొద్దుపోయింతర్వాత ఇంటికి వచ్చింది కిరణ్మయి.

అప్పటికే అందరూ భోజనాలు ముగించేరు.

కిరణ్మయి కూడా భోంచేసి తన గదిలోకి వెళ్లి విశ్రాంతిగా పడుకుంది.

ఆమె చూపులు గోపీకృష్ణ తనకు బహూకరించిన వీణమీదనిల్చేయి.

మరుసటిరోజు సాయంత్రమే సంగీతం స్కూల్లో సాంస్కృతిక ప్రదర్శనలు జరుగుతాయి. అందులో కిరణ్మయి ప్రదర్శన కూడా వుంది. బావ బహూకరించిన వీణతోనే ప్రదర్శన ఇచ్చి, తనకు బాగా ఇష్టమైన రాధామాధవీయం గానం చెయ్యాలనుకుంది కిరణ్మయి.

తెల్లవారింది...

త్వరత్వరగా తెమిలి సంగీతం స్కూలుకు వెళ్లేందుకు సిద్ధమౌతోంది కిరణ్మయి.

సాయంత్రం జరిగే ప్రదర్శనకు గోపీకృష్ణను ఆహ్వానించాలనీ, అవకాశం చూసుకుని అక్కడే మనసు విప్పి అతనితో మాట్లాడాలనీ అనుకుని గోపీకృష్ణ కోసం అతడి గదివేపుకు వెళ్లబోయింది.

సరిగ్గా అప్పుడే భువనేశ్వరీదేవి కిరణ్మయి గదిలోకి వచ్చి కుర్చీలో కూలబడుతూ "అమ్మా, కిరణ్మయీ! ఏంటి హడావుడి? " అడిగింది.

"మరేం లేదమ్మా.. గోపీ బావకో విషయం చెప్పాలనీ..."

"చెప్పొచ్చులెద్దూ..." అంటూ కుర్చీలోంచి లేచి కిరణ్మయి దగ్గరికి వచ్చి సాధ్యమైనంత లోగొంతుతో "చెప్పొద్దూ... నాకు మాత్రం అనుమానంగానే ఉంది! ఆ పరాత్పరం మార్కండేయులు మీద కోపంతో సెలైన్ సీసా బిరడా తీసే ఉంటాడు. కాకపోతే మీ అన్నయ్యకిలా మళ్లీ పుండు పుడుతుందా? " అన్నారు భువనేశ్వరీదేవి.

కిరణ్మయి విచిత్రంగా చూసింది.

"నీకింకా విషయం తెలియదు కదూ... మిథిలకూ, గోపీకృష్ణకూ పదిరోజుల్లో పెళ్లి నిర్ణయించాడు మీ అన్నయ్య. గంటలమీదే లగ్నం పెట్టించటం, శుభలేఖలు అచ్చువే యించటం కూడా చేసేడు. పెద్ద ముండను నేనొకదాన్ని బతికే ఉన్నాననీ, నాతో సంప్ర దించి నిర్ణయించాలనీ వాడికి గుర్తేలేదు"

"ఏంటమ్మా! అక్కకూ, బావకూ పెళ్లా? " విస్మయంతో అడిగింది కిరణ్మయి.

"అవును!"

"బావ ఒప్పుకున్నాడా? "

"ఎందుకు ఒప్పుకోడు. మీ అన్నయ్యను కాదనే ధైర్యం అతనికి మాత్రం ఉందా!" అని భువనేశ్వరీదేవి బయటికి వెళ్లిపో యేరు.

ఆ క్షణంకోసమే ఎదురు చూస్తోంది కిర ణ్మయి!

అమ్మ అలా బయటికి వెళ్లీ వెళ్లకముందే తలుపులు ధడేల్నమూసి, గడియ బిగించి అమాంతం వెళ్లి మంచంమీద వాలిపోయి భోరుమని ఏడ్చింది.

అపురూపంగా చూసుకుంటోన్న కళాఖం డాన్నెవరో నిర్దాక్షిణ్యంగా పగులగొట్టినట్లు విలవిల్లాడిపోతూ వెక్కుతూ ఏడుస్తూ, వెక్కుతూ... అలా ఆ దుఃఖపు పొంగు కొంచెం శాంతించేక చివాల్న మంచం మీంచి లేచి విసురుగా వెళ్లి గోపీకృష్ణ తనకు బహూకరించిన వీణను రెండు చేతులతో గాల్లోకి పైకిలేపి బలంగా నేలకు విసిరికొ ట్టింది.

అది భళ్లున పగిలింది. చెక్కముక్కలు దూరంగా ఎగిరిపడ్డాయి. తంత్రుల్ని కాలితో బలంగా కిందరాసి, ఇంకా కసితీరక వాటిని ఎత్తి కిటికీ గుండా బయటికి విసిరేసింది.



అది తుపానుముందు ప్రశాంతతో, తుపాను అనంతరం ప్రశాంతతో కానీ రెండు క్షణాలు కిటికీ దగ్గరే శాంతంగా నించుంది కిరణ్మయి. తర్వాత, పైట కొంగుతో ముఖం తుడుచుకుని పెద్ద పెద్ద అడుగులు వేస్తూ గదిలోంచి బయటికి నడిచింది.

కిరణ్మయి గదిముందే తారట్లాడుతూ కనిపించేడు గోపీకృష్ణ.

దెబ్బతిన్న బెబ్బుల్లా అతనివేపు చూస్తూ, "యూ... ఛీట్!" అని విసవిసా నడుస్తూ బయటికి వెళ్లిపోయింది.

కిరణ్మయి స్వభావం ఎలాంటిదో గోపీకృష్ణకు బాగా తెలుసు!

కొంతమంది శత్రుత్వాన్నైనా నిర్భయంగా ఆహ్వానించవచ్చుగానీ కిరణ్మయితో స్నేహమూ, శత్రుత్వమూ రెండూ కత్తిమీద సాములాంటివే...

గోపీకృష్ణ గుండె ఆందోళనతో వేగంగా కొట్టుకుంటోంది.

ఏవేవో భయంకరమైన పరిణామాలను ఊహించుకుంటూ ఖిన్నుడై తలదించుకుని నించుండిపోయేడు.

★ ★ ★

ఆ రోజు సాయంత్రం జరిగే సాంస్కృతిక ప్రదర్శనల్లో తన గానకచేరీ వినిపించబోతోన్న కిరణ్మయి స్కూల్లో కూర్చుని రిహార్సల్ చేస్తోంది.

రాధా మాధవీయాన్ని మంద్రస్వరంతో గానం చేస్తూ వీణ మీటుతోంది.

అయినా ఆమె ధ్యాసంతా ఎక్కడో వుంది. గానం శృతి తప్పుతోంది... వీణా నాదానికీ ఆమె గానానికీ సంబంధమే లేకుండా.

కిరణ్మయి ఆ కిరణ్మయేనా? అన్నంతగా ఆశ్చర్యపోతూ "ఏంటమ్మా, కిరణ్మయీ! అదోలా ఉన్నావ్? సాయంత్రమే ప్రోగ్రాం ఉంటే ఇప్పుడు నువ్విలా అన్యమనస్కంగా రిహార్సల్ చేస్తే సాయంత్రం మంచి పెర్ఫార్మెన్స్ ఎలా ఇవ్వగలవు? అలా అయితే మన స్కూలు పరువేపోతుంది" అంది సంగీతం టీచరు.

కిరణ్మయి విషాదంగా నవ్వింది. వీణను దూరంగా జరిపి గాఢంగా నిట్టూర్చింది.

అక్కడికి ఎప్పుడు వచ్చాడోకానీ "టీచరుగారూ! ఆ విషయాలన్నీ నేను చూసుకుంటాను. సాయంత్రం మన కిరణ్మయి కచేరీ బ్రహ్మాండంగా చేస్తుంది. ఎటూ ఆ ప్రోగ్రాంలో డోలు వాయించేది నేనే కనుక ఆమెచేత ఫైనల్ రిహార్సల్ నేను చేయిస్తాను. మీరు నిశ్చింతగా వెళ్లి స్టేజి ఏర్పాట్లు, మిగతా పనులూ చేసుకోండి" అని సంగీతం టీచరుకు ధైర్యం చెప్పేడు పరాత్పరం.

సంగీతం టీచరు వెళ్లిపోయింది.

"కిరణ్మయీ! కారణం ఏంటోకానీ అనుభవించేందుకు ఈ ప్రపంచంలో చాలా ఆనందాలను మనిషికోసం సిద్ధంగా ఉంచేడా భగవంతుడు. జీవితంలో ఏదో జరిగిందనుకుని ఆ ఆనందాలను ఆహ్వానించకుండా బతుకును నరకం చేసుకోవడం విజ్ఞత కానేకాదు"

సౌమ్యంగా కిరణ్మయి వేపు చూస్తూ ఎంతో అనునయంగా అన్నాడు పరాత్పరం.

కిరణ్మయి తలెత్తి అతనివేపు చూసింది. ఆమె కళ్లు ఎర్రగా మెరుస్తున్నాయి.

"నిన్ను ఇబ్బంది పెట్టే అవకాశం నాకు వచ్చింది. అయినా ఇబ్బంది పెట్టేనా? అంతా కడుపులో దాచుకుని ఏమీ ఎరుగనట్లే వున్నాను. కానీ నిన్ను గుండెల్లో దాచుకోవలసిన మీ అన్నయ్యే మిథిలకూ, మీ బావకూ పెళ్లిచేస్తూ నీ గుండెను తూట్లు పొడిచేందుకు సిద్ధపడ్డాడు"

ఆశ్చర్యంగా వింటోంది కిరణ్మయి!

"సరే... అయిందేదో అయింది. ఆ విషయం ప్రస్తుతానికి మర్చిపో. నీ సర్వశక్తియుక్తుల్నీ వినియోగించు. ఈనాటి కార్యక్రమాన్ని నువ్వు విజయవంతంచేసి నా





మాట అదే సంగీతం టీచరుకు నేనిచ్చిన మాట నిలబెట్టావంటే ఆ క్షణంనుంచే నేను నీకు అండగా వుంటాను. పగ, ప్రతీకారంతో రగిలిపోతోన్న నీ మనోవాంఛ నెరవేరేందుకు నీకు నా సహకారం వుంటుంది" చెప్పేడు పరాత్పరం.

కిరణ్మయి గట్టిగా శ్వాసపీల్చుకుంది.

అంతవరకూ ఏ క్షణాన అయినా బద్దలయ్యేందుకు సిద్ధంగా వుండి, లోలోపలే కుతకుతా ఉడుకుతోన్న అగ్ని పర్వతానికిమల్లే గుంభనంగా రగిలిపోతోన్న కిరణ్మయి అతడి స్వాంతన వచనాలకు భళ్లుమని ఏడ్చింది. బేలగా అతడివేపు చూసింది.

పరాత్పరంకు కావాల్సింది అదే! అగ్నిలో కాలిన లోహం నిప్పుముద్దలా సెగలు విరజిమ్ముతోన్నప్పుడే సమ్మెటతో బాది దాన్ని కోరుకున్న రీతిలో మలచుకోవాలి. ఒక మనిషి అందునా ఆవేదన, ఆవేశాలతో నిండివున్న స్త్రీ తన దారికి రావాలంటే ఆ క్షణంలో ఆమెకు కావాల్సింది కాస్తింత ఊరట మాత్రమే అని అతనికి బాగా తెలుసు. అది అతను మోతాదును బట్టి ఆమెకు అందించేడు. ఆమె స్పందించింది.

"నాకు చాలా నీరసంగా వుంది. ఈ ప్రోగ్రాం చెయ్యగలనో, లేదో" అంది చిన్నగా.

అది అంగీకారమే అని అతడు గ్రహించేడు. ఒక అరిటి పండును ఖాకీ సంచీలోంచి తీసి ఆమెకు ఇచ్చాడు.

"కిరణ్మయీ! మనం నమ్మినా, నమ్మకపోయినా సృష్టిలో చాలా రహస్యాలున్నాయి. చాలా మహిమలూ వున్నాయి. ఇది అమ్మవారి ప్రసాదం. ఈ అరటిపండు తిను. నువ్వు కనీసం ఊహించనుకూడా ఊహించనంత శక్తి నీకు సమకూరుతుంది. కార్యక్రమాన్ని నువ్వు తప్పక జయప్రదంగా ముగిస్తావ్!" అన్నాడు పరాత్పరం.

అతడి చూపుల్లోని అభ్యర్థనను గమనించింది కిరణ్మయి. అరటిపండు వొలుచుకుని నమిలి మింగేసింది.

పరాత్పరం వీణను ఆమె ముందుకు తోసేడు. తను డోలు ముందు పెట్టుకుని చిన్నగా శబ్దం చేసేడు.

ఒక్కో నిముషం గడిచేకొద్దీ ఆమె అంతరంగంలో కల్లోలం సృష్టిస్తోన్న అశాంతి క్రమంగా తొలగిపోతూ, దాని స్థానంలో రాధా మాధవీయ గానామృతం నిండి అనిర్వచనీయమైన ఆనందంలో తేలిపోతూ మబ్బుల్లో విహరించసాగింది.

ఆమె శరీరం దూదిపింజలా తేలిపోతోంది. అణువణువూ చైతన్యమైనట్టూ, ఆనందాలన్నింటినీ ముద్దచేసి ఆమెకోసమే సిద్ధం చేసి దాన్నందుకుందుకు ఎవరో తనకు వెలుతురు దారి చూపిస్తోన్నట్టే వుంది.

ఇది కలా? నిజమా??

అదిగో... యమునా తీరాన శ్రావ్యంగా వేణుగానం చేస్తూ చిలిపి గోపాల కృష్ణుడు యాదవ కన్యల ఎదలు దోచుకుంటూ....

చెలియలికట్టలు తాకి చిట్లి, సుతారంగా శబ్దాలు చేస్తున్న యమునా తరంగాల మృదుల రాగాలు!

ఆ నిర్మల నీలాకాశం, సుగంధాలు పులుముకుని అలల్లా తేలుతోన్న మలయమారుతం, రంగుల పక్షుల కువకువలూ...

కావ్య నాయికలా నించున్న అందాల రాధేనా ఆమె!

అవునూ పొదల మాటునించి చిరునవ్వులు చిందిస్తూ బయటికి గెంతి రాధను ఉడికిస్తోంది ఆ వెన్న దొంగేకదూ?

అసంకల్పంగానే వీణా తంత్రులమీద ఆమె వేళ్లు నృత్యం చేస్తోన్నాయి. మంద్రంగా మొదలైన స్వరం ఝురిలా సాగిపోతోంది.



అవునవును! ఆ వెన్నదొంగ, ఆ రాధ ఇప్పుడు మంచుపరదాలు విచ్చిపోయి స్పష్టంగా కనిపిస్తున్నారు.

రాధ ఆ యాదవకన్య కానేకాదు... తనే!

మాధవుడు ఆ వెన్నదొంగ కానేకాదు... గోపీకృష్ణే!

పులకితై ఉద్వేగం, ఉత్సాహం, ఉలికిపాటూ ముప్పిరిగొని వివశత్వంతో తన్ను తాను మర్చిపోయి గానంలో లీనమైంది కిరణ్మయి.

అక్కడికి వచ్చి ఆ గానాన్ని వింటోన్న సంగీతం టీచరు కిరణ్మయి అంకిత భావానికి ముగ్ధురాలై సర్వేంద్రియాలనూ కేంద్రీకరించి వింటోంది.

ఎంతో అనుభవం వున్న పరాత్పరం కూడా కిరణ్మయిలో నిద్రాణమై ఉన్న ఆ గంధర్వగాన పటిమకు ఆశ్చర్యపోక తప్ప లేదు.

గానం పూర్తయింది.

అభినందనలూ పూర్తయ్యేయి.

"కిరణ్మయీ! కొంచెంసేపు అలా చాప మీద పడుకుని విశ్రాంతి తీసుకో. ప్రదర్శనకు అరగంట ముందుగా లేపుతాను" అన్నాడు పరాత్పరం.

నిజానికప్పుడు ఆమెకూ నిద్రముంచుకొస్తోంది. చాలా మగతగా వుంది.

కిరణ్మయి వెళ్లి ఓ మూలగా చాప పరుచుకుని పడుకుంది.

పరాత్పరం తన విజయానికి తనే మురిసిపోతూ బయటికి వెళ్లిపోయేడు.

సరిగ్గా ప్రదర్శన మరో అరగంటలో మొదలౌతోందనగా అనుకున్నట్లే కిరణ్మయిని నిద్ర లేపేడు పరాత్పరం.

"కిరణ్మయీ! ప్రదర్శన వేళకావస్తోంది. నువ్వు ముస్తాబై సిద్ధంగా వుండు" చెప్పేడు పరాత్పరం.

కిరణ్మయి తొలిసారిగా అతనివేపు అభిమానం వర్షించే కళ్లతో చూసింది.

"లేలే... టైమైంది!" రెట్టించేడు పరాత్పరం.

ఏదో సంశయిస్తూ ఒక్క క్షణం తటపటాయించి ఆ తర్వాత అడిగింది కిరణ్మయి "పరాత్పరంగారూ! నాకు మళ్లీ అరటిపండు కావాలి!"

పరాత్పరం గుంభనంగా నవ్వుకున్నాడు.

"అలాగే ఇస్తాను. కానీ ముందు నువ్వు ముఖం కడుక్కుని ముస్తాబైరా.. స్టేజి ఎక్కే ముందుగా అమ్మవారి ప్రసాదం ఇస్తాను" అన్నాడు పరాత్పరం.

కిరణ్మయి ఉత్సాహంగా లేచి లోపలికి వెళ్లిపోయింది. హడావుడిగా తయారై పది నిముషాల్లోనే వచ్చింది.

పరాత్పరం ఆమెవేపు ఆరాధనగా చూసేడు.

"ఇక రామ్మా కిరణ్మయీ!" పిల్చింది టీచరు లోపలికి వస్తూ.

కిరణ్మయి లేచి నుంచుంది.

ఎవరో వచ్చి వీణను స్టేజిమీదికి పట్టుకుని వెళ్లేరు.

నెమ్మదిగా స్టేజి దగ్గరికి నడిచింది కిరణ్మయి.

తెరల వెనగ్గా వున్న స్టేజి మొదటి మెట్టు మీద కాలుపెట్టి పరాత్పరం వేపు అభ్యర్థనగా చూసింది.

ఆమె భావం పరాత్పరం గ్రహించకపోలేదు. వెంటనే సంచీలోంచి మరో అరటి పండు తీసి ఆమె చేతిలో పెట్టాడు.

అరటి పండును తిని తొక్కను పక్కకు విసిరికొట్టి స్టేజిమీదికి నడిచింది కిరణ్మయి.

గానం మొదలైంది...

గలగలల సెలయేరు కొండల మీంచి దూకుతున్నట్లు, నిర్నిరోధంగా సాగుతూ





అంచెలవారిగా మరింత శ్రావ్యతనూ, ఆర్ద్ర తనూ ఆమె కంఠంలోంచి వొలకబోస్తూ...

గానం ఎప్పుడు పూర్తయిందో కానీ శ్రోతల కరతాళ ధ్వనులు విని తలెత్తి చూసింది కిరణ్మయి.

ఆశ్చర్యపోయింది.

ఆహ్వానం అందినా అన్నయ్య ఆ కార్యక్ర మానికి వస్తాడన్న నమ్మకం ఆమెకు ఏకోశా నాలేదు కానీ ఆమె అంచనా తప్పింది.

చిరునవ్వులు చిందిస్తూ ప్రేక్షకుల ముందు వరుసలోనే కనిపించేడు మార్కం డేయులు.

కిరణ్మయి కళ్లు ఎర్రగా మందారాల య్యేయి!

★ ★ ★

పెళ్లిరోజు రానే వచ్చింది. మార్కండే యులే స్వయంగా దగ్గరుండి ఏర్పాట్లన్నీ తనే చేస్తున్నాడు. భువనేశ్వరీదేవి, కాత్యా యినీ పనివాళ్ల సహాయంతో బియ్యం, పప్పులూ బాగు చేసుకోవటం, పెళ్లికి కావా ల్సిన సరంజామా అంతా సమకూర్చుకో వటం చేసేరు.

కిరణ్మయి మాత్రం తనకేం పట్టనట్టే వుంది.

ఎక్కువ సమయాన్ని సంగీతం స్కూల్లోనే గడపటం, మధ్యమధ్యలో స్నేహితురాండ్ర ఇంటికి వెడుతోన్నానని చెప్పి వెళ్లటం చేస్తోంది.

అయినా ఎవ్వరూ ఆమెను పట్టించుకో లేదు. ఎవరి గొడవ వాళ్లది!

దూరపు బంధువులంతా వచ్చేసేరు.

మార్కండేయులు కోర్కె మేరకు సింధ నూర్నించి రెండు రోజులు ముందుగానే వచ్చాడు పద్మరాజు.

తక్కువ వ్యవధిలో ముహూర్తం పెట్టు కున్నా ఏర్పాట్లన్నీ ఘనంగానే చేసేడు మార్కండేయులు.

పెద్ద కూతురికి పెళ్లవుతోందని ఒక వంక భువనేశ్వరీదేవికి సంతోషంగానే వున్నా చిన్నబ్బాయి కబురు ఇంకా ఏమీ లేకపోవ టంతో ఆమెకు ఎంతో వెల్తిగా తోస్తోంది.

"అబ్బాయ్, మార్కండేయా! రామబ్రహ్మం వస్తోన్నట్టా లేనట్టా? అసలు పెళ్లి కబురు పంపించావో లేదో? " అని సమయం చూసుకుని కొడుకుని అడిగేరు భువనేశ్వరీ దేవి.

మార్కండేయులు పేలవంగా నవ్వేడు. "అదేంటమ్మా, అలా అంటావ్... చెల్లాయి పెళ్లి కబురు బ్రహ్మంజీకి తెలియపరచ కుండా ఎలా ఉంటాను? అయినా పెళ్లికి వారు రావటంలేదు..."

"ఏమట? " ముఖం చిట్లించి అడిగేరామె.

"బలహీనపడుతోన్న హిందూ మతోద్ధరణ కోసం బ్రహ్మంజీ కాశ్మీరు నించి కన్యాకుమా రిదాకా పర్యటించే కార్యక్రమంలో ఉన్నా రట. వారి ఆశ్రమ పీఠం కార్యదర్శి రాసిన ఉత్తరం నిన్ననే అందింది" చెప్పేడు మార్కండేయులు.

"మరి నాతో మాటమాత్రం అన్లేదే? "

"దానికి అంత ప్రాముఖ్యత ఏముంది కనుక? " అని మార్కండేయులు వివాహ వేదిక దగ్గరికి వెళ్లిపోయేడు.

కరివేపాకు హడావుడి అంతాయింతా కాదు! వేదిక దగ్గర అలంకరణతో సహా ఏర్పాట్లన్నీ అతనే పర్యవేక్షిస్తోన్నాడు.

వెండి పళ్లేల్లో పసుపు, కుంకుమ, తమల పాకులూ, వక్కలూ అమర్చేరు. వివాహవే దిక మొత్తం సుగంధ పరిమళాలను వెదజ ల్లుతోంది. పురోహితులు కావాల్సిన సరం జామా అంతా ఒకసారి సరిచూసుకుని స్థిమితంగా కూర్చున్నారు.

ఆహ్వానితులంతా ఒక్కొక్కళ్లే వచ్చి



కూర్చుంటున్నారు.

భువనేశ్వరీదేవికి అప్పుడు గుర్తొచ్చింది కిరణ్మయి! ఆమెకోసం ఇంటాబయటా అంతా వెదికారు. కానీ కిరణ్మయి ఎక్కడా కనిపించలేదు.

అంతలోకే కాత్యాయిని ఆమెకు ఏదో పనిని పురమాయించటంతో ఆ ధ్యాసలోపడి కిరణ్మయి విషయం మర్చేపోయేరు భువనేశ్వరీదేవి.

పెళ్లి ఘడియ వచ్చింది.

పురోహితులు మంత్రాలు చదువుతోన్నారు.

మధ్యమధ్యలో చెవులను హోరెత్తిస్తూ బాజా భజంత్రీలు మోగుతున్నాయి.

ఇంటివెనుక వున్న పూలతోటలో చాలాసేపట్నించి కూర్చొని ఏడుస్తోంది కిరణ్మయి. కళ్లు రెండూ వాచిపోయి నిప్పుముద్దల్లా మండుతోన్నాయి. ముఖం పీక్కుపోయింది. ఆమె అన్నం తిని రెండు రోజులైంది.

పరాత్పరం గుర్తొచ్చాడు.

అరటిపండూ గుర్తొచ్చింది.

ఇహలోకం ప్రసాదించే బాధలకూ ఆవేదనకూ, ఆలోచనలకూ దూరంగా ఎక్కడికో నిరుపమానమైన ఆనందలోకాల్లోకి పంపించి హృదయాన్ని తేలికపరిచే అద్భుతమైన మహత్తుగల ఆ అరటిపండు ఆమెకు కావాలనిపిస్తోంది.

పరాత్పరం ఎక్కడ కనిపిస్తాడో?

కనిపించినా సమయానికి అతని దగ్గర అమ్మవారి ప్రసాదం ఉంటుందో, లేదో...

అయినా పరాత్పరంను వెతికి పట్టుకోవాలి. అతని దగ్గర ప్రసాదం లేకపోయినా దగ్గరుండి పూజ జరిపించి అయినా ప్రసాదం స్వీకరించాలి అనుకుంది కిరణ్మయి.

సరిగ్గా అప్పుడే పెళ్లి వాయిద్యాలు ఆమెకు కర్ణకఠోరంగా వినిపించేయి. రెండు చేతులతో చెవులను గట్టిగా మూసుకుని పూనకం వచ్చినట్లే విసురుగా నడుస్తూ అక్కడ్నించి బయటికి నడిచింది కిరణ్మయి.

వాకిటిముందే పెళ్లివేదిక. అంతా ఎవరి గొడవలో వాళ్లున్నారు. కిరణ్మయిని ఎవ్వరూ గుర్తించలేదు.

జనాన్ని తప్పించుకుంటూ కుర్చీల వెనగ్గా నడుస్తూ వెడుతోంది కిరణ్మయి.

పెద్దపెట్టున వాయిద్యాలు మోగుతున్నాయి.

తలెత్తి వేదికవేపు చూసింది.

సరిగ్గా అప్పుడే గోపీకృష్ణ మిథిల మెడలో మంగళసూత్రాలు ముడివేస్తూ కనిపించేడు.

కిరణ్మయి తూలి కిందపడబోయి ఓ కుర్చీని ఆసరాగా పట్టుకుని తమాయించుకుంది. ఒక్కక్షణం అలాగే నిలబడి గాలి పీల్చుకుంది. కూలిపోతున్న శక్తిని ప్రయత్నంమీద కూడగట్టుకుని దూరంగా వెళ్లిపోయింది.

ఒకవేళ పరాత్పరం సంగీతం స్కూలు దగ్గర కనిపిస్తాడేమో అని నడకవేగం పెంచి స్కూలు దగ్గరికి వెళ్ళి చూసింది.

పరాత్పరం అక్కడ లేడు.

తెలిసినవాళ్ళను ఆచూకీ అడిగింది. వాళ్లు చెప్పిందాని ప్రకారం ఆ రోజేవో ప్రత్యేకపూజలు చేస్తూ పరాత్పరం ఇంటి దగ్గరే ఉన్నాట్ట.

పరాత్పరం ఇంటికి వెళ్ళాలన్న నిర్ణయానికి వచ్చేందుకు ఆమెకు ఎక్కువ సమయం పట్టలేదు. అలాంటి నిర్ణయానికి రాగానే ఓ రిక్షా పిలిచి అందులో బయల్దేరింది కిరణ్మయి.

అరగంట ప్రయాణం తర్వాత పరాత్పరం ఇల్లొచ్చింది.

రిక్షాదిగి బాడుగ డబ్బు ఇచ్చి రిక్షాను పంపించి, తలెత్తి చూసింది.

పరాత్పరం ఇంట్లోంచి జనం వెళ్ళిపోతూ కనిపించారు. పూజ అప్పటికే ముగిసిపోయి ఉంటుందనుకుంది కిరణ్మయి. వడివడిగా





నడుస్తూ ఇంట్లోకెళ్ళింది.

పరాత్పరం వాకిట్లోనే ఎదురొచ్చాడు. కిర ణ్మయిని చూసి ముఖం చాటంత చేసుకుని నవ్వుతూ, "అనుకుంటున్నా... నువ్వు తప్ప కుండా అమ్మవారి ప్రసాదం కోసం వస్తావని అనుకుంటున్నా. అలాగే వచ్చేశావు" అని కిరణ్మయిని ఇంట్లోకి ఆహ్వానించేడు పరాత్పరం.

లోపలికి వెళ్ళి చాపమీద కూర్చుంది కిర ణ్మయి.

ఆమెకు ఎదరగా కూర్చుని "మీ అక్కకు మంగళసూత్రధారణ కూడా జరిగిపోయింది కదూ? " ఆమె కళ్ళలోకి సూటిగా చూస్తూ అడిగాడతను.

ఆమె మౌనంగా తలూపింది. రెండు కళ్ళ వెంటా కన్నీళ్లు జలజలా రాలాయి.

"ఇప్పుడు నీకు ఊరట కల్గించేందుకు నా స్వాంతన వచనాల శక్తి ఎంతమాత్రం చాలదు. అందుకు మహిమాన్వితమైన అమ్మవారి ప్రసాదం మాత్రమే ప్రయోజన పడుతుంది..." అన్నాడు పరాత్పరం.

అతనివేపు ఆశగా చూసింది కిరణ్మయి.

పరాత్పరం ఆమె ప్రవర్తన్ను ఓరకంట గమనిస్తూ కొంచెంసేపు మౌనంగా కూర్చు న్నాడు.

"ప్లీజ్... నాకు అరిటిపండు కావాలి!" అంది కిరణ్మయి.

పరాత్పరం తాపీగా బొడ్లోంచి నశ్యం కాయ బయటికి తీసి ఓ చిటికెడు నశ్యం ఎగపీల్చేడు.

అప్పటికప్పుడే అతడి కళ్లలో ఎర్రటి జీరలు అలుముకున్నాయి.

"ప్లీజ్... ఆలస్యం భరించలేను" అంది అసహనంగా.

పరాత్పరం అదోలా నవ్వుతూ వెళ్ళి ఓ అరిటిపండు తెచ్చాడు.

అతను చేతికి ఇవ్వకముందే అమాంతం దాన్ని అతని చేతుల్లోంచి లాక్కుని క్షణంలో ఒలుచుకుని మింగేసింది కిరణ్మయి.

"కిరణ్మయీ! అలజడితో నీ మనసు బాగా అలసిపోయినట్లుంది. కొంచెంసేపలా చాప మీద పడుకుని విశ్రాంతి తీసుకో" చెప్పాడ తను.

పరాత్పరం అన్నట్లే మహిమాన్వితమైన ఆ అరటిపండు తన ప్రభావం చూపిస్తోంది అప్పటికే! దూదిపింజలా గాల్లో తేలి పోతూ- క్షణం తర్వాత నెమ్మదిగా చాపమీ దికి ఒరిగిపోయింది కిరణ్మయి.

పరాత్పరం లేచి నించున్నాడు. తడికె తలుపు దగ్గరికి వేశాడు. తలవంచుకుని నడుస్తూ కొంతదూరం వెళ్ళాడు.

అక్కడ రెండో, మూడో గుడిసెహోటళ్లు న్నాయి.

ఓ హోటల్లోకి వెళ్ళి కిచిడి పార్శిల్ తీసు కుని మళ్ళీ తన గుడిసెవేపుకు నడిచేడు.

సమయం మధ్యాహ్నం మూడుగంటలు కావస్తోంది.

మానసికంగా, శారీరకంగా ఎంతగా అల సిపోయిందో కానీ కిరణ్మయి ఇంకా గుర్రు పెట్టి నిద్రపోతూనే వుంది.

ఆమె భోంచెయ్యలేదన్న విషయం అత నికి గుర్తుంది. ఆమెను నిద్రలేపి కిచిడి తిని పిద్దామనుకున్నాడు. కానీ ఆమె గాఢ నిద్ర చూసి లేపేందుకు తటపటాయించేడు.

పదినిముషాల తర్వాత గ్రహపీడితులెవరో పరాత్పరం కోసం వచ్చారు. వాళ్ల బాధలను క్షుణ్ణంగా తెలుసుకుని ఇద్దరికి అమ్మవారి కుంకుమ, మరో ఇద్దరికి మంత్రించిన విబూది ఇచ్చేడు పరాత్పరం. దయ్యంపట్టిన ఓ పడుచుపిల్లకు తాయిత్తు కట్టాడు.

వాళ్ళంతా అమ్మవారికి కానుకలు సమ ర్పించుకున్న తర్వాత పరాత్పరం దగ్గర సెలవు తీసుకుని వెళ్ళబోతూ క్షణంసేపు ఆగి అక్కడే చాపమీద చలనం లేకుండా పడివున్న కిరణ్మయిని చూస్తూ నించు న్నారు.

పరాత్పరంకు వాళ్ళ భావం అర్థమైంది.

చిన్నగా దగ్గి "ఏంటలా ఆశ్చర్యంగా చూస్తున్నారు? ఆమె ఎవరో కాదు. నిఖార్సయిన శ్రోతియ కుటుంబంలో పుట్టింది. మీలాగే ఆమె కూడా గ్రహపీడితురాలే. నన్ను ఆశ్రయించింది. పూజ జరిపి అమ్మను వేడుకున్నాను, ఈ అమ్మాయిని కాపాడమని. అమ్మ కరుణించింది. ఈమె శరీరంలోని అణువణువులోనూ స్థిమితపడ్డ క్షుద్రశక్తుల్ని తరిమివేసింది. ఆ కారణంగా ఆమె నీరసించి అలా అపస్మారక స్థితిలో పడివుంది. పీడలన్నీ పూర్తిగా విరగడ కాగానే అమ్మ ఆదేశంతో అప్పుడు మన ప్రపంచంలోకి వస్తుంది" అని చెప్పి, అందరివేపూ మరింత పరీక్షగా చూస్తూ-

"చెప్పానుగా, ఈ అమ్మాయి ఎవరో! అదే... కోటీశ్వరుడు మార్కండేయుల్లేడూ, అతని చెల్లెలే ఈ అమ్మాయి" అని చెప్పాడు పరాత్పరం.

వాళ్ళంతా మరోసారి కిరణ్మయిని చూసి వెడుతూ వెడుతూ వాళ్లకు పరాత్పరం ఇచ్చిన కుంకుమ పొట్లాలనూ, తాయిత్తునూ కళ్ళకద్దుకుని వెళ్ళిపోయారు.

"మార్కండేయులంతటివాడి చెల్లెలే పరాత్పరంగారిని ఆశ్రయించిందంటే చాలా ఘటికుడే సుమీ!" అని ఎవరో అన్న మాటలు పరాత్పరంకు వినిపించకపోలేదు.

భళ్లున నవ్వి మళ్ళీ ఓ చిటికెడు నశ్యం పీల్చి ఎర్రజీరలు నిండిన కళ్లతో అతను కిరణ్మయివేపు ఆకలిగా చూశాడు.

★ ★ ★

పెళ్లితంతు పూర్తికాగానే భోజనాలు ముగించుకుని అతిథులు చాలావరకు వెళ్ళిపోయారు. ఇక మిగిలింది దూరప్రాంతాల నించి వచ్చిన వాళ్లూ, కొంతమంది దగ్గరి బంధువులు మాత్రమే.

మార్కండేయులు, కరివేపాకూ, పద్మరాజు, ఇంకా ఎవరెవరో భోజనాల అనంతరం కుర్చీల్లో కూర్చుని పిచ్చాపాటిగా కబుర్లలో పడ్డారు.

పద్మరాజు, కరివేపాకూ ఇద్దరూ పాతస్నేహితులే. పద్మరాజుగారిది కూడా గుంటూరే కావటం, ఇద్దరికీ మార్కండేయులు కుటుంబంతో స్నేహసంబంధాలు వుండటంవల్ల ఆ ఇద్దరూ అలా స్నేహితులయ్యారు.

మార్కండేయులు సింధనూర్లో పొలాలు కొని వాటి వ్యవహారాలు చూసేందుకు పద్మరాజును నియమించేడు.

పద్మరాజుకూ, కరివేపాకుకూ ఓ క్షణం కూడా పడేదికాదు. ఒకళ్లు ఉత్తర ధృవమైతే మరొకళ్లు దక్షిణ ధృవం.

పద్మరాజుకు అవకాశం చిక్కింది! కరివేపాకుని ఆటపట్టిస్తూ, "మన కరివేపాకు నాస్తికుడే అయినా ఈరోజు మాత్రం పురోహితులకు చాలా బాగా సహకరించేడు. శాస్త్రోక్తంగా జరిగిన పెళ్లితంతుమీద అంత అపారమైన నమ్మకం వున్న మన నాస్తికుడ్ని దేవుడనేవాడే వుంటే తప్పకుండా ఆశీర్వదిస్తాడు" అన్నాడు వెక్కిరింపుగా.

ఎవరో కిసుక్కున నవ్వేరు.

పద్మరాజు మాటలకు ఉడుక్కుంటూ "దేవుడు లేడనటానికి నిదర్శనం అక్కడున్న బిచ్చగాళ్ళే అని ఓ మహాకవి అన్నట్లుంది నీ వాదన కూడా. పెళ్ళితంతుకూ దేవుడికీ ఏం సంబంధం? " అన్నాడు కరివేపాకు.

"ముందుగా దేవుడు లేడు, అన్న నిర్ణయానికి వచ్చి, ఆ తర్వాత మీ నిర్ణయాన్ని ఎదుటివాళ్ళతో ఒప్పించేందుకు నువ్వు హేతువుల్ని వెతుక్కుంటావు. అలాగే శాస్త్రకర్మల్లో పాల్గొని ఆ తర్వాత కర్మలకూ దేవుడికీ ఏం సంబంధం? అన్న విశ్లేషణలో పడిపోయి ఇందులో కూడా హేతువుల్ని అడిగి తెలుసుకుంటున్నావా? " అని ఎదురుదెబ్బ తీశాడు పద్మరాజు.

"పోనీ, నువ్వన్నట్లు మాకో నిర్ణయమన్నా వుంది. నీ మటుకు నీకు అదీ లేదుగా. దేవుడున్నాడా? లేడా? అన్న విషయం నిర్ధారణకు వచ్చేందుకు హేతువుల్ని వెతుక్కోవటంతోటే నీ జీవితం తెల్లవారిపో




తోంది" అన్నాడు వెంటనే కరివేపాకు.

అప్పటిదాకా వాళ్ళ చర్చను వింటూ మౌనంగా కూర్చున్న మార్కండేయులు ఇక వాతావరణం వేడెక్కుతోందని గ్రహించి అప్పుడు కల్పించుకున్నాడు.

"భగవంతుడు ఉన్నాడనేందుకు జీవి ఆవిర్భావమే హేతువని మతాలు చెప్తోన్నాయి. దాన్ని మీరు విశ్వసించరు. మీరు కేవలం పరిణామవాదాన్ని మాత్రమే నమ్ముతారు కదూ? " అడిగేడు మార్కండేయులు.

"నా మటుకు నేనంతే!" అన్నాడు కరివేపాకు.

పద్మరాజు చిన్నగా దగ్గి, "నేను మాత్రం డార్విన్ పరిణామవాదాన్ని, హెగెల్స్ భౌతికవాదాన్ని కలిపి పరిణామక్రమంలో రూపు దిద్దుకుని కళ్లకు కనిపించే సత్యాలను మాత్రమే నమ్ముతాను" అన్నాడు దృఢంగా.

"మతవాదం ప్రకారం జీవి పుట్టుకకు భగవంతుడే కారణం అయితే అతడు సృష్టించిన ఈ సమాజంలో ఇన్ని అసమానతలు, కష్టాలు, కన్నీళ్లూ ఎందుకు? అంటే గత జన్మల పాపఫలం అంటారు. ఆ పాపఫలాన్ని అనుభవిస్తూ ఈ జన్మలో సత్యవ్రతులై, కర్మవ్రతులై, పరమనిష్టాగరిష్టులై పుణ్యఫలాలను ప్రోది చేసుకుంటే, గతజన్మల పాపఫలాల బాకీ ఈ జన్మ పుణ్యఫలాలతో రద్దు కావించబడి శేషంగా మిగిలే పుణ్యఫలమో, పాపఫలమో మరుజన్మలో అనుభవించాలంటారు. అలాంటప్పుడు భగవంతుడి ప్రాధాన్యత కనిపించదు. అది కేవలం వ్యక్తుల అభిరుచులమీద ఆధారపడి మనుగడ సాగించే ఓ భావన మాత్రమే!" అన్నాడు మార్కండేయులు.

ఆ ఇద్దరి ముఖాలూ వికశించాయి.

"ఇక మీరు నమ్మే పరిణామ సిద్ధాంతం లోకి వస్తే అదీ ఇంకా పరిపూర్ణ సిద్ధాంతం కాదనీ, పరిశీలనా, నిరంతర పరిశోధనలో తేలవలసిన అంశాలింకా వున్నాయనీ అంటున్నారు. అందుకు సజీవంగా దొరికిన రాక్షసిబల్లి గుడ్డే నిదర్శనం! ఎన్నోవేల సంవత్సరాలనాటి రాక్షసి బల్లి గుడ్డు ఇంకా ఎలాంటి పరిణామానికి నోచుకోకుండా అలాగే వుందంటే అందుకు మీరిచ్చే సమాధానం ఏమిటి? " అంటూ వాళ్ళవేపు సూటిగా చూశాడు మార్కండేయులు.

వాళ్ళు మౌనంగా వింటున్నారు.

"పరిణామం సజీవులకూ నిర్జీవులక్కూడా సహజమే అయినా పరిణామాన్ని త్వరితం చేసే ఇతర అంశాలు కూడా జతపడవలసి వుంటుంది. అలా జతపడని పక్షంలో పరిణామం అనంతంగా ఆలస్యం కావచ్చు. దానికి అంతం ఎక్కడ? అన్నది పరిశీలన, పరిశోధనల్లో తేలవలసిన అంశం. ఒకనాడు 'నిజం' అనుకున్నది వేరొకనాడు అబద్ధం అని తేలవచ్చు. 'అబద్ధం' అని అందరూ భావించేది మరోనాటికి నిజం కావచ్చు. అందువల్ల దేవుడి విషయంలో తర్జన భర్జనలు పడుతూ వేలదశాబ్దాలుగా జరుగుతూన్న చర్చల పర్యవసానంగా విలువైన కాలం వృధా అవుతోంది. దేవుడు హిట్లర్నూ కాదనలేదు. స్టాలిన్, లెనిన్‌లనూ కాదనలేదు. నిరంతరమైన కృషినీ, ధ్యానాన్నీ, పట్టుదలనూ విశ్వసించి నిజజీవితంలో ఆచరించండి. అందులో మీకు మీమీ విశ్వాసాలను బట్టి భగవంతుడే కనిపించవచ్చు. నాస్తికత్వమే గోచరించవచ్చు. ఆ రెంటిల్లో ఏదైనా సత్ఫలితాలు మాత్రం మిమ్మల్ని ఆహ్వానిస్తాయి" చెప్పాడు మార్కండేయులు.

భువనేశ్వరిదేవి హడావుడిగా అక్కడికి వచ్చింది. మార్కండేయుల్ని పక్కకు పిలిచి "అబ్బాయ్, మార్కండేయా! కిరణ్మయి కనిపించటంలేదు. అది భోజనం కూడా చేసినట్టు లేదు. ఇంట్లో ఇంత శుభకార్యం పెట్టుకుని అది పొద్దుట్నించి ఎక్కడికి వెళ్ళిందో, ఏమో..." అంది ఆందోళనను వ్యక్తం చేస్తూ.

మార్కండేయులు నొసలు ముడిపడ్డాయి.



ఆలోచించాడు.

కిరణ్మయి వెడితే డ్యాన్సు స్కూలుకే వెళ్ళాలి.

కరివేపాకును పిల్చి స్కూలుకు వెళ్లి కిరణ్మయిని వెంట పెట్టుకుని రమ్మని చెప్పి, అతను బయటికి వెళ్ళిపోగానే భువనేశ్వరిదేవితో "అమ్మా... నువ్వు బెంగపెట్టుకోకు. మరో అరగంటలోనే కిరణ్మయిని మన కరివేపాకు ఇంటికి తెస్తాడు" అని ధైర్యం చెప్పాడు మార్కండేయులు.

భువనేశ్వరిదేవి గాఢంగా నిట్టూర్చి ఇంట్లోకి వెళ్ళిపోయారు.

మార్కండేయులు మౌనంగా కుర్చీలో కూర్చుని అప్పుడు తన ఆలోచనలను కిరణ్మయికేసి మళ్లించేడు.

కిరణ్మయి కొద్దిరోజులుగా చాలా ముభావంగా వుంటోంది. తన పని తను చాలా యాంత్రికంగా చేసుకుపోతూ ఏదో అంతర్మథనంతో బాధపడుతోంది.

మార్కండేయులు ఆ విషయానికి అప్పుడు అంతగా ప్రాధాన్యత ఇవ్వలేదు కానీ అక్క పెళ్ళినాడు కూడా ఆమె ముఖం చాటువెయ్యటంతో అతడికి ప్రతి విషయం ఇప్పుడు జ్ఞాపకం వస్తోంది.

ఆరోజు సాంస్కృతిక ప్రదర్శనలో కిరణ్మయి గానం విన్నాడు మార్కండేయులు. కంఠంలో శ్రావ్యత కొంతమందికి వరమే అయినా ఆర్ద్రత మాత్రం ఎంతో అనుభవ సారాన్ని మథించి గుండెలో గుప్తం చేసుకుంటేనే తప్ప ధ్వనించేది కాదు. ఆ పాత్రలో లీనమై ఆ భావావేశాన్ని అత్యంత సహజంగా పలికించటం వెనుక కొండంత ఆవేదనలో కాలి పుటంపడి నిగ్గుతేలినప్పుడే అది సాధ్యం!

కొద్దిపాటి జీవితానుభవం ఆమెను అంతగా ఎలా ప్రభావితం చేసింది? అన్న ఆలోచన కూడా అప్పుడే కలిగింది మార్కండేయులికి.

చేత్తో నొసలు రాసుకుంటూ కళ్ళు మూసుకుని కూర్చున్నాడు.

శత్రుదేశం దండయాత్రకు వస్తోందని రాజు చెవిన వేసేందుకు వచ్చిన గూఢచారి కిమల్లే కరివేపాకు హడావుడిగా వచ్చాడు.

"కిరణ్మయి కనిపించిందా? " అడిగేడు మార్కండేయులు.

కరివేపాకు అతడి చెయ్యిపట్టుకుని నడిపిస్తూ దూరంగా తీసుకుని వెళ్ళాడు.

"కిరణ్మయి పరాత్పరం ఇంట్లో వుందిట" రహస్యంగా చెప్పాడు కరివేపాకు.

విద్యుద్ఘాతం తగిలినట్టే ఉలిక్కిపడి "నిజమా? " అన్నాడు మార్కండేయులు ఆ వార్తను నమ్మలేనట్టు.

"నిజమే! నేను సంగీతం స్కూలుకు వెళ్ళి విచారించాను. కిరణ్మయి అక్కడికి పొద్దున వచ్చిందనీ, పరాత్పరం కోసం అడిగి అతను ఇంటిదగ్గరే వున్నాడని ఎవరో చెప్తితే రిక్షా మాట్లాడుకుని వెళ్ళిందనీ తెలిసింది"

"రిక్షా మాట్లాడుకుని వెళ్ళినంత మాత్రాన కిరణ్మయి పరాత్పరం ఇంటికే వెళ్లిందని ఎలా చెప్పగలవు? "

"పరాత్పరం ఇంట్లో కిరణ్మయిని చూసిన వాళ్లు తటస్థపడి చెప్పారు. పైగా అమ్మవారి మహత్యంవల్ల కిరణ్మయి అపస్మారక స్థితిలోకి వెళ్ళిందని కూడా చెప్పారు. అందుకే ఏం చేద్దామో తోచక నీ దగ్గరికి వచ్చాను"

మార్కండేయులు నిర్విణ్ణుడైపోయాడు. "అమ్మవారి మహత్యమా? అపస్మారకంలోకి వెళ్ళిందా? " అని ఎవ్వర్నీ ఉద్దేశించకనే తనలోతను గొణుక్కున్నాడు.

"కరివేపాకూ... నువ్వు త్వరగా వెళ్ళి ఓ గంటలో ఏ బస్సుకు రిజర్వేషన్ దొరికితే ఆ బస్సుకు రెండు టిక్కెట్లు హైద్రాబాద్‌కు తీసుకుని నిముషాలమీద వచ్చెయ్. బస్టాండుకు మన కార్లో వెళ్లు. నువ్వు రాగానే ఇద్దరం కలిసి పరాత్పరం ఇంటికి వెళ్దాం" చెప్పాడు మార్కండేయులు, జేబులోంచి డబ్బుతీసి అతనికి ఇస్తూ.

మార్కండేయులు ఇచ్చిన డబ్బు జేబులో




పెట్టుకుని "ఇంతకూ హైద్రాబాద్ ఎవరు వెడుతున్నట్లు?" అడిగేడు కరివేపాకు.

"నూతన వధూవరులు, అదే గోపీకృష్ణ, మిథిల!"

"అదేమిటి? ఈరోజే పెళ్ళిచేసుకుని..."

కరివేపాకు అడగబోతూంది ఏంటో ముందే ఊహించి "ప్లీజ్, చెప్పింది చెయ్యి. ఈ ఫార్మాలిటీలన్నీ సవ్యంగా అన్నీ జరిగినప్పుడే! అపసవ్య మార్గంలో పరిస్థితులు మనమీద దాడి చేస్తోన్నప్పుడు ఆ ఉధృతాన్ని తట్టుకునేందుకు మనం కూడా కొన్ని విషయాల్లో కఠినంగా అపసవ్య మార్గంలోనే వ్యవహరించాల్సి వుంటుంది. కిరణ్మయి విషయంలో నా మనసు కీడును శంకిస్తోంది. ఇలాంటి వాతావరణంలో నూతన వధూవరులు ఇక్కడ వుండటం నాకు ఇష్టం లేదు" చెప్పాడు మార్కండేయులు.

కరివేపాకు మరేం మాట్లాళ్ళేదు. బాధగా ఒకసారి మార్కండేయులువేపు చూసి తల దించుకుని వెళ్ళిపోయాడు.

మార్కండేయులు లోపలికి వెళ్లి తన గదిలో కూర్చుని కాత్యాయినితో నూతన వధూవరులను తన దగ్గరికి రమ్మని కబురు పెట్టాడు.

పది నిమిషాల్లో గోపీకృష్ణ, మిథిల వచ్చారు.

"మీరు వెంటనే మీక్కావాల్సిన బట్టలు సర్దుకుని ప్రయాణానికి సిద్ధంగా వుండండి. కొంచెం సేపట్లో బస్సు టిక్కెట్లు వస్తాయి. ఆనందంగా నేను మిమ్మల్ని హనీమూన్‌కు పంపిస్తున్నాననే అనుకుంటారో, లేక పెళ్ళయినరోజే నిర్దాక్షిణ్యంగా బయటికి గెంటివేసేననే భావిస్తారో అది మీ ఇష్టం. మీకు కావాల్సినంత డబ్బు తీసుకునిపోండి. మిమ్మల్నిలా ఇబ్బంది పెట్టాలన్నది నా కోర్కె కాదు. ఎప్పుడు ఎలా చేస్తే బాగుంటుందో అలా చేద్దామన్న నిర్ణయం మాత్రమే" అన్నాడు మార్కండేయులు శూన్యంలోకి చూస్తూ.

మిథిల పెద్దగా ఏడ్చింది.

భువనేశ్వరిదేవి కిరణ్మయి విషయం అడిగేందుకు అక్కడికి వచ్చిందల్లా మిథిల ఏడవటం చూసి విషయం తెలుసుకుని కళ్ళు ఇంతలేసి చేసుకుంటూ "అదేంటిరా అబ్బాయ్! అంత కాఠిన్యం పనికిరాదు. చివరికి భగవంతుడు కూడా క్షమించడు" అంది ఉక్రోషంగా.

"అమ్మా... దయచేసి ఈ విషయంలో ఎవ్వరూ కల్పించుకోవద్దు..." అన్నాడు మార్కండేయులు చాలా కఠినంగా.

భువనేశ్వరిదేవి గుడ్ల నీరు గుడ్లకు కుక్కుకుంటూ వెళ్ళి నిశ్శబ్దంగా కాత్యాయిని పక్కనే నించుంది.

"అన్నయ్య ఏదో మనసులో పెట్టుకుని మామీద కక్ష సాధిస్తున్నాడు. అవున్లే... ఎంత సొంత అన్నయ్యే అయినా దత్తువెళ్ళి ఇంటిపేరు కూడా మారిపోయాక అనుబంధాలు మాత్రం మారిపోవూ?" అంది మిథిల చిన్నగా వెక్కుతూ.

మార్కండేయులు మిథిలవేపు అదోలా చూసి, తలతిప్పి గోపీకృష్ణవేపు చూస్తూ, "బావా! నీకు ఒక నెలరోజుల్లోనే ఉద్యోగం వస్తోంది. గుంటూరులోనే వేస్తారు. మీ కోసం బ్రాడీపేటలో అన్ని వసతులూ వున్న ఇల్లు కూడా అద్దెకు మాట్లాడి వుంచాను. ఈలోగా మీరు కోరిన ఊళ్లు తిరిగిరండి. రాగానే మీ ఇంటికి మీరు వెళ్లి స్థిరపడండి" అన్నాడు మార్కండేయులు.

"బావకు నెల్లో ఉద్యోగం వస్తోందని జ్యోతిషం చెప్తున్నావా అన్నయ్యా?" అడిగింది మిథిల.

"జ్యోతిష్యం కాదు. అది నా స్వయం కృషి!"

"ముందుగానే అద్దె ఇల్లు కూడా మాట్లాడేవంటే మేం ఇంట్లో తిష్టవేస్తామన్న భయంతోనేగా?"

"కాదు, మీ జీవితాలను మీరే తీర్చిదిద్దు

కునే అవకాశం కల్పించాలి కనుక"

మిథిల కళ్ళతోనే గోపీకృష్ణకు ఏదో సైగ చేసింది. ఆమె భావం గ్రహించి "బావా! మా ఇల్లు అమ్మిన డబ్బు ఆరోజు నీకే ఇచ్చాను కదా..." అని భయం భయంగా చూసేడు గోపీకృష్ణ.

"అవును, ఆ డబ్బు నీ పేరుతోనే బ్యాంకులో ఆనాడే ఫిక్స్‌డ్ డిపాజిట్లు చేశాను. ఆ డబ్బు అలా ఇబ్బడిముబ్బడిగా పెరిగిపోయింది. అంతేకాదు, ఊళ్లో మా ఇల్లు అమ్మితే వచ్చిన డబ్బు కూడా మిథిల పేరిట కొంత, కిరణ్మయికి కొంత బ్యాంకులో వేశాను. కిరణ్మయి విషయంలో ఇంకా నేను చెయ్యాల్సింది చాలా వుంది కనుక మీ ఇద్దరికి సంబంధించిన బ్యాంకు పాసుపుస్తకాలు, మిగతా వివరాలూ మీ ఒదినె ఇప్పుడే మీకు అందచేస్తుంది. మిథిలా! నీకు ఉద్యోగం వచ్చేందుకు మరో సంవత్సరం పడుతుంది. సరే, ఉద్యోగంలో చేర్తావో, ఈ డబ్బుతో ప్రైవేట్ ప్రాక్టీసే పెడతావో అది మీ భార్యాభర్తలిద్దరూ సంప్రదించుకుని చెయ్యండి. మీ ప్రయాణానికి ఆలస్యమౌతుందేమో, ఇక వెళ్ళిరండి" అని పడక్కుర్చీలో వెనక్కు వాలిపోయి రెండు కళ్లూ మూసుకున్నాడు మార్కండేయులు.

ఐదు నిముషాల తర్వాత కరివేపాకు వచ్చి రిజర్వేషన్ టిక్కెట్లను మార్కండేయులుకిచ్చేడు.

"కాత్యాయినీ! వాళ్లు ఊరికి వేళ్లేందుకు ఇవిగో టిక్కెట్లు. కొంత డబ్బు, ఆ బ్యాంకు పాసుపుస్తకాలు వాళ్ళకు ఇచ్చి సాగనంపు. నేను వేరే పనిమీద వెళ్తున్నాను. వాళ్లను బస్టాండుకు ఆటోలో వెళ్లమను" అని చెప్పి బస్సు టిక్కెట్లను కాత్యాయినికి ఇచ్చి కరివేపాకుతోసహా బయటికి వెళ్ళిపోయాడు మార్కండేయులు.

"నా మనసు కల్లోలంగా వుంది. నువ్వే కారు నడిపించు" అని కరివేపాకుకు చెప్పి డోరు తెరుచుకుని సీట్లో కూర్చున్నాడు మార్కండేయులు. పరాత్పరం ఇంటికి కారును వేగంగా పరుగు తీయిస్తున్నాడు కరివేపాకు.



పరాత్పరం కిరణ్మయి తల దగ్గర కూర్చుని తదేకంగా ఆమె ముఖంలోకి చూస్తున్నాడు. అలా ఎంతసేపు చూసినా తనివితీరని ఆ అందాన్ని పసిపిల్లవాడు చందమామను చూసినంత ఆశ్చర్యంగా, ఆబగా చూస్తూ తను తాకితే ఆమె శరీరం మురికిపడుతుందన్నంత జాగ్రత్తగా ఆమె ముంగురులను సవరించాడు. ఆమె లేత పెదాలను చూపుడువేలుతో స్పృశించి అద్భుతమైన మలుపు తిరుగుతున్న తన జీవితాన్ని తలచుకొని లోలోపలే మురిసిపోతున్నాడు.

కిరణ్మయి కలువరిస్తోంది.

"అన్నయ్యా... నా జీవితాన్ని ధ్వంసం చేసేవుకదూ? ఏం సాధిస్తావో చూస్తాను. ఒరేయ్, మార్కండేయులూ! ఇంతకు ఇంత అనుభవిస్తావ్..."

ఆ కలువరింతలు విన్న పరాత్పరం విజయగర్వంతో పొంగిపోతూ కిరణ్మయిని చేత్తో తట్టి పిల్చేడు.

ఆమె ఇటునించి అటువేపు పొర్లింది. "గోపీ... బావా... అన్యాయం... అన్యాయం" అంటోంది.

పరాత్పరం అమ్మవారి ముందున్న తీర్థం

తెచ్చి కిరణ్మయి ముఖంమీద చిలకరించేడు.

రెప్పలు టపటపలాడిస్తూ రెండు క్షణాల తర్వాత కిరణ్మయి కళ్లు తెరిచింది.

"లేచి కూర్చో!" అన్నాడు పరాత్పరం

"ప్రసాదం ఇస్తావా? " ఆశగా అడిగింది కిరణ్మయి.

"తప్పకుండా ఇస్తాను"

కిరణ్మయి నెమ్మదిగా లేచి కూర్చుంది. చుట్టూ చూసింది. ఇంకా ఆమెకు మగతగానే వుంది. పరాత్పరం కూడా ఆమెకు బూదరంగా కనిపిస్తోన్నాడు.

"ముందు కొంచెం యీ కిచిడీ తిను" కిచిడీ పొట్లాం విప్పి ఆమె ముందు పెట్టేడతను.

"ఇదీ ప్రసాదమేనా? " అడిగింది కిరణ్మయి.

"అన్నం పరబ్రహ్మస్వరూపం అన్నారు. ఆ మాత్రం తెలీదూ? తిను... తిను" అన్నాడతను.

పరాత్పరం అలా అన్నందుకు ఆ స్థితిలో కూడా ఆమె చివాల్న తలెత్తి అతనివేపు కోపంగా చూసింది. అపశ్రుతిలా ధ్వనించిన ఆ మాటకు అభిజాత్యం రెక్కలు టపటపలాడించిదేమో "ఏమన్నావ్? " అని గర్జించింది కిరణ్మయి.

అతను జరిగిన పొరపాటుకు ఏదో కోల్పోతానన్నంత యిబ్బందిగా చూశాడు.

చందమామ అందకుండా ఆకాశంలో వున్నంతవరకే దానిపట్ల ఆరాధన. ఆ ఆరాధన నిజమనీ, శాశ్వతమనీ నమ్మి ఆ చందమామే చేతికి అందితే అది మురికిపడక తప్పదు. అందదు అనే భావం కల్పించే న్యూనతనించి అది అందగానే సహజమైన అహంకారం నిద్రలేస్తుంది. దానిపట్ల అంకితభావం, గౌరవం, ఆరాధనా అన్నీ క్రమంగా యిగిరిపోయి అదంటేనే తేలిక భావం ఏర్పడుతుంది.

అలా న్యూనతనించి అహంకారం నిద్రలేచినా అతను అలవరచుకున్న లౌక్యం కవచంలా అతనికి ప్రయోజన పడుతూనే వుంది.

"కిరణ్మయీ! నీమీద గౌరవంతోనే స్వతంత్రించి అలా అన్నాను బాధపడకు. అయినా గౌరవాలు ఆకలి తీర్చవు. ఎప్పుడనగా ఎంగిలిపడ్డావో. ఏమో! ముందుగా భోజనం చేయి. ఆ తర్వాత అమ్మవారి ప్రసాదం ఎటూ ఉండనే వుందిగా..."

అప్పుడు చూసిందామె పరాత్పరం వేపు సౌమ్యంగా.

హడావిడిగా కిచిడీ నమిలిమింగి ఓ గ్లాసెడు మంచినీళ్ళు తాగి "అరిటిపండు యివ్వవూ? " అని అడిగింది దీనంగా.

తప్పించుకుంటూ నాలుగు అడుగులు వేసిన లేడిపిల్ల మళ్ళీ దిశమార్చి పన్నిన వలవేపే వస్తున్నప్పుడు మాటువేసిన వేటగాడి కళ్లలో కనిపించే ఆనందమే యిప్పుడు పరాత్పరం కళ్ళలోనూ కనిపిస్తోంది!

వెళ్లేడు.

అరటిపండు తెచ్చి ఆమెకు యిచ్చేడు.

ఆ పండును ఆమె వొలుచుకుని తింటోంటే గర్వంగా చూశాడు.

మళ్ళీ ఏవో దివ్యలోకాల్లోకి తేలిపోతోంది కిరణ్మయి!

సరిగ్గా అప్పుడే తడిక తలుపు తోసుకుని మార్కండేయులు, కరివేపాకూ లోపలికి దూసుకుని వచ్చేరు.

పరాత్పరం వాళ్ళవేపు దిగ్భ్రాంతిగా చూశాడు.

ఆ సమయంలో వాళ్ళలా తన ఇంటికి వస్తారని ఊహించని అతను క్షణకాలం సంభ్రమంలో మునిగి ఆపైన తేరుకుని "సంస్కారం కులాన్ని బట్టి రాదంటారు. అయినా మీరు నా ఇంట్లోకి ఎవర్నడిగి వచ్చారు? " అన్నాడు కోపంతో ఊగిపోతూ.



మార్కండేయులు అదేం పట్టించుకోలేదు. అప్పుడే చాపమీదికి వొరిగిపోతోన్న కిరణ్మయిని చూసి, "అమ్మా... కిరణ్మయీ...!" అంటూ పెద్దగా అరిచేడు.

కొండల్లోంచో, లోయల్లోంచో ఏదో తెలిసిన గొంతు తనను పిలుస్తోన్నట్టు మార్కండేయులి పిలుపు ఆమె కర్ణపుటాలకు సోకింది. మహిమాన్వితమైన అరటిపండు అప్పుడప్పుడే ఆమెను దివ్యలోకాల్లోకి తీసుకుని వెడుతూ ఆవేదననూ, ఆవేశాన్నీ గుండె పొరల్లో మేటవేస్తూ తాత్కాలికంగానైనా ఉపశాంతి యిస్తోన్నవేళ ఆ పిలుపు ఆమెనూ ఆమె ఆవేశాన్నీ, ఆవేదన్నూ తట్టిలేపింది!

బరువుగా వున్న కనురెప్పల్ని ప్రయత్నం మీద తెరుస్తూ మార్కండేయులివేపు తేరిపారచూసి, "ఇంకా నాశనం చేసేందుకు నా జీవితంలో ఏం మిగిలిందని యిక్కడికొచ్చావ్? దాపురించావ్? వెళ్ళు... యీ ఆనందాన్ని కూడా నాకు దక్కకుండా చెయ్యకు" అంది కిరణ్మయి కఠినంగా.

"అమ్మా, నేను నీకేం లోపం చేశాను? ఎందుకిలా తయారయ్యావ్? అక్కడ మీ అక్కయ్య పెళ్ళివేడుక జరుగుతోంటే నువ్విక్కడిలా ఈ క్షుద్రశక్తిని నమ్ముకుని ఒంటరిగా బాధపడే అగత్యం ఏమొచ్చింది"

కిరణ్మయి ఫెళ్ళున నవ్వింది.

"ఇంటికి వెడదాం పద" అన్నాడు మార్కండేయులు.

"ఎవరింటికి? "

"మనింటికే!"

"అది ఇల్లుకాదు. నాకోసం అందంగా కట్టిన సమాధి" పెద్దగా ఏడ్చింది కిరణ్మయి.

మార్కండేయులు ఆలోచనలోపడి ఒక్క క్షణం మౌనందాల్చేడు.





పరాత్పరం సంచీలోంచి అరటిపండొకటి బయటికి తీసి కిరణ్మయికి కనిపించేలా చేత్తో ఎగరేసి పట్టుకుంటూ వాళ్ళ చర్చను ఆసక్తిగా వింటూ నించున్నాడు. ఆమె అరటిపండువేపు చూళ్ళేదు. ధ్యాసంతా ఎక్కడో వుంది.

కరివేపాకు మార్కండేయుల్నే గమనిస్తున్నాడు.

మార్కండేయులు చెల్లాయి వేపే దీక్షగా చూశాడు. ఆమెలో మునుపటి కాంతిలేదు. ఆ చలాకితనం కొడిగట్టినట్టుంది. నీరసంగా, నిస్త్రాణగా, జీవితంలో సర్వస్వం కోల్పోయినట్లూ.

పొంగుకొస్తోన్న దుఃఖాన్ని తమాయించుకున్నాడు. ఆ మానసిక స్థితినించి అంతలోనే బయటపడుతూ దీర్ఘంగా నిట్టూర్చి,

"అమ్మా, కిరణ్మయీ! ఇంతసేపు నేనిలా ఒకవ్యక్తి సొంత విషయాలమీద ఆసక్తి చూపించి మాట్లాట్టం నా స్వభావానికే విరుద్ధం. నీ విషయంలో యింత సహనం నేనెలా చూపగలుగుతున్నానో నాకే విచిత్రంగా వుంది. ఆ సహనాన్ని పరీక్షించకు. ఇంటికి వెడదాం పద" అన్నాడు తీక్షణంగా చూస్తూ మార్కండేయులు.

"నేనాఇంటికి రాను!" అని చాపమీద పడుకుండిపోయింది కిరణ్మయి.

"ఎలా రావో చూస్తాను" అని మార్కండేయులు ముందుకు వెళ్ళి కిరణ్మయి చెయ్యి పట్టుకుని పైకి లేపబోయేడు.

అప్పుడు జోక్యం కల్పించుకున్నాడు పరాత్పరం "చూడండి మార్కండేయులు గారూ... పెద్దోళ్ళని యింతసేపు చూస్తూ వూరుకున్నాను. అయినా అమ్మాయిరానంటే ఏంటీ దౌర్జన్యం? " అన్నాడు లాల్చీ చేతుల్ని పైకి తోస్తూ.

మార్కండేయులు చివాల్న అతనివేపు తిరిగేడు. బలంగా చేతిని గాల్లోకి లేపేడు. పరాత్పరం చెంప ఫట్‌మని పేలిపోయింది.

పరాత్పరం చేత్తో చెంపను సరిచే సుకుంటూ పెద్దగా అరుస్తున్నాడు.

"మార్కండేయులూ! మీ అగ్రవర్ణాల దౌర్జ న్యాలకు జవాబుచెప్పే రోజులు త్వరలోనే వస్తున్నాయి. ఇంతకాలం మమ్మల్ని పిల్లుల్ని చేసి వర్ణవ్యవస్థ అనే గదిలో బంధించారు. హింసించారు. ఇప్పుడు ఆపిల్లులే మీకు ఎదురుతిరగబోతున్నాయి. ప్రళయ కాలప్ర భంజనంలా విరుచుకుపడబోతున్నాయి. అవిగో వినబడలేదా, యముని మహి షపు..." అని ఆపి, తలెత్తి చూశాడు పరా త్పరం.

అప్పటికే మార్కండేయులు కిరణ్మయిని భుజంమీద వేసుకుని వెళ్ళి, కారు వెనుక సీట్లో పడుకోబెట్టేడు.

"లోహఘంటలు!" అన్నాడు చిన్నగా పూరిస్తూ పరాత్పరం.

శబ్దం చేస్తూ కారు వేగంగా వెళ్ళిపో యింది.

పరాత్పరం వెకిలిగా నవ్వుతూ తన చేతిలో వున్న అరటిపండువేపు చూస్తూ, "మార్కండేయులూ... కిరణ్మయిని ఇంట్లో దాచివుంచటం ఎ.సి. రూములో జీవాన్ని దాచటం వంటిదే. తలుపులు పగులగొట్టుకొ నైనా అది మళ్ళీ మందలోకే వస్తుంది" అన్నాడు పళ్ళు పటపటా కొరుకుతూ.

★ ★ ★

"మార్కండేయులుగారూ! మీ చెల్లాయికి డ్రగ్ అలవాటు ఎన్నాళ్ళనించి వుందో చెప్ప గలరా? "

కిరణ్మయిని పరీక్షచేసిన అనంతరం మార్కండేయుల్ని అడిగేడు డాక్టరు.

పక్కనే ఏదో విస్ఫోటనం జరిగినట్టే ఉలి క్కిపడి "నో నో... యింపాజిబుల్. మా చెల్లాయికి డ్రగ్ అలవాటేంటి? " అన్నాడు మార్కండేయులు.

"సారీ... మీ అమ్మాయి యిప్పుడు డ్రగ్ యిన్ఫ్లుయన్స్‌లోనే వుంది" అని ఎవ్వరి వొప్పుకోలు కోసమూ ఎదురుచూడకుండా డాక్టరు వర్మ ఆమెకేదో యింజక్షన్ చేసి సెలైన్ కూడా అమర్చేడు.

ఎవరో కొత్త పేషంట్లు వస్తే వాళ్ళను చూసేందుకు డాక్టర్ వర్మ తన గదిలోకి వెడుతూ, "మార్కండేయులుగారూ! సెలైన్ సీసా అయిపోగానే మీ అమ్మాయిని ఇంటికి తీసుకుని వెళ్ళిపోవచ్చు. ఆ అలవాటు మాన్పించి వేళపట్టున మంచి ఆహారం యివ్వండి. అంతకన్నా చెయ్యాల్సింది మరేం లేదు" అని చెప్పేడు.

డాక్టరు వర్మ వెళ్ళిపోయాక కరివేపాకు వేపు దీనంగా చూశాడు మార్కండేయులు.

"నా ఉద్దేశం ప్రకారం యిదంతా ఆ క్షుద్ర పరాత్పరం పనే!" అన్నాడు కరివేపాకు.

మార్కండేయులు తీవ్రంగా ఆలోచిస్తు న్నాడు. ఆరోజు 'మవ్యపోస' విషయంలో తనూ పరాత్పరం తీవ్రంగా చర్చించుకోవటం అతను కోపంగా వెళ్ళిపోవటం, సాంస్కృతిక ప్రదర్శనలో కిరణ్మయి గానంలో వినిపించిన ఆర్ద్రత, ఆ ప్రదర్శనలో పరాత్పరమే డోలు వాయించటం అంతా ఒకదానివెంట మరొ కటి అతడి మనసులో మెదుల్తున్నాయి.

అయినా తన ఆలోచనలకూ నిజానికీ లంగరు అందటం లేదనిపించింది. పైకార ణాలన్నీ కిరణ్మయి డ్రగ్ యిన్ఫ్లుయన్స్‌లో వుందని డాక్టరు చెప్పింతర్వాత మాత్రమే భూతద్దంలో కనిపిస్తున్నాయి కానీ అదే జర క్కపోతే ఆ సంఘటనలకు ఎంతమాత్రం ప్రాధాన్యత వుండేదికాదు.

కొన్ని విషయాల్లో ఆలోచనలు అనర్థాన్నే కల్పిస్తాయి. కాలం పరిష్కరిస్తేనే అవి సహ జంగా పరిష్కరించబడతాయి.

"కరివేపాకూ! వెళ్ళి, కొంచెం కాఫీ తాగొద్దాం. ఈలోగా సెలైన్ బాటిల్ అయి పోతే అమ్మాయిని ఇంటికి తీసుకుని



వెళ్ళొచ్చు" అన్నాడు మార్కండేయులు కరివే పాకుతో.

"ఇద్దరమూ వెళ్తే ఎలా? "

"ఏంపర్లేదు, నర్సు వుందిగా" అంటూ బయటికి దారితీసేడు మార్కండేయులు, కరివేపాకుతోసహా.

సెలైన్ ఎక్కించేందుకు తన చేతి నరానికి సూది గుచ్చినప్పుడే స్పృహలోకి వచ్చింది కిరణ్మయి. అన్నయ్య, కరివేపాకూ కలిసి తననేదో ఆస్పత్రికి తెచ్చినట్లూ, సెలైను పూర్తి కాగానే ఇంటికి తీసుకుని వెడుతోన్నట్టూ గ్రహించింది. పరాత్పరం ఇంటినించి వాళ్ళి ద్దరూ కార్లో తనను తెచ్చింది లీలగా గుర్తొ చ్చింది. ఇద్దరూ అలా కాఫీ తాగేందుకు బయటికి వెళ్ళేరో లేదో కళ్ళు తెరిచింది కిర ణ్మయి.

నర్సువేపు అభ్యర్థనగా చూస్తూ, "సిస్టర్! మా కారు బయటే వుంది కదూ? అందులో నా బ్యాగ్ ముందు సీట్లోనే వుంటుంది. దయచేసి తెచ్చిపెట్టరూ? " అడిగింది.

నర్సు ఒక్కక్షణం ఆలోచించి "అలాగే! కానీ చెయ్యి కదల్చకుండా జాగ్రత్తగా పడుకో. సూది కదిలిందంటే స్వెల్లింగ్ వొస్తుంది" అని జాగ్రత్తలు చెప్పి బయటికి వెళ్ళిపోయింది.

రెండో చేత్తో కుడిచేతికి అతికించిన ప్లాస్టర్ను లాగివేసి, నరంలో గుచ్చుకున్న సూదిని తొలిగించి లేచి వెనుక దారిగుండా బయటికి వెళ్ళిపోయింది కిరణ్మయి.

ఓ పది నిముషాల్లోనే జరిగింది అందరికీ తెలిసిపోయింది.

"మార్కండేయా! కిరణ్మయి మళ్ళీ పరా త్పరం దగ్గరికే వెళ్ళి వుంటుంది. వెంటనే పోలీసులకు ఫోనుచేసి నీ పలుకుబడి వుప యోగించైనా వాడికి బుద్ధిచెప్పించు" అన్నాడు కరివేపాకు ఆవేశంగా.

డి.ఎస్.పి. మార్కండేయులుకు పరిచయ స్తుడే. అతనికి ఫోన్ చేసి జరిగిందంతా చెప్పేడు. తీరా అతను చెప్పింది విన్నాక విషణ్ణవదనంతో కరివేపాకు దగ్గరికి వెళ్ళి, "పరిస్థితి చెయ్యిదాటిపోయింది. ఇక ఆమె జీవితం ఆమె యిష్టం. మనమేం చెయ్యలేని నిస్సహాయులం" చెప్పేడు మార్కండే యులు.

"ఇంత దారుణం జరుగుతుంటే"

"ఏం చేస్తాం. వాడు హరిజన్ హెరా స్మెంటు కింద పోలీసు రిపోర్టు యిచ్చాడు. డి.ఎస్.పి.కి మన విషయం తెలుసు కనుక పరాత్పరానికి నచ్చచెప్పి పంపించేట్ట. అమ్మాయి మేజరు కనుక, ఇష్టపూర్వకంగానే వెళ్ళింది కనుకా చెయ్యగల్గిందేంలేదు. ఇక అతని జోలికి వెడితే డి.ఎస్.పి. కూడా మనల్ని కాపాడలేనన్నాడు" అన్నాడు చెమ్మ గిల్లిన కళ్ళతో మార్కండేయులు.

★ ★ ★

ఎన్నడూ లేనంతగా ముక్కుపొడుం పీలుస్తూ పగ, ద్వేషంతో రగిలి రగిలి చితి మంటల్లా మండుతోన్న కళ్ళను మరింత విప్పార్చి రౌద్రంగా కనిపిస్తున్నాడు పరా త్పరం.

ధ్యానం పూర్తయింది! బాధితులకు వారి వారి సమస్యల తీవ్రతనుబట్టి తాయిత్తులు, విబూది, కుంకుమ యిచ్చేడు. కానుకలు వసూలు కాగానే ఇక ఎవ్వరూ లేరని నిర్ధా రించుకొని.

"ఈరోజు అమ్మవారి మనసేం బాగా లేదు. కాలయాపన చెయ్యకుండా అందరూ వెళ్ళిపోండి" చెప్పేడు పరాత్పరం.

అమ్మవారికి భక్తిపూర్వకంగా నమస్క రించి బాధితులు వెళ్ళిపోయేరు.

ఓ నల్లంచు ఎర్రటవల్ను చుట్టుకుని విశ్రాంతిగా చాపమీద పడుకుని ఆలోచించ సాగేడు పరాత్పరం.




మార్కండేయులే జ్ఞాపకం వస్తూ పళ్ళు కొరికేడు. అవమాన భారంతో అతడి గుండె లావాలా మండుతున్నట్టుంది.

మార్కండేయులు కొట్టిన చెంపను చేత్తో తుడుచుకుంటూ మెదడులోని దెయ్యప్పిల్ల ల్లాంటి ఆలోచనలకు ఒక రూపకల్పన కూడా చేశాడు అప్పుడే!

"అరిటిపండు యివ్వవూ? " అడిగింది కిర ణ్మయి.

అలికిడి గ్రహించిన పాములా ఠక్కున తలెత్తి చూశాడు పరాత్పరం.

కిరణ్మయి జాలిగా అతనివేపే చూస్తోంది.

"రా, కిరణ్మయీ... నీకోసమే ఎదురుచూస్తున్నాను. ఇప్పుడే ధ్యానంలో అమ్మ చెప్పింది, నువ్వు వస్తున్నావని. అందుకే తలుపుల్ని నీకోసమే తెరిచి వుంచాను. అమ్మవారి ప్రసాదం సేవిస్తూ తరించే నిన్ను బలవంతంగా వాళ్ళు పట్టుకునిపోయేరు. అదంతా క్షుద్రశక్తుల ప్రభావం, ప్రేరణ!"

"అరటిపండు యివ్వవూ? "

"నీ ధ్యానం విఫలమైంది. తపస్సు భగ్నమైంది. దుష్టశక్తులు తాకి నువ్వు మైలపడ్డావు. వెళ్ళు... అక్కడ కుండనిండా నీళ్ళున్నాయి. తలారా స్నానంచేయి. శుద్ధిపడి వచ్చి అమ్మను ధ్యానించు. ప్రసాదం స్వీకరించు" చెప్పేడు పరాత్పరం. అప్పుడు అతని గొంతు ఆమెను శాశిస్తోంది!

ఆమె యాంత్రికంగా కదిలి అక్కడికి వెళ్ళింది. కట్టుబట్టలమీదే తలస్నానం చేసి ఆత్రుతగా వచ్చి "ప్రసాదం" అని అడిగింది దీనంగా.

పరాత్పరం అరటిపండు ఆమెకు చూపిస్తూ "ఊ... కానివ్వు! అమ్మవారికి పొర్లు దణ్ణాలు పెట్టి ఆ తర్వాత ఈ అరటి పండును స్వీకరించు" అన్నాడు స్వరం మరింతగా పెంచుతూ.

కిరణ్మయి 'దబ్బు'న నేలమీదికి వాలిపోయింది. రెండు చేతులూ చాచి అరిచేతుల్ని అంటించుకుని అమ్మవారి పరంచుట్టూ పొర్ల సాగింది.

వెల్లికిలా తిరిగినప్పుడల్లా ఆమె కళ్ళు పరాత్పరం చేతిలో వున్న అరిటిపండునే ఆబగా చూస్తున్నాయి.

ఆమె సౌందర్యాన్ని విచిత్రంగా గమనిస్తోన్నాడు పరాత్పరం.

పిక్కలపైదాకా చెదిరిన లంగా తొడలకు అంటుకుని, కవులు వర్ణించిన ప్రబంధ కావ్యనాయకి కాళ్ళకుమల్లే ఆమె కాళ్ళు బంగారంరంగులో మెరుస్తోన్నాయి.

తడిసిన బట్టల్లోంచి మేని అందాలూ, ఎద పొంగులూ స్పష్టాస్పష్టంగా కనిపిస్తూ, కవ్విస్తూ, ఊరిస్తూ, వివశత్వం కల్పించింది తనికి.

ఏ న్యూనతాభావం వల్లనైతే అంతవరకూ అతడి రాక్షసనైజం కూడా వెరుపుతో ఆమెకు మురికిపులిమేందుకు సాహసించలేకపోయిందో ఆ నైజం ఇప్పుడు కసి, ద్వేషం, పగల సెగలతో వెరపువీడి జూలు దులిపింది.

కాంక్ష న్యూనతాభావాన్ని తుడిచిపెట్టి తెంపరితనాన్ని ప్రేరేపించింది.

ఆమెమీదికి వొంగి అతను డేగలా చూస్తున్నప్పుడే సరిగ్గా ఆమె అసహనంగా నేల మీంచి పైకిలేచి అతడి చేతిలోంచి అరటి పండు లాక్కుని క్షణంలో మింగేసింది, దివ్యలోక ప్రాప్తికోసం!

క్షణాలు గడుస్తున్నాయి.

మగత కమ్ముకొస్తోంది.

చాపమీదికి దొర్లి, వెల్లికితలా పడుకుని, గిర్రున తిరుగుతోన్న భూమండలాన్ని అనుసరించి తిరుగుతూ భారంగా కళ్ళు తెరిచి "ప్లీజ్... మరో అరిటిపండు!" అంది కిరణ్మయి నీరసంగా.



అందుకే ఎదురుచూస్తున్న పరాత్పరం క్షణం కూడా ఆలస్యం చేయకుండా మరో అరటిపండును తన చేతులతో తినిపించాడు. ముంగురులు సవరించేడు. ఆమె తలను తన వడిలో పెట్టుకుని దోసిలితో ముఖాన్ని మురిపెంగా దేవతాపుష్పాన్ని పట్టుకున్నట్టే పట్టుకుని నిశ్శబ్దంగా కిందికి వొరిగి ముద్దులతో ముంచెత్తేడు.

ఆమె మగతలో కలువరిస్తోంది!

"బావా... గోపిబావా... గోపీకృష్ణా...!"

అతను ఆ కలువరింతలు విని మరింత నిర్భయంగా విజృంభించేడు!



ఎప్పటికోగాని కిరణ్మయికి పూర్తిగా తెలివి రాలేదు. కళ్ళు తెరిచి లేచి కూర్చుంది. వొళ్ళంతా సలుపుపెడుతూ నీరసం, నిస్సత్తువతో భూమ్మీద తేలిపోతోన్నట్టుంది. ఒకసారి నిట్టూర్చి తన్నుతానే పరీక్షగా చూసుకుంది.

జరిగిన సంఘటనలన్నీ లీలగా ఆమెకు జ్ఞాపకం వస్తోన్నాయి.

ఆస్పత్రినించి తప్పించుకుని పరాత్పరం ఇంటికి తిరిగి రావటం, పరాత్పరం ఆదేశంతో తలస్నానం చేసి అమ్మవారికి పొర్లు దణ్ణాలు పెట్టటం, ఆ తర్వాత అరిటిపండ్లు తిని మగతలోకి జారిపోవటం...

ఆమె గుండె ఝల్లుమంది!

పరాత్పరం తనను లాలనగా చేరదీసి తన వడిలో తలపెట్టుకుని శరీరంలోని అణువణువూ స్పృశిస్తూ తన ముఖాన్ని దోసిలిపట్టి...

అవును! గోపీకృష్ణ కానేకాదది పరాత్పరమే!

తను మళ్ళీ కోల్పోయిందేమిటో అర్థమై గొల్లున ఏడ్చింది కిరణ్మయి.

జపాను తుమ్మకంపతో పొయ్యిమీద నీళ్ళు కాగబెడుతోన్న పరాత్పరం ఆమె ఏడుపు విని అక్కడికి వచ్చేడు.

"అయిందేదో అయింది, మొదట మీ బావకు నీ శీలాన్ని అర్పించావు. అతను నీకు ద్రోహంచేశాడు. ఇంటినించి బయటికి వొచ్చి నన్ను ఆశ్రయించావ్. ఇంత జరిగింతర్వాత నీకిక కులస్త్రీగా సంసారంలో కుదురుకునే అవకాశాన్ని మీకులం నీకు కల్పించదు. నీ జీవితం అడవిగాచిన వెన్నెల కాకూడదు కనుక జరిగిందంతా మంచికే అనుకుని మనస్ఫూర్తిగా నన్ను పెళ్ళిచేసుకో నన్ను ఆనందపెడుతూ అమ్మవారి సేవలో నిత్య ప్రసాదాలతో తరించు" అన్నాడు పరాత్పరం.

ఆమె వెక్కివెక్కి ఏడుస్తోంది.

శరీరం కంపిస్తోంది.

నీటి బుగ్గల్లా వున్న కళ్ళకు పరాత్పరం మసగ్గా కనిపిస్తోన్నాడు.

అపర కాళిలా లేచి పక్కనే వున్న దీపపు ప్రమిదెను అతనిమీదికి విసిరికొట్టింది.

వొడుపుగా తప్పించుకుని రెండేరెండు గెంతుల్లో ఆమెను సమీపించి ఎముకలు కలుక్కుమనేలా సందిట్లో బంధించిపట్టి "అరటిపండ్లు తినవా? " అని అడిగేడు పరాత్పరం లాలనగా.

ఆమె ఆలోచిస్తోంది.

భౌతిక శరీరంనించి జీవుడు లేచిపోయినప్పుడు నిప్పుల్లో కాలి పంచభూతాల్లో కలిసిపోతుంది.

కానీ ఆత్మ నిప్పుల్లో కాలదు.

నీళ్ళలో తడవదు. మైల దానికి అంటదు

అన్నింటికీ అతీతంగా ఏదో సత్యాన్ని శోధిస్తూ... శుష్కించినా, శిధిలమైనా, మైల పడ్డా అశాశ్వతమైనది భౌతిక శరీరం మాత్రమే కదా!




"కిరణ్మయీ! నిన్నిలా శపించింది విధికా నేకాదు. నీ వాళ్ళు! ముఖ్యంగా మీ అన్న మార్కండేయులు"

అంటూ ఆమె గుండె కొలింతిత్తిని మరింత బలంగా ఆడించి గాలిపోసేడు పరాత్పరం.

ఆమె గుండెలో మంటలు లేచేయి!

ద్వేషం కెరటంలా ఎగసిపడి విజ్ఞతను తనలోకి లాక్కుంది.

బావ తనతో శారీరక సంబంధం కూడా కలుపుకున్నాడని ముందుగా ఒక్కమాట చెప్పినా ఆమె జీవితం ఎలాంటి మలుపు తిరిగేదో కానీ అభిజాత్యం అహంకరించి, మధ్యతరగతి మనస్తత్వం నరాలకు దట్టించిన కాపట్యం ఆ నిజాన్ని ఆమె గుండెలోనే గుప్తం చేసినప్పుడు అన్యులను నిందించటం అవివేకం అన్న జ్ఞానం ఆమె కోల్పోయింది.

అప్పుడే పరాత్పరం అందించిన అరిటి పండు తిని అతడి భుజంమీద తలపెట్టుకుని మరో విడత భోరుమని ఏడ్చి క్రమంగా శాంతిలోకి జారుకుంది.

ఇప్పుడు పరాత్పరం కౌగిలి ఆమెకు చాలా హాయిగా అనిపించింది. "మనం... మనం పెళ్ళిచేసుకుందాం" అంది ఒక్కో అక్షరాన్నే వొత్తిపలుకుతూ.

"ఒక్క అరిటిపండుకే అట్లా అయిపోతే ఎట్లా? వేడినీళ్ళు పెట్టాను. వెళ్ళి స్నానం చెయ్యి. రెండు రోజుల్లో ముహూర్తం పెట్టుకుని పోలేరమ్మ గుడిదగ్గర దండలు మార్చుకుందాం, అంతే! పైన ఆకాశం, కింద భూమి, మనం భూమ్మీదా, మన ఎదురుగా పోలేరమ్మా... ఆదర్శవివాహాలంటే నాకు అమితమైన యిష్టం" అని పరాత్పరం అనగానే కళ్ళు తెరిచి, స్నానానికి వెళ్ళేందుకు సిద్ధమై, అంతలోనే ఆగి,

"కట్టుబట్టల్తో వచ్చేసేను. తలస్నానం చేసినప్పుడు తడిసిన బట్టలు వొంటిమీదే ఆరేయి. అట్టకట్టుకున్నట్టున్నాయి"

"ఓ... అదా నీ సమస్య! ఉండొస్తా" అంటూ అతను గుడిసెలో ఒక మూలగా వున్న తాటాకు బుట్టలోంచి ఓ చీరె, జాకెట్టూ తెచ్చి కిరణ్మయికిచ్చేడు.

ఆమె అతడివేపు అదోలా చూసింది.

"నా ఇంట్లో అవ్వేందుకున్నాయని కదూ నీ అనుమానం? వెళ్ళి స్నానం చేసి వచ్చాక అంతా చెప్తాను" అన్నాడు పరాత్పరం.

ఆమె వెళ్ళి స్నానంచేసి పరాత్పరం యిచ్చిన బట్టలు కట్టుకొచ్చింది.

"ఇప్పుడు చెప్తా విను! ఫ్లాషుబ్యాక్ చెప్పి బోరుకొడతాడేంటా? ఓ అరిటిపండిస్తే మింగి పడుకుంటాను కదా... అనుకోకు మనది పండంటి కాపురంలా వుండాలి కనుక అరిటిపండొలిచినట్టు అన్నీ చెప్పాలి. అది నా ధర్మం" అని, ఆమె వింటోందా లేదా అని గమనించి, వింటోందని గ్రహించి,

"మేం మాదిగోళ్ళం! చిన్నప్పట్నించి నా సావాసగాళ్ళంతా అగ్రకులపోళ్ళే. నిజం చెప్పొద్దూ... మా గూడెపోళ్ళ వెంటే తిరిగితే నేనూ జీవాల్ని మేపుకుంటూ అక్కడే వుండేవాణ్ని. భాష కూడా నేర్చుకున్నాను. ఇంస్తోకూస్తో చదువూ అబ్బింది. కట్టూ బొట్టూ తీరే మారింది. కళాకారుడ్నీ, నాయకుడ్నీ కూడా అయ్యాను.

కులాల కంపు వద్దంటూ 'మంచి అన్నది మాల అయితే మాలనేనగుదున్' అని మీ పంతులుగారు గురజాడ అప్పారావుగారంటే అది నేను మెచ్చి ఓ మాలపిల్ల నచ్చితే వర్ణాంతర వివాహం చేసుకున్నాను ఆదర్శంగా! మాకన్నా మాలోళ్లు అగ్రకులం కనుక పెద్దింటి పిల్ల అని ముద్దుచేశాను. ఏమైందో తెలుసా? అలగా జాతోడు అమ్మాయి కులం చెరిచాడని గూడెపోళ్లంతా కుల పంచాయితీ పెట్టారు. రెండు మేకలు,

రెండు గొర్రెలు, రెండు జీవాలు, యిప్ప సారా క్యానూ, రెండొందలు క్యాషూ తప్పు కట్టమంటే కట్టి కాపురం పెట్టాను. పట్టు మని పది వారాలుండోలేదో మారుమనుం ఆడ్తానని అల్లరిచేసి వెళ్లింది. వెళ్లింది ఎక్క డన్నా కుదురుకుందా? అదీలేదు. కూటికి డబ్బియ్యమని ఆదివారం ఆదివారం గూడె పోళ్లను వెంటేసుకుని గుడిసె మీదికొస్తుంది. అమ్మోరి కలెక్షనంతా అదే తన్నుకుపో తుంది. ఏమన్నా అందామా అంటే కొట్లాట! మేమూ మేమూ కొట్టుకున్నామని మీ వాళ్లు నవ్వుతారని అదొక భయం..."

"అయితే యీ చీరె, రెవిక ఆవిడదం టావ్"

"మరెవరిదీ.. ఎస్తేరమ్మదే!" అని ఎందుకో గబుక్కున ఉలిక్కిపడి "అవున వునూ... ఈరోజు ఆదివారం కదూ? " అని అడిగేడు పరాత్పరం భయం భయంగా.

కిరణ్మయి సమాధానం చెప్పకముందే "ఆడు గుడిసెలో వుండాడో, లేదో అయ్యోవ్! ఆ తడికె తలుపు అసుంటికి జరిపి లోపలికి తొంగి చూడు" అని గుడిసె బయట్నించి వినిపించిందో ఆడ గొంతు.

తడికె తలుపు తెరుచుకుంది.

సింహం తలకాయలాంటిదొకటి ముందు కొచ్చి అదే విసుర్లో వెనక్కు వెళ్లింది. "ఆడు లోపలే వుండాడు" అన్న మాటలు వినిపిం చేయి.

సుడిగాల్లా లోపలికి వచ్చిందొకామె!

పరాత్పరం బలవంతంగా నవ్వుతూ అన్నాడు "నీకు నూరేళ్లమ్మా..."

"ఏంటికంటా? "

"ఇప్పుడే నీ విషయం కిరణ్మయితో అంటు న్నాను. అంతలోకే నువ్వొచ్చావ్ అందుకని!" అన్నాడు పరాత్పరం.

"పరాశకాలు పక్కనెట్టి సంగజ్జెప్పు! తాయి త్తులెన్నిగట్టావ్ శాతబళ్లు ఎన్నిజేసినావ్... యియ్యాళ ఆదోరం!" అని అప్పటికే వచ్చి పరాత్పరం వెనకే నించున్న తండ్రితో "అయ్యోవ్.. ఆ సంగతి నువ్వు జూస్కో" అంటూ కిరణ్మయికి చూపులుగుచ్చి

"ఆ గొప్పోళ్ల పిల్లవి నువ్వేగా? " అని అడి గిందామె.

కిరణ్మయి తలాడించింది.

"ఓసోసి నువ్వేనా.. జర్గు అసుంటికి జర్గు" అని కిరణ్మయి జరక్కముందే తనే ఆమెను అవతలికి తోసి పక్కనే ఆనుకుని కూర్చుని చోద్యంగా చూస్తూ నాటు పందుల మద్దెన సీమపంది లెక్కున్నావ్. ఏం గత్తరొచ్చిందే నీకు యీడ్ని దగులుకున్నావ్? " అడిగింది అభిమానంగా.

ఆమెను కిరణ్మయి అర్థం చేసుకోలేకపో యింది. తిరస్కారంగా చూసింది.

ఆవిడ ఆ తిరస్కారాన్ని గమనించి కోపంగా ముఖంపెట్టి "ఏందమ్మోవ్ అట్లా నీలుక్కున్నవ్, పెద్దకులపు గుంటవనా మిడి సిపాటు? " అంది.

పిట్టల్నిగొట్టే క్యాడ్‌బాల్ పంగల కర్రలా చేతివేళ్లను పెదాలకు ఆనించిపెట్టి ఓ మూలకి తుపుక్కున ఉమ్మి, అన్నాడు తండ్రి చిరాగ్గా, "ఏంటిలే అసుంటి మాట్లు. సారా కొచ్చేనా, సీకుల కొచ్చేనా? "

పరాత్పరంకు ఆ వాతావరణం నచ్చలేదు. ఎలాగైనా వాళ్లను పంపించి వెయ్యాలన్న ఉద్దేశంతో "చూడూ ఆ అమ్మాయితో నీకు అనవసరం. నీ పనేందో నువ్వు చూసుకుని వెళ్లిపో! ఈ వారంలో మొత్తం ఇరవై తాయి త్తులు కట్టాను. నీ తోడు, చాతబళ్లేం రాలేదు. పోతే... విబూది, కుంకుం డబ్బులు నాకుంచి మిగిలింది పట్టుకుని వెళ్లు" అని అమూల్‌డబ్బాలోంచి డబ్బు తెచ్చి ఆవిడ కిచ్చేడు.

ఆవిడ డబ్బును బొడ్లో దోపుకుంది. కొర కొరా కిరణ్మయివేపు చూసింది. "యీడ్ని గట్టుకొని నువ్వు పడేటి సుకం నాకు తెల్వా




దేంటి! పదినెల్ల కాపురంలో ఆడ్తో నేను బడ్డా నుగా సుకం. వొంటికి ముకమానిత్తే సెవట కంపూ, నోరు తెరిత్తే కల్లు కంపూ..."

"ఏంటిలే అసుంటిమాట్లూ... సారాకొచ్చేనా, సీకులకొచ్చేనా?" విసుక్కున్నాడు తండ్రి.

ఆవిడ లేచి వెళ్లబోయింది.

"రెండ్రోజుల్లో మేం దండలపెళ్లి చేసుకుంటాం. నీకూ, నాకూ లావాదేవీలిక బందే!" అన్నాడు పరాత్పరం ధైర్యాన్ని కూడ దీసుకుంటూ.

"ఎట్టెట్టా... బందా... అయ్యోవ్! మన గూడెపోల్లను గుంజకరా! బందో, కాదో గుల్ల బారగొట్టి ఆడి శాతనే సెప్పిత్తారు" అంది ఆవిడ పెద్దగా రంకెలేస్తూ.

"ఏంటికే అసుంటి మాట్లూ, సారాకొచ్చేనా సీకులకొచ్చేనా" అని కూతుర్ని మందలించి "అల్లుడూ నా. కూతురెసుమంటిదో కిర్మాణీ కూడా అసుమంటిదే. అన్నేలం సెయ్యంగానీ నేజెప్పేదినుకో... దీనికో ఐదేలియ్యి... ఇదే సివరాకరు కిత్తీ" అన్నాడు పెద్దమనిషి తరహాగా.

"ఐదువేలా? మినిష్టరుకు చాతబడిచేసినా అంత డబ్బివ్వరు. నేనెక్కడ తేనూ ఐదు వేలు"

"అయ్యోయ్, గూడెపోళ్లను గుంజకరా..." కేకేసింది ఆవిడ.

అంతవరకూ తనకేం పట్టనట్టే కూర్చున్న కిరణ్మయి పరాత్పరంను అవతలికి పిల్చి ఏదో చెప్పి మెళ్లోవున్న వొంటిపేట బంగారం గొలుసుతీసి అతడి చేతిలో పెట్టింది.

పరాత్పరం ఛాతీ ఉబ్బింది. భార్య దగ్గరికి వెళ్లి "చూడూ, ఈ గొలుసు అమ్మితే ఎంతొస్తుందోకానీ అందులో మేమిద్దరం పెళ్లి బట్టలు కొనుక్కోవాలి. నులకమంచం, సత్తు గిన్నెలూ కొనుక్కోవాలి. దండల పెళ్లే కనుక పెళ్లికి ఖర్చుండదు. అన్నీపోను మిగిలింది నీకే యిస్తాను. కాస్తో కూస్తో తక్కువ పడితే కిరణ్మయి వాటా డబ్బు వాళ్లన్న బ్యాంకులో వేశాట్ట. నిదానంగా అది డ్రా చేసి నీ బాకీ తీరుస్తాను" చెప్పేడు పరాత్పరం.

ఆవిడ అనుమానంగా చూసింది.

"నిజం ఆయన మాట నమ్మండి" అంది కిరణ్మయి.

ఆవిడ కిరణ్మయి దగ్గరికి వెళ్లి ఆమె భుజంమీద చెయ్యేసి నిమురుస్తూ "అప్పోవ్! నువ్ ముప్పియ్యారుజెప్పు. ఆడి మాటలునే జస్తేనమ్మ" అంది నిష్కర్షగా.

"నాదీ బాధ్యత!" హామీ యిచ్చింది కిరణ్మయి.

ఆవిడ ముఖంతోపాటు తండ్రి ముఖం కూడా దివ్యంగా వెలిగింది.

"అల్లుడూ.. ఎంత పోలేరమ్మ గుడికాడ దండల పెళ్లయినా బువ్వన్నా బెట్టకపోతే కులం కట్టువొప్పదు. మా ఐదేలూ నిమ్మలంగా కిర్మాణీ యిస్తాదిగాని, గొలుసు డబ్బులెట్టి గనంగా బువ్వెట్టు. మా కోపువాళ్లంతా నీకోపువాళ్లంతా బువ్వకొత్తారు. గూడెంలో నవనవలాడే జీవాలున్నయ్యి గాని పెద్దోళ్ల పిల్లతో మనుంగనక నాటుకోళ్లతో సరిపెట్టు" అని సూక్ష్మం చెప్పేడు మాజీ మామ.



కిరణ్మయి, పరాత్పరం పెళ్లి జరిగింది.



పరాత్పరం గుడిసె దగ్గరే షామియానాలు వేసేరు. కులంలో రెండు తెగలవారికీ విడి విడిగా భోజనాలు పెట్టేరు.

అందరూ భోజనాలు ముగించేక మరీ తక్కువ కులం వాళ్లను పిల్చి మిగిలిపోయిన అన్నం, కూరలూ వాళ్ల జోలెల్లోవేసి వాళ్లతో విస్తర్లు ఎత్తించేరు.

అజమాయిషీ అంతా పేతురుదే.

మైకులో రామాంజనేయ యుద్ధం పద్యాలు చెవులు బద్దలయ్యేట్లు వినిపిస్తోన్నాయి.

కిరణ్మయి భోంచెయ్యలేదు. సవతి బలవంతంమీద గ్లాసెడు మజ్జిగ తాగి పడుకుంది.

పల్లెవాళ్లంతా ఒక్కొక్కళ్లే వెళ్లిపోయారు.

హడావుడి మొత్తం తగ్గింతర్వాత సవతి మళ్లీ కిరణ్మయి దగ్గరకొచ్చింది. కిరణ్మయి పడుకున్న నులకమంచం పట్టెమీద వొదిగి కూర్చుని ఎగాదిగా కిరణ్మయివేపు చూసి "అప్పా! ఏంటికట్టా యాడుస్తుండావ్? అమ్మోళ్లు గురుతొచ్చినా? " అడిగింది.

కిరణ్మయి పెద్దగా ఏడ్చింది.

"యాడవబాకే అప్పా... గుర్తొచ్చుడు రివాజే. అయినా కర్మంగాల్నాక ఏంజేస్తాం! నిమ్మళంగా వుండాలంటే పెద్ద కులపు గుంటవన్న యిస్వాసంతో సెప్తన్నానప్పోవ్, యాడవబాకు. సెయ్యి జార్న బతుకూ, సేలో లెగిసిన కలుపూ ఏంటికీ పనికిరావు. అంత మాత్తరం శాత ఏడుత్తూ కూకుంటామా! దయిర్నంగా బతకాలి. ఇంక నన్నా గేలం మింగిన సేపలెక్క ఆడు గుంజినట్టే ఎగరమాకప్పోవ్, నువ్వే ఆడ్ని మూతి గట్టేసిన జీవం లెక్కుంచాల. ఆడెసుమంటోడనుకున్నవ్! వొలుకుల్లో దిరిగే నక్కసుమంటోడు. తొలీగ నా లగ్గం ఆడ్తో అయినాంక చోభనం అయిందే ఆలీశం, నాల్గు దినాలకే ఆడు నల్లమందుకోసరం నా నాన్తాడు తాకట్టెట్టిండు..."

"నల్లమందా? " ఆశ్చర్యంగా అడిగింది కిరణ్మయి.

"అవునే అప్పా! తెలవదేంటి నీకు? ఆడు నిత్తెం నల్లమందు ముక్కుపొడుంల నూరు కొని డబ్బీలో ఎట్టుకుంటాడు. గడీకోమాలు సిటికెడంత తీసి ఎగబీలుత్తుంటాడు. అది ఆడి అలవోటు. ఆడెట్టా గత్తరొచ్చి బోతేనేం? అనుకుంటినప్పోవ్, అరటిపొండ్ల తోల్దీసి గుజ్జింత గుంజేసి ఆ బొక్కల కూత్తింత నల్లమందు కూరేవోడు. దానిమీన మళ్లీ గుజ్జు అతికిచ్చి, తొక్కను కరిపిచ్చి 'అమ్మోరి ప్రెసాదం తిను!' అనేవోడు. తొలిపారి, అమ్మోరి ప్రసాదం అంటే కళ్లకద్దుకుని తిన్నా. కళ్లు గిర్రుమని తిరిగాయి. అనుమానం ఒచ్చిందప్పోవ్, అంతే.. మా అయ్యకు జెప్పినా గూడెపోళ్లొచ్చి గుంజక్కట్టి గుల్లబారగొట్టినాంకగాని ఆడు నిజ్జం కక్కలేదు. అట్టా నల్లమందెట్టి బాన్సన్ జేస్కుంటే ఆడ్నిడిసి ఎళ్లనని అట్లాజేసిండట" అని ఎస్తేరమ్మ యింకా ఏదో చెప్పబోతోంటే

తడికె తలుపు పక్కనించి సింహం తలకాయ లోపలికిపెట్టి అన్నాడామె తండ్రి పేతురు "ఏంటికే అసుంటిమాట్లూ... సారాకొచ్చేనా సీకుల..."

"అయ్యోవ్ వత్తన్నా..." అని మధ్యలోనే లేచి వెళ్లిందామె.

షామియానా వాళ్లకూ యింకా కొంతమందికీ చెల్లించాల్సిన డబ్బు చెల్లించి ఇంట్లోకి వచ్చేడు పరాత్పరం. నులకమంచం మీద ఠీవిగా కూర్చొని కిరణ్మయి భుజంమీద చెయ్యేసేడు ఆప్యాయంగా.

కిరణ్మయి అతనివేపు తేరిపార చూసింది.

పరాత్పరం ఇంకా పెళ్లి బట్టల్లోనే ఉన్నాడు. ఎర్రటి ప్యాంటు మీద ముదురా కుపచ్చ చొక్కాను యిన్‌షర్టుచేసి, నల్లటి బెల్టు తగిలించేడు. నాలుగైదు రంగుల




గళ్లున్న టై కట్టి, చొక్కా చేతుల్ని చంకలదాకా మడిచేడు. ముదురు నీలం రంగు సాక్సులు తొడిగి వాటిమీద తెల్లటి కాన్వాసు బూట్లే సేడు.

అతని శరీరం మీంచి శవాలకు చల్లే నాసి రకం సెంటు వాసన గుప్పుగుప్పున కొడు తోంటే ముక్కు మూసుకుని దూరంగా జరి గింది కిరణ్మయి.

"అబ్బో... పెళ్లికి ముందులేని సిగ్గు యిప్పుడు ముంచుకొచ్చిందే!" అంటూ అతనూ జరిగి ఆమెను అంటుకుని కూర్చుంటూ,

"కిరణ్మయీ! గొలుసమ్మితే వొచ్చిన డబ్బంతా పెళ్లి బట్టలకూ, భోజనాలకూ అయిపోయింది. దాని బాకీ అలాగే నిలబ డిపోయింది. చేతిలో రూపాయి కూడా లేదు..."

"ఏం నల్లమందుకొనాలా? " అని అతని వేపు తీక్షణంగా చూసి, తలదించుకుని పెద్దగా ఏడ్చింది కిరణ్మయి.

"అలా ఏడుస్తావే? అయినా నల్లమం దేంటీ? " తేలుకొండెలా ముఖంపెట్టి అన్నాడు పరాత్పరం.

"బూకరించకండి. నాకంతా తెలుసు!"

"ఎస్తేరమ్మ చెప్పిందా? దాని మాటలు నమ్మబోకు. అదుట్టి బొంకులాడి. ఏదో లేదురుకదా అని మోజుపడి నన్నప్పుడు పెళ్లి చేసుకుందికానీ దాని పొగరు అంతాయింతా కాదు. అగ్రవర్ణం కదూ" అని నాలుక కొరు క్కుని "అయినా పాపం పుణ్యాం భగవంతు డిదే. మనదేముందీ. మర్చిపో! పెళ్లి రోజిలా కంటతడిపెట్టటం శుభం కాదు. లే... లేచి త్వరగా తయారై వస్తే ఇద్దరం మీ పుట్టిం టికి వెళ్లి వాళ్ల ఆశీర్వాదం కూడా తీసు కుందాం. అయినా అయినవాళ్లతో మన కంత పట్టింపులు మంచిదికాదు" అన్నాడు పరాత్పరం.

కిరణ్మయి ఏడుపు దిగమింగుకుంది. ఆమె ఆలోచనలు ఇంటికేసి మళ్లేయి.

"అమ్మ, అన్నయ్యవాళ్లు మనల్ని ఆశీర్వది స్తారా? ఒకవేళ ఆశీర్వదించినా, ఆశీర్వదిం చకపోయినా ఆ ఇంటికి వెడితే కేవలం మా అమ్మకోసం వెళ్లాలి" అంది కిరణ్మయి.

"అయితే త్వరగా కానీ, వెళ్దాం" చెప్పేడు పరాత్పరం.

ఓ గంటలో ఇద్దరూ మార్కండేయులు ఇల్లు చేరుకున్నారు. వరండాలోనే కనిపిం చేడు మార్కండేయులు.

"నమస్తే బావగారూ! మా పెళ్లికి కబురు పెట్టినా మీరు దయ చూపలేదు. అయినా కళ్యాణమొచ్చినా కక్కొచ్చినా ఆగదుకదా" అంటూ పరాత్పరం వెళ్లి మార్కండేయులు పక్కనే కుర్చీలో కూర్చుంటూ "అత్తయ్యగారు లోపలున్నారా? " అని అడిగేడు.

పరాత్పరం వేపు తేరిపార చూసి "కక్కేవ చ్చింది. అందుకే రాలేదు!" అని తలతిప్పి కిరణ్మయివేపు చూస్తూ "నీకు నేనే కబురు పెడదామనుకుంటున్నాను. నువ్వే వచ్చి నాకు శ్రమ తగ్గించావ్. ఒక్కక్షణం ఆగు" అని కుర్చీలోంచి లేచి ఇంట్లోకి వెళ్లి, ఐదు నిముషాల్లో తిరిగొచ్చి "ఇదిగో, ఈ కవర్లో నీ పేరిట బ్యాంకులో వున్న డబ్బు తాలూకు కాయితాలన్నీ వున్నాయి. అది ఫిక్సుడు డిపాజిట్టు. వేసింతర్వాత ఒకసారి మెచ్యూ రైతే మళ్లీ ఐదేళ్లకు వేసేను. ఇంకా మూడు సంవత్సరాలకు డ్రా చేసుకోవచ్చు" అని ఓ కవర్ను కిరణ్మయికిచ్చి "ఇక మీరు వెళ్ల వచ్చు" అన్నాడు మార్కండేయులు.

పరాత్పరం కిరణ్మయి ఒకళ్ల ముఖాలో కళ్లు చూసుకున్నారు.

ఒకవైపు కోపం, మరోవైపు బాధతో కిర ణ్మయి ఉక్కిరిబిక్కిరైపోతోంది. "అన్నయ్యా నువ్వెంత కఠినంగా ప్రవర్తించినా అమ్మ నాకు జన్మనిచ్చింది. ఆశీర్వదించకుండా ఆడ పిల్లను పంపించదు..." అని, ఇంకా ఏదో

అనబోయి, ఆగి వెక్కిళ్లు పెడుతూ ఏడవసాగింది.

మార్కండేయులు తన గుండెమీద తన్నిన భృగుమహర్షివేపు విష్ణుమూర్తి చూసినట్టే చూసి, "ఏమని ఆశీర్వదించాలమ్మా, కిరణ్మయీ... శీఘ్రమేవ కళ్యాణ ప్రాప్తిరస్తు అనే వస్లేదు! దీర్ఘాయుష్మాన్భవ అందామా, నీ ఆరోగ్యాన్ని నువ్వే పాడుచేసుకుని జీవిత కాలాన్ని తగ్గించుకుంటున్నావ్! సుపుత్ర ప్రాప్తిరస్తు అనలేను. ఎందుకంటే నీ జీవితాన్ని నువ్వే వక్రమార్గంలోకి మళ్లించుకుని, మత్తులో జోగుతూ బాధ్యతారాహిత్యాన్ని ప్రేమిస్తోన్నప్పుడు నువ్వో అమాయక ప్రాణికి జన్మనిచ్చి జీవితకాలపు నరకాన్ని ఆ పసిగుడ్డుకు శాపంగా యిమ్మని దీవించనా, ఏమని దీవించనమ్మా నిన్ను?"

తన ఆర్తిగీతం అంతర్గృహాలలో వున్నాసరే అమ్మకు వినిపించాలన్నంతగా "అమ్మా!" అంటూ గొంతెత్తి పిలిచింది కిరణ్మయి.

ఆ పిలుపు మార్కండేయులు ఇంటి అణువణువూ తాకి ప్రతిధ్వనించిందే కానీ భువనేశ్వరీదేవి మాత్రం కిరణ్మయి దగ్గరికి రాలేదు. రాను అని కాత్యాయినితో కబురు పెట్టి తులసికోట వెనుక నక్కి దాక్కుంది.

అక్కడికి వెళ్తే పరాత్పరంతో తను క్షుద్ర పూజ చేయించిన గుట్టు రట్టవుతుందని ఆవిడ భయం.

"కిరణ్మయీ! జరిగిన అవమానంచాలు, వెళ్దాంపద. ఇంతకింత ప్రతీకారం తీర్చుకోకపోతే నేను పరాత్పరాన్నేకాదు!" అని కిరణ్మయి చెయ్యిపుచ్చుకుని బయటికి నడిపించేడు పరాత్పరం.



నల్లమందు పెట్టాడని తెలిసి కూడా ఆ రాత్రి ఎప్పటికన్నా ఎక్కువ అరటిపండ్లే తిన్నది కిరణ్మయి. అందుకు పరాత్పరం అభ్యంతరం చెప్పలేదు.

★ ★ ★

మిథిల పెళ్లినాడు వాళ్లతో మార్కండేయులు చెప్పినట్లే ఉద్యోగం వచ్చి గుంటూరులోనే కుదురుకున్నాడు గోపీకృష్ణ. మిథిల ప్రైవేటు ప్రాక్టీసు పెట్టింది.

పెళ్లి కాగానే కనీసం మూడు నిద్రలన్నా చేయనివ్వకుండానే అన్నయ్యా తమను ఇంట్లోంచి పంపించాడన్న కోపం వాళ్లకింకా తగ్గలేదు. డబ్బు విషయంలోకానీ యితర సందర్భాల్లోకానీ చాలా నిష్కర్షగా వ్యవహరించే మార్కండేయులు స్వభావం వాళ్లకు గిట్టలేదు. దాంతో ఇద్దరికీ పట్టుదల పెరిగింది. రేయింబవళ్లూ కష్టించి డబ్బు కూడబెట్టాలనీ, ఏనాటికైనా మార్కండేయులు కన్నా ఎక్కువ ఆస్తులు సంపాదించాలనీ... అనుకున్నారు.

గోపీకృష్ణకు డబ్బు ఖర్చయ్యే ఎలాంటి దురలవాట్లులేవు. నెల కాగానే జీతం, నిత్యం వచ్చే పైసంపాదనా ఎప్పటికప్పుడు మిథిల చేతిలోనే పెట్టి చేతులు దులుపుకోవటం అలవాటు చేసుకున్నాడు. మిథిల కూడా నిద్రాహారాలు మాని వృత్తికే అంకితమైపోయింది. ప్రాక్టీసు బాగా పెరిగింది. డబ్బు ప్రవాహంలా వచ్చి పడుతోంది.

మంచి ఖరీదైన ప్రాంతంలో అర ఎకరం స్థలం కొని ఆస్పత్రికోసమూ సొంత నివాసానికీ విశాలమైన గదులతో పెద్ద ఇల్లు కట్టించి, ఆ ఇంటి స్థాయికి సరిపడే ఖరీదైన కారు కూడా కొన్నారు.

బ్యాంకు బ్యాలెన్సులు పెరిగిపోతున్నాయి. బంగారం నిల్వలూ, బాపట్ల దగ్గర జీడిమామిడి తోటలూ, పట్టణంలో ఓ పెద్ద సినిమా హాలూ, రెండు బియ్యం మిల్లులూ సరే...

మార్కండేయులు ఇంటికి రాకపోకలు అంతగా లేకపోయినా జీవితంలో ఒక్కోమెట్టే ఎక్కుతూ అనూహ్యంగా సాధిస్తోన్న తన విజయాల పరంపరను అన్నయ్య చూసి ఈర్ష్యపడితే తను సంతోషపడాలన్న ఉద్దేశంతో కొన్నిసార్లు వాళ్లను ఆహ్వానించింది మిథిల. గృహ ప్రవేశానికీ, కారుకొన్నప్పుడూ, సినిమాహాలూ, రైసు మిల్లులూ తమ సొంతమైనప్పుడూ అలా... అలా...

అలాంటి సందర్భాల్లో మాత్రమే తమను ఆహ్వానించటం వెనుక మిథిలను యింకా వీడని పసితనాన్ని గుర్తించి నవ్వుకునేవాడు మార్కండేయులు. చెల్లాయికి ఒనగూడుతోన్న ఐశ్వర్యాన్ని చూసి లోలోపల సంబరపడేవాడు.

భువనేశ్వరీదేవిని తమ ఇంట్లోనే వుంచితే బంధువర్గంలో కీర్తి ప్రతిష్టలు పెరుగుతాయని ఒకరోజు మిథిల పనిగట్టుకుని కార్లో వెళ్లింది. తన ఉద్దేశం మరోలావున్నా మార్కండేయులుతో మాత్రం అంది,

"అన్నయ్యా! బావ ఆఫీసుకు వెళ్తాడు. నేను ఆస్పత్రి చూసుకోవాలి. నౌకర్లూ, చాకర్లూ వున్నా సొంత మనిషంటూ లేకపోతే చాలాకష్టం. నీకు తెలుసుగా, ఇల్లంతా నౌకర్లకు విడిచిపెట్టి మాదార్న మేం వెళ్తే ఎప్పుడు ఎవరి బుద్ధి ఎలా మారుతుందో! పైగా ఖరీదైన వస్తువులు బోలెడున్నాయి. డబ్బూ దస్కం, నగానట్రా..."

"విషయం చెప్పమ్మా!" అన్నాడు మార్కండేయులు.

"అమ్మను నాతో తీసుకుపోతాను" అంది మిథిల.

"ఆ విషయం అడగాల్సింది అమ్మనుకదా!"

"నువ్వొప్పుకుంటే అమ్మదేముంది?"

"అమ్మ ఒప్పుకుని నీతోవస్తే నాది మాత్రం ఏముంది!" అన్నాడు మార్కండే





యులు.

మిథిల తన యిబ్బందిని వివరంగా చెప్ప గానే భువనేశ్వరీదేవి కూతురువెంట బయ ల్దేరి వెళ్లింది.

ఆస్పత్రి బిల్డింగు పైనే మిథిల కాపురం వుంటోంది. కారు దిగ్గానే ఇంట్లోకి వెళ్లి స్నానం చేసి మడిబట్టలు కట్టుకుని "అమ్మాయ్! పూజగది ఎక్కడే? " అని అడి గేరు భువనేశ్వరీదేవి.

"అమ్మా... రేపు నీకు ప్రత్యేకంగా పూజ గది ఏర్పాటు చేస్తానుకానీ ఈ రోజుకు ఎలాగో సరిపెట్టుకో! ఈలోగా వంటమనిషి వంట చేస్తుంది. మా కోసం చూడక నువ్వు భోజనం చేసి విశ్రాంతి తీసుకో. నేను ఆస్ప త్రికి వెళ్తొస్తాను" అని మిథిల వెళ్లిపో యింది.

భువనేశ్వరీదేవి ముఖం గంటుపెట్టుకుని ఆ రోజుకు గత్యంతరం లేక దేవుడి క్యాలెం డరుకు సాంబ్రాణీ కడ్డీలు వెలిగించి గుచ్చి స్వామివారిముందు లెంపలేసుకుని సరిపు చ్చుకున్నారు.

వంట మనిషి కూరలేం చేస్తోందో చూసేందుకు వంటగదిలోకి వెళ్లేరు భువనే శ్వరీదేవి.

వంట మనిషి అప్పుడే పొయ్యి వెలిగిం చింది.

వెనుకనించే ఆమెను పరీక్షగా చూసి "నీ పేరేంటి? " అని అడిగేరామె.

వంట మనిషి ఉలిక్కిపడి చూసింది. "ఇంతకూ తమరెవరూ? " అంది ప్రశ్నార్థ కంగా ముఖంపెట్టి,

"నేను మిథిల తల్లిని!" చెప్పేరామె.

వంట మనిషి ముఖం చాటంత చేసుకుని "నా పేరు వరలక్ష్మి" అంది చిర్నవ్వుతో.

"ఇంటి పేరూ? "

"భాగవతులవారు!"

భువనేశ్వరీదేవి గిర్రున వెనక్కు తిరిగి గదిదాటి వెళ్లి మెట్లన్నీ దిగి రివ్వున మిథిల గదిలోకి వెళ్లింది.

"డాక్టరమ్మగారు కాన్పు చేస్తున్నారు. మీరు కొంచెంసేపు బయట కూర్చోండి" చెప్పింది నర్సు.

"అమ్మాయ్! నీ పేరేంటమ్మా? " గది లోంచి బయటికి వెడుతూ నర్సును అడిగే రామె.

"మేరీ!" చెప్పింది నర్సు.

అలవాటు ప్రకారం కులమేంటి? అని అడగబోయి అనవసరం అని తమాయించు కుని బయటికి నడిచేరు.

భోజనాల వేళ కావస్తోంది.

ఆరోజు గవర్నమెంటు ఆఫీసులకు ఎందుకో సెలవుట. బజారుకు వెళ్లిన గోపీ కృష్ణ ఆ సమయానికే వచ్చేసేడు.

అత్తగార్తో కుశల ప్రశ్నలూ, అందుకు ఆవిడ సమాధానాలూ అయ్యేక "కిరణ్మయి విషయాలేమైనా తెలుస్తున్నాయా? " అని అడిగేడు గోపీకృష్ణ.

అలా అడిగినప్పుడెందుకో అతని ముఖం మీంచి ఓ నీలితెర కదిలి వెళ్లినట్టుంది.

భువనేశ్వరీదేవి పైకి చూసింది. ఎదు రుగా గోడకున్న దేవుడి క్యాలెండరు మీద చూపు నిలిపింది. "కడుపు చించుకుంటే కాళ్లమీదే పడుతుందన్నట్లు దాని విషయం ఏం చెప్పమంటావు నాయనా! అయిపో యింది. దాని జీవితం సర్వనాశనమైపో యింది. ఏ దుష్టశక్తి దాని బతుకులో నిప్పులు పోసిందోకానీ దాని బతుకు కుక్కలు చించిన విస్తరైంది. కోరిమరీ కరెం టులో వేలుపెట్టినట్టు ఆ జష్టపీనుగను కట్టు కున్నాక..." అని ఏదో దుఃఖపు పొంగు కంఠానికి అడ్డుపడ్డట్టు ఆగి సోఫాలో కూల బడిపోయేరు భువనేశ్వరీదేవి.

ఆస్పత్రినించి మిథిల వచ్చింది. సబ్బుతో హడావుడిగా చేతులు కడుక్కుని డైనింగ్ టేబులు దగ్గర కూర్చుని "త్వరగా భోంచేద్దాం రండి. మళ్లీ నేను ఆస్పత్రికి వెళ్లాలి. ఎబార్షన్ కేసుంది!" అంది మిథిల.

గోపీకృష్ణ వెళ్లి భోజనానికి కూర్చున్నాడు. వంట మనిషే వడ్డిస్తోంది.

"అమ్మాయ్ మిథిలా... నేనీపూట భోజనం చెయ్యను. పండ్లతో సరిపెట్టుకుంటాను. మీరు కానివ్వండి" అన్నారు సోఫా లోంచే భువనేశ్వరీదేవి.

మిథిల ఆమె వేపు ప్రశ్నార్థకంగా చూసింది.

వరలక్ష్మి కూరో నారో తెచ్చేందుకలా వంట గదిలోకి వెళ్లగానే క్రీగంట ఆమె కదలికల్ని గమనిస్తోన్న భువనేశ్వరీదేవి "అమ్మాయ్! వంట చేసేందుకు నియోగులెవ్వరూ దొరకలేదటే?" అన్నారు చాలా నిష్టూరంగా.

"ఏంటమ్మా చాదస్తం! మనిషి చంద్రగ్రహంమీద ఇల్లు కట్టుకుని కాపురం వుంటాడేమో కానీ మీరు మాత్రం చస్తే మారరు!" అంది మిథిల కోపంగా.

వంట గదిలోకి వెళ్లిన వరలక్ష్మమ్మకి భువనేశ్వరీదేవి అన్నమాటలు వినిపించి ఆగ్రహోదగ్రురాలైంది. చేతుల్లో వున్న కూర గిన్నెను విసురుగా కిందపెట్టి తలమీంచి జారిన ధోవతిని సవరించుకుంటూ వచ్చి "ఏవండోయ్, ఎంత నియోగులైనా అంత నీటు పనికిరాదు. ఏదో మొగుడు చచ్చి గ్రహచారం కాలి వంటక్కుదిరాను కానీ నిజం చెప్పాలంటే మీకంటే పెద్దకులమే మాది. క్రతువులకు మంత్రాలు చదివించుకుని మా కాళ్లు పట్టుకునే మీదెలా అవుతుంది పెద్దకులం. వెనుకటికెవడో విశ్వబ్రాహ్మణుడన్నాట్ట సుత్తెతో బంగారాన్ని బాత్తూ 'ఈ బ్రాహ్మలు దేశానికి అయితే మేం మొత్తం విశ్వానికే బ్రాహ్మలం' అని. అలా వుంది మీ ధోరణి" అని ఇంకా కోపం చల్లారక మిథిలవేపు తిరిగి-

"అమ్మోవ్! మీరేదో మంచాళ్లని మీ ఇంట్లో వంటక్కుదిరేను. కానీ కులాన్ని కించపరిస్తే పస్తుండి చావనైనా చస్తాను కానీ పనిచెయ్యను. ఆ పాపిష్టివాడు ఒంటరిగా నన్నీ భూమ్మీద వొదిలి చక్కా పుణ్యలోకాలకు వెళ్ళిపోయాడు. అయినా ఒకళ్లనని ఏం ప్రయోజనం! వాడ్ననాలిగానీ..." అంటూ భోర్న ఏడ్చేరు.

ఆమెను సమాధానపరిచేందుకు మిథిల ఏదో చెప్పబోయేంతలో మరో డజను ఆస్పత్రి గదుల్ని కొత్తగా కట్టే వ్యవహారం మీద మిథిలకోసం వచ్చిన బేల్దారు మేస్త్రీ దిబ్బయ్యగారు భళ్లున నవ్వేరు.

ఆ నవ్వుకు అందరూ అవాక్కయి అటువేపుకు తిరిగేరు.

"డాక్టరమ్మగోరూ! వాళ్ళ యవ్వారం తేలేదేం కాదు. అయినా ఇంకా పెద్దకులం చిన్నకులం ఏంటో! రాజ్జాలేలిన మేమే కులం ముఖ్యమా, కూడు ముఖ్యమా అంటే 'కూడే' అనుకుని కూలికిపోతున్నాం. ఆ మాటకొస్తే మాదెంత పెద్దకులం అనీ... రాజులం! శ్రీనాథుడంతటోడు మాకు పన్ను కట్టకపోతే గుదిబండ శిక్ష ఏసినోళ్లం! ఆ గొడవ పోనీండికానీ అర్జెంటుగా సిమెంటు బస్తాలు, యినుము తెప్పిచ్చాల. అదే చెప్పిపోదామనొచ్చా... వొస్తామరి" అంటూనే హడావుడిగా వెళ్ళిపోయాడు దిబ్బయ్య.

అంతవరకూ నోరు తెరుచుకుని విన్న భువనేశ్వరిదేవి అతడు వెళ్ళిపోగానే "ఏం కులమే అతన్ది?" అడిగేరు.

"వొడియరాజులు!" చెప్పింది మిథిల.

భువనేశ్వరిదేవికి చిర్రెత్తుకొచ్చింది. "ఏంటో మీ వ్యవహారం! ఇంట్లో ఒక పూజ గదా, పాడా, వంట చూస్తేనా వైదీకపు వంట. ఎవరుబడితే వారు నేరుగా ఇంట్లోకీ భోజనాల దగ్గరకీ రావటం. అయినా

అమ్మాయ్! కాన్పులు చేసీ కడుపులు తీసీ అంటూ ముట్టూ అనకుండా ఏమిటే నువ్వె లగబెట్టే సంపాదన! అబ్బాయెటూ ఉద్యోగం చేస్తున్నాడుగా. నువ్వు ఇంటిపట్టునుండు. నువ్వా డాక్టరుపని మానుకోకపోతే చస్తే నేనీఇంట్లో ఉండలేను" అన్నారు భువనేశ్వరీ దేవి కోపంగా.

మిథిల నవ్వింది తప్ప మాట్లాడలేదు.

భోజనాలు ముగించుకుని ఓ కునుకుతీసి లేచి చూసిన గోపీకృష్ణకు ఏదో అనుమానం వచ్చి మిథిలకు కబురుపెట్టాడు. ఇద్దరూ కలిసి వెతికినా ఎక్కడా భువనేశ్వరిదేవీ లేదు, ఆమె గుడ్డల మూటా లేదు.

అప్పుడే మార్కండేయులు మిథిలకు ఫోనుచేసి చెప్పాడు "అమ్మ ఇంటికి తిరిగివ చ్చింది" అని.

★ ★ ★

సాయంత్రం ఆరుగంటలు కావస్తోంది. గోపీకృష్ణ తనే స్వయంగా కారు నడుపు కుంటూ నెమ్మదిగా వెడుతోన్నాడు. నిజానికి అతనికి ఏ గమ్యమూ లేదు.

భువనేశ్వరిదేవి ఆరోజు మధ్యాహ్నం భోజనాల వేళప్పుడు కిరణ్మయిని గురించి మాట్లాడిన క్షణంనించే అతని ఆలోచనలు పరిపరివిధాల పోసాగాయి. ఆమె జ్ఞాపకాలే మనసులో తెములోన్నాయి.

కిరణ్మయి జీవితం అలాంటి మలుపు తిరి గిందంటే అందుకు కారణం తనేనన్న భావం అతడ్ని దహించివేస్తూ హృదయాం తరాళాల్లో ఎక్కడో నిద్రాణమై మేటవేసుకు పోయిన మానవత్వాన్ని తవ్వితీసి, తట్టి లేపి నట్లుంది.

గాఢంగా నిట్టూర్చేడు.

చాలాకాలం తర్వాత ఆ సంగీతం స్కూలూ, అక్కడ కిరణ్మయితో గడిపిన మధురక్షణాలూ, మధ్యలో అపశ్రుతిలా వెకి లినవ్వుతో పరాత్పరం పదేపదే అతడికి జ్ఞాపకం వస్తున్నాయి.

సంగీతం స్కూలుకు కొంచెం దూరంగా కారు ఆపి అద్దంలోంచి తదేకంగా స్కూలు వేపే చూస్తూ కూర్చున్నాడు.

ఐదు నిమిషాల తర్వాత స్కూల్లోంచి బయటికి వస్తూ కిరణ్మయి కనిపించింది. పక్కనే పరాత్పరం.

వెళ్ళి కిరణ్మయిని పలుకరించాలని మనసు ఆరాటపడుతోన్నా ఆ కోర్కెను నిగ్ర హించుకున్నాడు గోపీకృష్ణ, పక్కనే పరా త్పరం ఉన్నాడని సంశయిస్తూ.

పరాత్పరం కిరణ్మయి చెయ్యి పట్టుకుని నడుస్తున్నాడు.

ఇద్దరూ అటువేపే రావటం, పరాత్పరం కారులోకి తొంగిచూసి గోపీకృష్ణను గుర్తు పట్టటం "అన్నయ్యా బాగున్నావా?" అని పలుకరించటం అంతా క్షణంలో జరిగిపో యింది.

పరాత్పరంను గోపీకృష్ణ పట్టించుకోలేదు. గ్రహాంతరాళాల్లో ఎన్నడో తప్పిపోయిన నేస్తాన్ని యాధృచ్ఛికంగా భూమండలంమీదే చూసినంత అబ్బురంగా కిరణ్మయినే చూస్తో న్నాడు.

ఆమె ఎంతగా మారిపోయింది.

పోలికే లేదు. బాగా చిక్కిపోయింది. రంగు మారిపోయింది.

ముఖం మేఘాల వెనుక చిక్కుకున్న ఆషాఢమాసపు చంద్రుడికిమల్లే వాడిపోయి వుంది.

కళ్ళకింద నల్లటి వలయాలూ, ఆ వల యాలపైన బొరియల్లో ఎక్కడో మినుకు చుక్కల్లా మందంగా మెరుస్తోన్న ఎర్రటి కనుగుడ్లూ, రక్తహీనతతో తెల్లగా పాలిపో యిన శరీరం!

చేతిలో కూరలసంచీ...

"బాగున్నావా కిరణ్మయీ?" గొంతు పెగ ల్చుకుని అడిగేడు గోపీకృష్ణ.

తలెత్తి అతనివేపొకసారి అదోలా చూసింది. ఠక్కున తలదించుకుంది. "వెళ్దాం పద" అని పరాత్పరం వెంట

మౌనంగా వెళ్ళిపోయింది.

ఆవిధంగా గోపీకృష్ణను శిక్షించింది నేర్పుగా.

ఆగ్రహంతో రెచ్చిపోయి కసిదీరా తిట్టినా, వెళ్ళేముందు తలెత్తి అలా చూడకపోయినా ఆమె అతడ్ని అంతగా శిక్షించగల్గేది కాదేమో.

ఆమె మౌనం ఆ కళ్లలో తొలికిన విషాదం ఎంతటి కఠినశిక్షో అతనికి.

అలసిపోయేంతదాకా ఆవేదన చెందాడు గోపీకృష్ణ.

భౌతికపరమైన కోర్కెలను తీర్చుకుంటూ వాటిని నైతికపరమైన ఆలోచనలతో ముడి పెట్టకుండా స్పందనలకు అతీతంగా గడిచే బతుకుల్లో ఆవేదనకు చోటుండదు. కాంక్ష-నీతి, స్వార్థం- సామాజిక స్పృహ, తెగింపు-సంఘభయం ఇత్యాది పరస్పర విరుద్ధమైన ధోరణులన్నీ కలగాపులగంగా కుదురుకున్న ప్పుడే ఒక భావోద్రేకంలో చేసినపని అనం తరం అంతులేని ఆవేదన పెడుతుంది.

అదే కర్మఫలం అయితే గోపీకృష్ణను ఎలా తీర్చిదిద్దుతుందో అది.

ఆ రాత్రి గోపీకృష్ణకు బాగా జ్వరం వచ్చింది. ముసుగుతన్ని పడుకున్నాడు. మిథిల కూడా గమనించలేదు. తెల్లవారుజా మున ఎప్పుడో అతను కలువరిస్తోంటే విన్నది మిథిల, "కిరణ్మయీ, నీకు ద్రోహం చేశాను... క్షమించవూ..." అంటున్నాడు గోపీకృష్ణ.

మిథిల నిర్ఘాంతపోయింది. ఆమె గుండెలో బాంబు బద్దలైంది. తట్టిలేపి, గోపీ కృష్ణతో మందుబిళ్ళ మింగించింది. పది నిముషాల్లో జ్వరం తగ్గింది. కొత్తరోజున కొత్త అనుభవాలను ప్రోది చేసుకొమ్మంటూ ఎక్కడో తొలికోడి కూసింది.

తన సంశయాన్ని తొలగించుకుందుకు అతడ్ని నిలదీసి కలవరింతల విషయం అడిగింది ఆత్రంగా.

కొన్ని సందర్భాల్లో ధైర్యం చేసేందుకు ఆపదలు చాలా ప్రయోజనపడతాయి. జ్వర భావం అప్పుడు గోపీకృష్ణకు సహకరిం చింది. సంకోచం లేకుండా కిరణ్మయికి తను చేసిన ద్రోహాన్ని విడమరిచి చెప్పి, గుండెబ రువు దించుకున్నాడు.

అంతా విన్న మిథిల నిస్త్రాణగా కూర్చుంది. ఆమె నోటివెంట మాటలు పెగిలి రావటంలేదు. క్రమంగా ఆమె మెదడు రాక్షసుల కర్మాగారం కాసాగింది.

ఎక్కడో పెనుగాలిలో సుళ్ళుపడుతూ కిర ణ్మయి ఆలాపిస్తూన్న ఆర్తిగీతం ఆమె చెవుల్లో గింగురుమంటోంది. గుండె గుండెలో ఆమనిలా అభిమానం నింపుకున్న ఓ కెరటం ఎగరాలనీ, స్వాంతనపరిచి కన్నీళ్లు తుడిచే ఓ అమృతహస్తం తనకేసి చాచాలనీ... ఆర్థిస్తోన్నట్లుందది.

ఎంత నిర్దయ!

"అయిందేదో అయింది. అయిందానికి బాధపడి ఏం ప్రయోజనం? ఎటూ దాని జీవితం ఆ ఈశ్వరుడు కూడా బాగుచెయ్య లేనంతగా ఊబిలో కూరుకునిపోయింది. వ్యసనాలకు బానిస అయింది. దాన్నిప్పుడు గుర్తుచేసుకుని పండంటి మన కాపురంలో విషాదం నింపుకోవటం విజ్ఞత కాదు" అంది గోపీకృష్ణతో మిథిల.

అతడి ముఖంలో కాంతిలేదు. న్యూనతా భావంతో కుంగిపోతూ ఆమెవేపు దీనంగా చూశాడు.

"ఏం చెయ్యను మిథిలా! కిరణ్మయి నాకు పదేపదే జ్ఞాపకం వస్తోంది. మర్చిపోలేకపో తున్నాను" అన్నాడు జాలిగా.

"తప్పదు, మర్చిపోవాలి" అంది మిథిల.

గోపీకృష్ణ తాత్వికంగా నవ్వారుకున్నాడు. 'అంత శక్తే నాకు వుంటే నిద్రలో కూడా ఆమెను ఎందుకు కలువరిస్తాను?' అనుకు న్నాడు మనసులోనే.

★ ★ ★

కిరణ్మయి ఆరోగ్యం రోజురోజుకూ దిగజా





రిపోతోంది.

నల్లమందు అలవాటునించి బయటపడా లని చాలాసార్లు ప్రయత్నించింది కానీ సాధ్యపళ్ళేదు. రోజూ ముప్పొద్దులా నల్ల మందు కూరిన అరటిపళ్లు తినకపోతే శరీరం స్వాధీనం తప్పుతోంది. కాళ్లూ, చేతులూ వొణుకుతున్నాయి. ఒకటే నీరసం, నిస్సత్తువ! అప్పుడప్పుడూ స్పృహ కోల్పో తోంది కూడా.

అలా తను శిధిలమై త్వరగా మృత్యు వును చేరుకుంటున్నందుకు ఒకవిధంగా ఆమెకు ఆనందంగానే వున్నా ఆ అలవాటు వల్ల అవుతోన్న అదనపు ఖర్చు ఆమెను భయపెడుతోంది. పరాత్పరంకు వస్తోన్న డబ్బు ఇంటి ఖర్చులకే సరిపోతుంది. అలాంటప్పుడిక బాకీలు తీరేదెలా?

తనకు ఇవ్వాల్సిన ఐదువేల రూపాయల కోసం ఆమధ్య సవతి భార్య గూడెంవాళ్లతో వచ్చి చాలా రభసచేసి వెళ్ళింది. కిరణ్మయికి ఎంతో అవమానంగా తోచింది.

ఆ బాకీ విషయంలో పరాత్పరం ఓ పథకం వేశాడు. 'చింతామణి' టిక్కెట్టు డ్రామా పెడితే ఆర్టిస్టులకు ఇచ్చేదిపోను తప్పకుండా కాస్తో కూస్తో డబ్బు మిగు ల్తుంది. టిక్కెట్టు డ్రామాలు ఆడించటంలో అనుభవం కూడా వుంది కనుక ధైర్యం చేశాడు.

చింతామణి డ్రామా ట్రూపువాళ్లు పరాత్ప రంకు పాతపరిచయస్తులే. ఎడ్వాన్సు లేకుం డానే వచ్చి డ్రామా ఆడ్తామన్నారు.

ఇకపోతే, హాలుకూ, టిక్కెట్లూ, కరప త్రాలూ అచ్చు వేయించేందుకూ, ప్రచారానికీ కొంత డబ్బుంటే చాలు!

నెమ్మదిగా వచ్చి కిరణ్మయి పక్కనే కూర్చుని జరిగిందంతా చెప్పాడు పరాత్పరం కిరణ్మయితో

కిరణ్మయి మౌనంగా వింటోంది, మత్తులో జోగుతూ.

"అందువల్ల మనం అప్పుల గండంనించి అర్జంటుగా బయట పడకపోతే ప్రమాదం. నీ చెవులవీ, ముక్కులవీ ఇచ్చావంటే వాట్ని అమ్మి డ్రామా టిక్కెట్లు అచ్చు వేయిస్తాను. హాలుకు అడ్వాన్సు ఇస్తాను. బాగా ప్రచారం చేసి టిక్కెట్లు అమ్ముతాను. అప్పుడు మనకు బోలెడు డబ్బొస్తుంది. ఆ రాక్షసి బాకీ, ఇంకా చిల్లరమల్లర అప్పులూ తీర్చు కుందాం. మిగిలిందాంతో నీకు సొమ్ములు చేయిస్తాను" అన్నాడు పరాత్పరం, ఆమె చేతిలో అరిటిపండొకటి పెడుతూ.

కిరణ్మయి ఒక్కమాట కూడా మాట్లాడ లేదు. నిర్వికారంగా తన వొంటిమీంచి వస్తు వులను తీసి పరాత్పరానికిచ్చింది.

అతను ఆనందంగా బజారుకూ, కిర ణ్మయి తిరిగి తన లోకంలోకీ వెళ్ళిపో యారు.

అది జరిగిన రెండోరోజే పరాత్పరం చెవిన పిడుగులాంటి వార్త పడింది. తను మాట్లాడుకున్న డ్రామా ట్రూపులో చింతా మణి వేషంకట్టే మరియమ్మ రెండో ఆట సినిమాకి వెళ్ళివస్తూ గడ్డిలారీ వెనుక టైరు కింద పడ్డదిట. ప్రాణానికేం ప్రమాదంలేదు కానీ కుడికాల్ను మాత్రం తీసేస్తారట.

అప్పటికే పరాత్పరం కరపత్రాలు జనం లోకి పంపించేడు. టిక్కెట్లూ అచ్చు వేయిం చాడు. హాలుకు ఎడ్వాన్సూ ఇచ్చేడు. ఇప్పు డెలా?

నాటక ప్రదర్శనకు కేవలం పదిహేను రోజుల వ్యవధి మాత్రమే వుంది. ఈలోగా ఆ చింతామణి మంచంమీంచి లేవలేదు. కళాభిమానంతో ఒకవేళ మొండికిపడి లేచినా కుంటిచింతామణిని జనం హర్షిం చదు. కోపంతో రెచ్చిపోయి ఎవడు కూర్చున్న కుర్చీని వాడు పట్టుకుపోయినా చెయ్యగల్గేదేం లేదు.

బాగా ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చాడు పరాత్పరం.

కిరణ్మయికి వాక్శుద్ధి బాగావుంది. గాత్రం,



అభినయం కూడా అద్భుతం! చదువుకున్న పిల్లే కనుక పోర్షన్ కంఠస్తం చేయించి ఒకటో, రెండో రిహార్సల్సుతో ఆమెచేత చింతామణి పాత్రను పండించటం కష్టమేం కాదు అనుకున్నాడు పరాత్పరం.

మెరుపులా మరో ఆలోచన కూడా వచ్చింది.

ఆ పాత్రలో చెల్లాయి నటించటం చూసి మార్కండేయులు కుటుంబగౌరవం గుర్తొచ్చి ఆత్మహత్య చేసుకున్నా ఆశ్చర్యం లేదు. అలా జరిగితే మరీ మంచిది!

కిరణ్మయి పక్కనే కూర్చుని ఆప్యాయంగా రెండు అరటిపండ్లు స్వహస్తాలతో తిని పించి, వొచ్చిన ఆపదను వివరంగా చెప్పి, ఆమె నొచ్చుకున్న తర్వాత తన నిర్ణయం కూడా చెప్పి- సవతినోసారి కిరణ్మయికి జ్ఞాపకం చేశాడు పరాత్పరం.

కిరణ్మయి అందుకు పెద్దగా అభ్యంత రమేం చెప్పలేదు. పాత్రపోషణ విషయంలో కొన్ని అనుమానాలు వస్తే అడిగి నివృత్తి చేసుకుంది. చింతామణిగా స్టేజిమీద నటిం చబోవటం ఆమెకూ సంతోషంగా వుంది.

ఈ విషయం తెలిసి అటు అన్నయ్యా, ఇటూ గోపీకృష్ణా కుమిలిపోవాలి. వాళ్ళు తనకు చేసిన ద్రోహానికి తను అలా ప్రతీ కారం తీర్చుకోవచ్చు అనుకుంది మనసు లోనే!

ఆరోజునించే కిరణ్మయిని 'విధి'లో ప్రవేశ పెట్టాడు పరాత్పరం. ఆమె దీక్షగా చింతా మణి పాత్రను ఔపోశనపడుతోంది...

ప్రచారం ముమ్మరంగా చేస్తున్నాడు పరా త్పరం. రిక్షాలో కూర్చొని తనే స్వయంగా మైకులో చింతామణి నాటక ప్రదర్శన గురించి వీధి వీధినా చెప్తూ విశ్రాంతి లేకుండా తిరుగుతున్నాడు.

"పట్టణ ప్రముఖుడు మార్కండేయులు గారి సోదరి కిరణ్మయి చింతామణిగా నటిం చబోతోన్న గొప్ప నాటక ప్రదర్శన! రేట్లు.





అంటూ పట్టణం హోరెత్తిపోతోంది.

నాటకం ప్రదర్శించే రోజు రానేవచ్చింది.

పరాత్పరం కావాలని మార్కండేయు లుకూ, గోపీకృష్ణకూ ఫ్రీ పాసులూ, కరప త్రాలూ పనిగట్టుకుని మరీ పంపించాడు.

నాటకం ప్రదర్శన మొదలైంది.

అనుకున్నంతగా టిక్కెట్లు అమ్ముడుపోక పోయినా ప్రదర్శన ఖర్చులకూ, భార్య బాకీలో కొంత తీర్చేందుకూ సరిపడా డబ్బు వొచ్చింది.

ప్రదర్శన బాగా రక్తి కట్టింది. ముందు వరసలోనే కూర్చొని నాటకం మొత్తం ఎంతో ఆసక్తిగా చూస్తున్నాడు మార్కండే యులు.

పరాత్పరం మార్కండేయుల్ని ముందు గానే చూసినా నాటకం పూర్తయింతర్వాత మాత్రమే దగ్గరికి వెళ్ళి పలుకరించేడు.

"బావగారూ... ఎలావుంది నాటకం? కిరణ్మయి చింతామణిగా చాలా బాగా నటించిందికదూ? " అని అడిగేడు నవ్వుతూ.

"నాకు కళలంటే కేవలం అభిమానమే కాదు, ప్రవేశం కూడా వుంది. చింతామణిగా కిరణ్మయి చాలా బాగా నటించింది. నట నకు మాత్రమే పరిమితం చెయ్యండి పరా త్పరంగారూ... అది మీకే గౌరవం!" అని వెళ్ళిపోయాడు మార్కండేయులు.

పరాత్పరం కసిగా నేలను తన్నాడు. రెండుపట్లు నశ్యం పీల్చి పళ్లు కొరుకుతూ అక్కడే నించున్నాడు.

కిరణ్మయి మేకప్ చెరుపుకుని మామూలు బట్టలు కట్టుకుని మేకప్ గదిలోంచి బయ టికి వచ్చింది. పరాత్పరంకోసం చుట్టూ చూసింది.

"కిరణ్మయీ..." పిల్చేడు గోపీకృష్ణ క్రీనీడ లోంచి వెలుతుర్లోకి వస్తూ ఆర్ద్రంగా.

గోపీకృష్ణను చూసి కిరణ్మయి ఆశ్చర్యపో యింది.

గడ్డాలు, మీసాలూ పెరిగి గోపీకృష్ణ చాలా భయంకరంగా వున్నాడు.

మాసిపోయిన బట్టలూ, దైన్యం నిండిన కళ్లూ... ఎన్నాళ్లనుంచో జ్వరంతో తీసుకుంటోన్న రోగిలా కనిపించేడు.

ఆమె మౌనంగా చూస్తూ నుంచుంది.

"ఇంకా నామీద కోపం పోలేదుకదూ? " అడిగేడు దీనంగా.

ఆమె మౌనంగా ఏడుస్తోంది.

"స్వాప్నిక దశలాంటి స్థితిలో జరిగిన పొరపాటుకు జీవితాంతం నువ్వూ నేనూ ఇలా బాధపడాల్సిందేనా కిరణ్మయీ? " అడిగేడు గోపీకృష్ణ.

అతనితో ఎన్నో యుగాల మౌనం తర్వాత కిరణ్మయి పెదవి విప్పింది.

"నువ్వూ బాధపడుతున్నావా? " అని అడిగింది సూటిగా.

అతను బేలగా ఆమెవేపు చూశాడు. "బాధపడేందుక్కూడా అర్హుణ్ని కాదంటావా కిరణ్మయీ? నిజమే, పొరపాటు చేశాను. నిర్భయంగా అందరిముందూ నేను కిరణ్మయిని పెళ్లి చేసుకుంటాను అని అనలేకపోయాను. ఈలోగా నావల్ల మరో పొరపాటు జరిగింది..."

"అక్కయ్యను పెళ్లి చేసుకోవటమేగా! ఇంకేం మీరు సుఖంగా వుండండి. నేనేదో చితికిపోతున్నాననీ, జీవితాన్ని చేతులారా నాశనం చేసుకుంటున్నాననీ నాకోసం ఆవేదనపడకండి. నేను నా బాధల్ని భరించగలను కానీ మీ సానుభూతిని మాత్రం భరించలేను..." అంది కిరణ్మయి.

"మర్చిపొమ్మని ఎంత తేలిగ్గా చెప్పావు కిరణ్మయీ! కానీ మర్చిపోవాలన్నా, గుర్తుంచుకోవాలన్నా రెండూ నా చేతుల్లో లేవు. ఒక దశలో నువ్వంటూ ఒకర్తెవీ భూమ్మీద వున్నట్టే మర్చిపోగల్గేను. అందుకు ఎవరి సలహా లేదు. అభ్యర్థనా లేదు. అలాంటి నేనిప్పుడు అనుక్షణం నీ జ్ఞాపకాలతో వేగిపోతూ నిన్నే కలవరిస్తున్నాను. పరితపిస్తున్నాను. పర్యవసానాలూ, సంఘభయం, బిడియం, వేటినీ ఖాతరు చేసేదశలో నేనిప్పుడు లేను..."

"సానుభూతి కామోసు" వ్యంగ్యంగా అంది కిరణ్మయి.

"కాదు కిరణ్మయీ కాదు"

"జాలా? "

"కాదు!"

"ప్రేమా? "

"ఏమో!"

"అప్పటిదాకా చలనం ఎరుగని నా స్త్రీత్వాన్ని చలింపచేసి, సర్వస్వం నేనేననీ, నేను మినహా జీవితం లేదనీ- ఆరాధన్నూ, ప్రేమనూ నటించి ఎంగిలిచేసి మరీ వెళ్ళావ్. మర్చిపోయావ్. అలాంటిదిప్పుడు మళ్ళీ నేనెందుకు గుర్తొస్తున్నాను? "

"అది మనసు చేస్తోన్న గారడీ!"

"ఆ గారడీకి తలొగ్గి జీవితం అనే తీగె మీద నేనెందుకు నడవాలి? నీకు వినోదాన్నిచ్చి నేనెందుకు ప్రమాదాన్ని ఆహ్వానించాలి? "

"ఆనాడు నిన్ను మర్చిపోయిన నా చిత్తప్రవృత్తికి నీ ఆగ్రహానికి గురయిన నేనిప్పుడు నీ కోసం పరితపిస్తుంటే అనుగ్రహానికి అర్హుణ్ణి కాలేనంటావా? "

"ఆగ్రహాన్నికైనా, అనుగ్రహాన్నికైనా చిత్తప్రవృత్తిమీద బాధ్యత నెట్టి నిర్దోషిత్వానికి అదే రుజువంటే కనికరించేందుకు నా చిత్తప్రవృత్తి మాత్రం అంగీకరించవద్దూ? "

"నీ కాఠిన్యం కోరే మూల్యం ఏంటో తెలుసా...నా జీవితం"

కిరణ్మయి పెద్దగా ఏడుస్తూ దూరంగా వెళ్ళిపోయింది.

పరాత్పరం ఎదురొచ్చి కిరణ్మయి చెయ్యిపట్టుకుని నడిపించాడు.

ఆ ఇద్దరూ కనుమరుగై వెళ్ళిపోయేదాకా అలాగే చూస్తూ నించున్నాడు గోపీకృష్ణ.

అతడి కళ్ళవెంట ధారాపాతంగా కన్నీళ్లు కారుతున్నాయి.

★ ★ ★



అర్ధరాత్రి కావస్తున్నా గోపీకృష్ణ ఇంటికి రాలేదు.

అతని కోసమే ఎదురుచూస్తోన్న మిథిల ఇంకా భోజనం చెయ్యలేదు. చిన్న అలికిడైనా గోపీకృష్ణ వచ్చాడన్నంత ఆత్రంగా చూస్తూ కూర్చుంది.

నిజానికి ఆ ఇంట్లో వృత్తిపరమైన ఇబ్బందుల దృష్ట్యా భార్యాభర్తలిద్దరూ కలిసే భోజనం చెయ్యాలన్న నిబంధనలేం లేవు. అవకాశం చిక్కినప్పుడు సరేకానీ అందు కోసం వాళ్లు వెంపర్లాడరు.

అలాంటిది ఈరోజు మిథిల భోజనం కూడా చెయ్యకుండా అతని కోసం ఎదురు చూస్తోందంటే అందుకు బలమైన కారణమే వుంది.

పరాత్పరం పోస్టులో పంపించిన డ్రామా కరపత్రం, ఫ్రీపాసూ మిథిల కూడా చూసింది. కానీ గోపీకృష్ణను పరీక్షించేందుకు ఏమీ తెలియనట్టే వుంది.

గోపీకృష్ణ ఇంటికి రావటం ఇంత ఆలస్యమైందంటే అతను చింతామణి నాటకానికి వెళ్లివుంటాడన్న నిర్ణయానికి వచ్చింది.

దాంతో ఆమె పూర్తిగా సహనం కోల్పోయింది.

సరిగ్గా అప్పుడే తలుపు తెరుచుకుని లోపలికి వచ్చాడు గోపీకృష్ణ.

"ఇంత ఆలస్యమైందేం? " అడిగింది మిథిల.

"ఆలస్యమైంది!"

"అదే... ఎందుకూ అంట? "

"బయల్దేరటం లేటయింది"

"త్వరగా బయల్దేరకపోయేరా? "

"బయల్దేర్దాం అనుకోవటం ఆలస్యమైంది"

ఎన్నడూ తన మాటలకు ఎదురు చెప్పని గోపీకృష్ణ అలా పెడసరంగా సమాధానం చెప్పటంతో మిథిలకు ఏంచెయ్యాలో పాలు పోలేదు.

"ఇదంతా సుబ్బిసెట్టి డైలాగుల చాతుర్యమా? " అంది కొరకొరా చూస్తూ.

ఆ మాటతో తను నాటకానికి వెళ్ళిన విషయం ఆమెకు తెలిసిపోయిందని అతడికి అర్ధమయింది. మౌనంగా వెళ్ళి బట్టలు మార్చుకుని నిశ్శబ్దంగా మంచంమీద వాలేడు.

మిథిల విసురుగా నడుస్తూ మంచం దగ్గరికి వచ్చింది. " భోజనం చెయ్యరా? " అని అడిగింది.

"ఆకలిగా లేదు" అన్నాడు గోపీకృష్ణ.

"చింతామణిని చూసి కడుపు నిండిందా? "

"లేదు... దహించుకుపోయింది? "

"అది కన్నీళ్ళతో చల్లార్చలేదా? "

"తన గుండె మంటలార్పుకునేందుకే ఆమె కన్నీళ్ళు ఆమెకు చాలటంలేదు. అయినా మిథిలా! ఎందుకంత నిర్దయగా ప్రవర్తిస్తావు? పైగా కిరణ్మయి ఎవరోకాదు, నీ సొంత చెల్లాయి" మంచంమీంచి లేచి కూర్చుని అన్నాడు గోపీకృష్ణ.

మిథిల శూన్యంలోకి చూసింది. గమ్యంచేరని వలసపక్షి మార్గమధ్యంలో ఆగి అలుపు తీర్చుకుని వెళ్లినట్టు, క్షణంసేపు కిరణ్మయి ఆమె అంతరంగంలో మెదిలి అంతలోనే అదృశ్యమైంది. తన ప్రస్థానంలో వేగనిరోధకాలుగా మిగిలే కనీస మానవ సంబంధాలను కూడా హర్షించేదశలో మిథిల లేదు. అలాంటప్పుడు కిరణ్మయిపట్ల జాలి అన్న చిన్న బలహీనతకు లొంగినా ఆ చిన్న బలహీనతే ఆమె జీవితధ్యేయాన్ని తారుమారు చేసి సాలీడులా పొందిగ్గా కుదుర్చుకుంటోన్న తన సంసారాన్ని ఛిద్రం చెయ్యకతప్పదు. అందుకే మిథిల ఆ బలహీనతకు లొంగలేదు. అలా లొంగితే ఆమె మిథిలే కాదు.

"ఇకపైన నా ఇంట్లో కిరణ్మయి పేరు కూడా వినిపించే వీలులేదు. ప్లీజ్... నన్ను క్షోభపెట్టకండి" అంది మిథిల అభ్యర్థనా, ఆదేశం రెండూ మిళితమైన గొంతుతో.





"సరే... నీ ఇంట్లో వినిపించదులే" అని ముసుగుదన్నిపడుకున్నాడు గోపీకృష్ణ.

మిథిల అంతటితో అతడ్ని విడిచిపెట్ట లేదు. దగ్గరికి వెళ్ళి దుప్పటినిలాగి దూరంగా విసిరేసింది. "నీ కోసం భోజనం కూడా చెయ్యకుండా ఎదురుచూస్తూ కూర్చు న్నాను. కనీసం నన్ను భోంచేశావా? అని కూడా అడగలేదుకదూ? " అంది.

"అలా అడిగినా మాత్రం నువ్వేం ఆనంద పడగలవు మిథిలా... నేను కిరణ్మయి దగ్గ రికి వెళ్ళానని నువ్వు గ్రహించావుగా..." అన్నాడు గోపీకృష్ణ.

మిథిల మంచంమీంచి దిండ్లను తీసి దూరంగా విసిరేస్తూ, " కిరణ్మయీ... కిర ణ్మయీ అంటూ ఎప్పుడూ ఆ ధ్యానమే అయితే మన దాంపత్యానికి అర్థం ఏమిటి? దాని విషయంలో నాకు మాత్రం బాధలేదం టావా? అయినా తమాయించుకోవటం లేదూ! విద్యుద్ఘాతంతో విలవిల్లాడుతోన్న వ్యక్తిని రక్షించేందుకు పట్టుకుంటే అది ప్రేమకాదు, అజ్ఞానమౌతుంది. ఆ అజ్ఞానా నికి ఫలితంగా మనం కూడా బలికావల సిందే..."

"సంయమనంతో మెయిన్ ఆఫ్ చేయాలంటావ్. అలా చేస్తే ఆరిపోయేవి నీ ఇంటి దీపాలే" అన్నాడు గోపీకృష్ణ గూఢా ర్థంగా.

మిథిల సహనం పూర్తిగా నశించిపో యింది. రక్తం చిమ్ముతోన్న కళ్ళతో అతడ్ని చూస్తూ, "నీ జీవితానికి ఒక ధ్యేయం అంటూలేదు. అందుకే నువ్వు ఒక దశలో కిరణ్మయిని కోరుకున్నావ్. ఆ కోర్కెపట్ల కూడా నీకో అవగాహనలేదు. ఆమెతో కేవలం అనుభవాన్నే కోరావో, వివాహబం ధాన్నే కోరావో! సందర్భం కలిసివచ్చింది కనుక అనుభవించావ్. లేకుంటే నువ్వం దుకూ ధైర్యం చెయ్యగల్గేవాడివి కావు. మొదట్లో నాపట్ల నీకు ఆ రెండు అభిప్రా యాలూ లేవు. కానీ నువ్వు అవకాశం వరించి నన్ను అనుభవించావేకానీ నన్ను వరించిమాత్రం కాదు. అన్నయ్య మన ఇద్దరి అనుభవానికి ప్రత్యక్ష సాక్షి కనుక ఆ సాక్షి అభ్యర్థనను ఆదేశంగా భావించి నన్ను పెళ్ళి చేసుకున్నావ్. అలా మర్యాదస్తుల చిట్టాలోనే మిగిలిపోయేవు. మళ్ళీ ఇన్నా ళ్ళకు కిరణ్మయిని ధ్యానిస్తున్నావ్. ఆ ధ్యానం వెనుకగల నీ భవిష్యత్ప్రణాళిక ఏమిటో చెప్పగలవా? "

గోపీకృష్ణ నిర్విణ్ణుడై వింటున్నాడు...

"ఊ... మాటల్ని పెగిల్చి గొంతులోంచి వెలువడనీ... నీ ప్రణాళిక ఏంటి? పరాత్ప రాన్నీ, కిరణ్మయినీ విడదీస్తావా? కిరణ్మ యిని మళ్ళీ పెళ్ళి చేసుకుంటావా? నాకు విడాకులిస్తావా? మమ్మల్నిద్దర్నీ నీ భార్య లుగా ఒకే నీడకింద కాపురం చెయ్యమం టావా? ముందుగా కిరణ్మయి శీలాన్నే దోచుకున్నావు కనుక ఆమె జీవితంమీదా, భౌతిక శరీరంమీదా హక్కులన్నీ నీవేనని సంఘంముందు గర్జిస్తావా? కమాన్ స్పీకౌ వుట్..." పెద్దగా అరుస్తూ గోపీకృష్ణ భుజాల్ని రెండు చేతులతో పట్టుకుని బలంగా కుదిపివేసింది మిథిల.

ఆ స్పర్శతో ఆమె కోపం చప్పున చల్లారి పోయింది. జ్వరంతో అతడి శరీరం కుంపట్లా కాల్తోంది.

దూరంగా విసిరికొట్టిన దుప్పట్ని తెచ్చి గోపీకృష్ణ గుండెవరకు కప్పి మిథిల వంటగ దిలోకి వెళ్ళి స్టౌ అంటించి సిరంజి బాయి ల్‌చేసి తెచ్చింది. ఏదో యాంపిల్ను బ్రేక్ చేసి మందును సిరంజిలోకి ఎక్కించింది.

గోపీకృష్ణకు ఇంజక్షన్ చేసేందుకు అతడి మీదకి వొంగింది.

"కిరణ్మయీ... కిరణ్మయీ..." అంటూ చిన్నగా కలువరిస్తున్నాడు గోపీకృష్ణ.

అంతే...

చప్పున పైకిలేచి దూరంగా వెళ్ళి కిటికీ గుండా సిరంజిని కసిగా బయటికి విసిరేసి



సోఫాలో కూలబడి వెక్కివెక్కి ఏడవసాగింది.



కిరణ్మయి, పరాత్పరం కలిసి ఇంటికి వెళ్ళగానే పరాత్పరంకు మాత్రం భోజనం పెట్టి తను తర్వాత తింటానని చెప్పింది కిరణ్మయి.

నాటకం జయప్రదం కావటం, కాస్తో కూస్తో డబ్బు మిగలటంతో పరాత్పరంకు మహదానందంగా వుంది. మంచంమీద మేను వాలుస్తూ నల్లమందు కూరిన అరటి పండ్లు సంచీలోనే వున్నాయని కిరణ్మయికి చెప్పి పరాత్పరం నెమ్మదిగా మగత నిద్రలోకి వెళ్ళేడు.

ఐదు నిముషాల తర్వాత కిరణ్మయి గోడకు వేలాడ్తోన్న సంచి తీసుకుని గుడిసె బయటికి వెళ్లింది. ఆరుబయట వెన్నెల్లో చాప పరుచుకుని కూర్చుంది.

గోపీకృష్ణ ఇందాక పలుకరించిన దగ్గర్నించి ఆమె గుండెలోంచి దుఃఖం తెరలుతెరలుగా పొంగుతోంది. అయినా తనివితీరా ఏడ్చే అవకాశం ఆమెకు ఇప్పుడు మాత్రమే కల్గింది.

నెమ్మదిగా ఒక్కో అరటిపండే తీసి తింటోంది కిరణ్మయి, ఒకవేపు మౌనంగా ఏడుస్తూనే.

క్రమంగా మగత...

ఆవహిస్తోన్న ఏదోశాంతి...

చాపమీదికి జారి వెల్లకిలా పడుకుని ఆకాశంలో తేలిపోతున్న తెలిమబ్బుల్ని చూస్తోంది.

చుక్కలకు చక్కిలిగింతలు పెడుతూ వెడుతోన్న నిండు చంద్రుడు...

"బావా... గోపీకృష్ణా..." కలువరిస్తోంది. కిరణ్మయి.

నవ్వుతూ, అంతలోనే ఏడుస్తూ, మళ్ళీ నవ్వుతూ, మళ్ళీ మళ్ళీ ఏడుస్తూ...

శ్మశానంలో నక్కలు శోకాలు పెడుతున్నాయి.

ఉలిక్కిపడి నిద్రలేచేడు పరాత్పరం.

కిరణ్మయి కనిపించలేదు.

కాల్తో తడికె తలుపు తన్ని ఒక్క ఉదుట్న బయటికి గెంతి చూసేడు.

కిరణ్మయి ఆ వెన్నెల్లో చాపమీద వెల్లికిలా పడుకుని కనిపించింది.

తట్టి లేపేడు.

ఆమెలో చలనంలేదు.

ముక్కుదగ్గర వేలుపెట్టి చూసేడు. శ్వాస ఆడుతూనే ఉంది.

చెంపల్ని దోసిట్లోకి తీసుకుని ముఖంవేపు చూసేడు. వాడిపోయి కొడిగట్టిన దీపంలా వుంది. చేతులకు ఏదో జిగట. ఆమె నురుగులు కక్కుతోంది.

ఖాళీ అయిన అరటిపండ్ల సంచీని చూసింతర్వాతగాని పరాత్పరంకు ఆమె అలా ఎందుకు స్పృహ కోల్పోయిందో అర్థం కాలేదు. అయినా ఒక్కక్షణం ఆలోచించాడు.

ఆ స్థితిలో కిరణ్మయికి జరగరానిదేదైనా జరిగితే అపవాదు తనమీదికి వస్తుంది. అగ్రవర్ణాలవారి పిల్లను చేరదీసి అర్థాంతరంగా చంపేడని అందరూ ఆడిపోసుకోవచ్చు

అతని మెదడు వేగంగా పనిచేసింది. సంధించి విడిచిన బాణంలా రోడ్డుమీంచి పరుగు పరుగున వెళ్ళేడు. దూరంగా వున్న





టెలిఫోన్ దగ్గరికి వెళ్ళి మార్కండేయులు నెంబరుకు డయల్ చేసేడు.

"హలో... మార్కండేయులు..." అన్నాడు ఫోన్లో మార్కండేయులు.

"బావగారూ... నేనూ, పరాత్పరంను. ఉన్నట్టుండి మీ చెల్లాయి ఆరోగ్యం పాడైపోయింది. స్పృహ తప్పి పడిపోయింది. నురుగులు కూడా కక్కుతోంది..."

"నాకెందుకు చెపుతున్నావ్, నేనేం డాక్టర్ని కాదుకదా"

"చెప్పాల్సిన బాధ్యత నాకుందిగా బావగారూ..."

"నువ్వు బాధ్యతల్ని సక్రమంగా నిర్వర్తించేవాడివే అయితే ముందుగా దాన్ని ఆస్పత్రిలో చేర్పించి ఆ తర్వాత ఫోన్ చేసేవాడివి..."

"అదిగాదు బావగారూ! ఆస్పత్రిలో చేర్పించే ఉద్దేశంలేదు. ఎందుకంటే... ఎందుకంటే..."

"డ్రగ్ ఎడిక్షన్ పర్యవసానమని డాక్టర్లు గుర్తిస్తారు. అదేకదూ నీ భయం? "

"అదే... అదే! భయం లేకుండా ఎలా వుంటుంది? అది మీకూ పరువు ప్రతిష్టల సమస్యేకదా"

మార్కండేయులు ఫోన్ పెట్టేశాడు. ఇంట్లోకి వెళ్ళేడు, ఒక్కో గదిలోకి తొంగి చూస్తూ.

భువనేశ్వరిదేవి తులసికోట దగ్గర కూర్చుని పిచ్చుకలకు బియ్యం వేస్తోంది.

ఆమె పక్కనే కింద కూర్చుంటూ "అమ్మా... ఇప్పుడే ఫోనొచ్చింది. కిరణ్మయి ఆరోగ్యం బాగా లేదట. స్పృహతప్పి పడిపోయింది" అని చెప్పాడు మార్కండేయులు.

భువనేశ్వరిదేవి నివ్వెరపోయింది. బియ్యం చాటను కిందపెట్టి "మరింకా అలా బెల్లం కొట్టిన రాయిలా కూర్చుంటావేంరా... త్వరగా కార్లోవెళ్ళి అమ్మాయిని..." అని ఆపైన మాట్లాడకుండా కొడుకువేపు దీనంగా చూసింది.

"అమ్మా... నాకలాంటి ప్రేమలు లేవు. నా హృదయం పాషాణమని నీక్కూడా తెలుసు. అయినా దత్తువెళ్ళి ఇంటి పేరు కూడా మార్చుకున్న నాకు కిరణ్మయి విషయంలో బాధ్యత ఎందుకుంటుంది? నువ్వు ఆమె కన్నతల్లివి కనుక బాధ్యత అంటూ ఉంటే నీకుంటుంది. ఆమె అనారోగ్యాన్ని గురించి వార్త నాకు తెలియగానే ఆ విషయం నీ చెవిన వెయ్యటంతో నా బాధ్యత తీరిపోయింది" అన్నాడు మార్కండేయులు.

"నిజమే! అంతకన్నా ఎక్కువ బాధ్యత నీకెందుకుంటుంది? " అన్నారు భువనేశ్వరిదేవి నిష్ఠూరంగా.

అప్పటికే దుఃఖం పెల్లుబుకుతోన్న ఛాయలు ఆమె ముఖంలో గోచరించాయి. అక్కడ మార్కండేయులు ఉన్నాడు కనుక ఆవేదనను నిగ్రహించుకుంది. కానీ అతను దూరంగా వెడితే భళ్ళున ఏడుస్తుందనటంలో సందేహంలేదు.

మార్కండేయులు లేచి నించొని "అమ్మా! ఆ విషయం అలా వుంచు. దాని విషయంలో నువ్వేం చెయ్యదలుచుకున్నావో, అది ఆలోచించు" అన్నాడు ఆమెవేపు చూడకుండానే.

"ఏదిఏమైనా నేను మాత్రం అమ్మాయి దగ్గరికి వెడతాను. కన్నకడుపురా ఇది!" అన్నారు భువనేశ్వరీదేవి గాద్గదికంగా.

"వెడతావా అమ్మా? వెళ్లు. అందుకు నా అభ్యంతరం ఏదీలేదు. కాకుంటే నువ్వేదో ఆవేశంలో అలా వెడతానంటున్నావు. కానీ అది ఆచరణ సాధ్యమా? ఆలోచించు. ఏదో చుట్టంచూపుగా వెళ్ళి రావటం కాదిది. వెడితే దాన్ని అంటిపెట్టుకుని ఉండాలి. ఆరోగ్యం కుదుటపడేదాకా వాళ్ళ ఇంట్లోనే ఉండాలి. నిత్యం నువ్వు ఆరాధించే దేవుళ్లూ. ప్రాణంకన్నా మిన్నగా చూసుకునే నిష్ఠా ఏమైపోతాయో ఆలోచించి మరీ వెళ్లు"

అన్నాడు మార్కండేయులు.

భువనేశ్వరీదేవి చిన్నగా ఏడుస్తోంది.

"సమస్యకు కన్నీళ్లే పరిష్కారమైతే అసలు సమస్యలే ఉత్పన్నం కావు. ఏడుపు మాని ఏం చెయ్యాలో ఆలోచించు"

అప్పుడు భువనేశ్వరీదేవి ఒక దృఢమైన నిర్ణయానికి వొచ్చినట్లుంది. "మార్కండేయా! కన్నబిడ్డ ఆపదలో అలమటిస్తోంటే ఆచారాలు, కులం, దేవుళ్లూ అంటూ మౌనంగా కూర్చోటం కన్నతల్లికి అసాధ్యం. తల్లీబిడ్డల అనుబంధానికి అడ్డునిలిచే ఏదైనా అది ప్రకృతి విరుద్ధమే. సృష్టికారకుడైన ఆ పరమాత్ముడు కూడా అలాంటి అమానుషత్వాన్ని అంగీకరించడు. పేగుబంధాన్ని కాదనే శ్రోత్రియం మంటల్లో కాలిపోనీ. నిప్పులతోపాటు బూడిద అవనీ. మైలపడిపోతే పడిపోనీ... అలా తేలిగ్గా మైలపడేది మహోన్నతమైంది ఎలా అవుతుంది? " అన్నారామె.

మార్కండేయులు ఆమెవేపు ఆశ్చర్యంగా చూశాడు.

"పేగుబంధం కనుక ప్రేమతో వెడుతున్నావా అమ్మా? "

"అవును!"

"నువ్వు వెళ్ళి దాన్ని అమితంగా ప్రేమించి అక్కున చేర్చుకుంటే దాని రోగం నయమౌతుందా? "

నిస్సహాయంగా చూసింది భువనేశ్వరీదేవి.

మార్కండేయులు తన గదిలోకి వెళ్ళి ఐదు నిముషాల్లోనే తిరిగి వచ్చేడు. భువనేశ్వరీదేవికి కొంత డబ్బు ఇచ్చి "నీ ఇష్టప్రకారమే వెళ్ళిరా అమ్మా. నీకు ఏది మంచిదని తోస్తే అలాగే చేయి" అన్నాడు గంభీరంగా..

భువనేశ్వరీదేవి ఎందుకో మార్కండేయులు కళ్లలోకి సంశయిస్తూ చూసి, "అబ్బాయ్, ఏదైనా తప్పనిసరైతే కిరణ్మయిని మన ఇంటికి తెస్తాను. అందుకు నీకేం అభ్యంతరం లేదుగా? " అని అడిగేరు.

"తల్లి స్థానంలో నువ్వు నా ఇంట్లో ఉంటున్నప్పుడు ఈ ఇల్లు నీది కూడా అవుతుంది. నీ అభిమతం ప్రకారం నువ్వు చేసే అవకాశం ఉన్నప్పుడు ఇలాంటివి నన్ను అడిగి చెయ్యాల్సిన అవసరంలేదు" అని మార్కండేయులు బయటికి వెళ్ళిపోయాడు.

భువనేశ్వరీదేవి బట్టలు సర్దుకుని బయల్దేరి వెళ్ళింది.

ఆమె వెళ్ళగానే మిధిల నెంబరుకు ఫోన్ చేశాడు మార్కండేయులు.

మిధిల ఫోనెత్తింది.

"అమ్మా, మిధిలా! నేను మార్కండేయుల్ని. గోపీకృష్ణ ఉన్నాడా? " అని అడిగేడు మార్కండేయులు.

"ఉన్నారన్నయ్యా. బాగా జ్వరమొచ్చి పడుకున్నారు. లేపమంటావా? "

"అర్జంటు పనేనమ్మా. బావతో మాట్లాడాలి"

"నాతో చెప్పకూడదా? సరే... ఆ విషయం అలా వుంచు. నేనే నీతో మాట్లాడాలనుకుంటున్నాను. అంతలోకి నువ్వే ఫోన్ చేశావు"

"ఏ విషయం? "

"బావ అర్థంలేని ఆలోచనలతో ఇల్లు నరకం చేస్తున్నాడు"

"కిరణ్మయి విషయంలోనేగా..."

"నీకెలా తెలుసు? " ఆశ్చర్యంగా అడిగింది మిధిల.

"తెలిసింది. నా అస్పష్టమైన అనుమానాలకు రాత్రి చింతామణి నాటకం దగ్గర జవాబు దొరికింది!"

"ఎలా? "

"బావ, కిరణ్మయి మాట్లాడుకుంటుంటే విన్నాను"

"నువ్వూ నాటకానికి వెళ్ళావా? "

"కిరణ్మయితో మాట్లాడే అవకాశం చిక్కుతుందని వెళ్ళాను. దాన్ని ఆస్పత్రిలో చేర్పించినప్పుడు మాట్లాడే వీలుపళ్లేదు. దాని ఇంటికి వెళ్ళి యోగక్షేమాలు విచారించే




ఆలోచన నాకులేదు..."

"బావతో ఇప్పుడు మాట్లాడేది కిరణ్మయి విషయమేనా? "

"అవును!"

"ప్రయోజనం? "

"అది చాలా ప్రమాదంలో వుంది"

"కిరణ్మయి ప్రమాదంలో వుంటే మాత్రం బావేం చెయ్యగలడు? "

"అది బావ నిర్ణయం! నాకు సంబంధం లేదు. కన్నది కనుక అమ్మ వెళ్తానంటే పంపించాను. అలాగే బావకూ చెప్తే నా బాధ్యత తీరిపోతుంది"

"అన్నయ్యా..." ఆర్ద్రంగా పిల్చింది మిథిల.

"చెప్పమ్మా..."

"కిరణ్మయిని కలువరిస్తూ బావ నిజంగా పిచ్చివాడైపోతున్నాడు. నిద్రాహారాలు మాని అనుక్షణం దాన్నే గుర్తుచేసుకుంటున్నాడు. బావ ఆరోగ్యం ఎంతగా పాడైపోయిందో తెలుసా అన్నయ్యా!"

"తెలుసు. రాత్రి బావను పరీక్షగా చూశాను"

"అలాంటి స్థితిలో ఈ విషయం బావకు తెలిస్తే ఏమైపోతాడో, నా సంసారం ఎలా మలుపు తిరుగుతుందో ఆలోచించావా? " అంది మిథిల.

"ఆ విషయాన్ని మనం తాత్కాలికంగా, రహస్యంగా దాచిపెట్టినా తర్వాతైనా తెలియకపోదు. ఈలోగా జరగరానిదేదేనా జరిగిందంటే అప్పుడు బావ దృష్టిలో మనం దోషులమౌతాం. ఒక అనర్థానికి కారణం అతనే అయినప్పుడు ఆ అనర్థంవల్ల వాటిల్లే పరిణామాలక్కూడా అతనే బాధ్యత వహించాలి. ఈ విషయంలో మనం నిమిత్తమాత్రులం. బావ మనసు మళ్ళీ ఇప్పుడు కిరణ్మయివేపుకు మళ్ళకపోతే అతనికి జరిగిందంతా చెప్పినా, చెప్పకపోయినా ప్రమాదం వుండేదేంకాదు. కానీ ఇప్పుడు బావ కిరణ్మయి విషయంలో తీవ్రమైన మానసిక వ్యధకు గురౌతున్నాడు కనుక ఇప్పుడు అతనికి నిజం చెప్పకపోతే అందుకు మనం చాలా భారీగా మూల్యం చెల్లించాల్సివస్తుంది"

మిథిల ఆలోచనలో కూరుకునిపోయింది. పక్కనే నించొని అంతా వింటోన్న గోపీకృష్ణను గమనించలేదు.

మిథిల చేతిలోంచి రిసీవర్ని లాక్కుని "బావా! నిజం చెప్పు. కిరణ్మయికి ఏమైంది? " అని అడిగేడు ఆతృతగా.

మిథిల వెళ్ళి నిస్త్రాణగా సోఫాలో కూలబడిపోయింది.

గోపీకృష్ణ మార్కండేయులితో మాట్లాడి రిసీవరు పెట్టేసి హడావుడిగా బయల్దేరాడు.

మిథిల సోఫాలోంచి విసురుగా పైకిలేచి అతని దారికి అడ్డంగా నిలబడి "కిరణ్మయి దగ్గరికేనా? " అడిగింది తీక్షణంగా.

"అవును! కిరణ్మయిని తెచ్చి మన ఆస్పత్రిలో చేరుస్తాను. నువ్వామెకు ట్రీట్‌మెంటు ఇవ్వాలి. మళ్ళీ మనిషిని చెయ్యాలి" అన్నాడు గోపీకృష్ణ ఆదేశిస్తోన్న ధోరణిలో

"నేనేం దేవతను కాదు డాక్టర్ని మాత్రమే..."

"డాక్టరువి కనుకనే నిన్ను అడుగుతున్నాను, ఆమెకు స్వస్థత కలిగించమని. దేవతవే అయితే నువ్వే జాలి తలిచేదానివి" అన్నాడు గోపీకృష్ణ.

"చేతులారా నా జీవితాన్ని నరకం చేస్కోను. ఎవరైనా చేస్తే సహించి ఊరుకోను"

"ఏం చేస్తావ్? "

"ఆత్మహత్యక్కానీ, హత్యక్కానీ సులువైన మార్గాలు నాకు తెలుసు. డాక్టర్నికదా!" అంది మిథిల.

★ ★ ★

భువనేశ్వరీదేవి రిక్షాదిగి పరాత్పరం ఇంట్లోకి వెళ్ళింది.

"కిరణ్మయీ! ఎవరొచ్చారో చూడు" అన్నాడు పరాత్పరం భువనేశ్వరీదేవి అలా

తన ఇంటికి రావటంతో సంభ్రమాశ్చర్యాలకు లోనౌతూ.

అంతక్రితమే స్పృహలోకి వొచ్చింది కిరణ్మయి. పరాత్పరం అన్నది విని తలెత్తి చూసింది.

ఎదురుగా తల్లి!

క్షణం నమ్మలేకపోయింది. కళ్లు విప్పార్చి చూసింది. మరుక్షణమే మంచంమీంచి లేచి నించుంది.

భువనేశ్వరీదేవి సుడిగాల్లా కిరణ్మయిని ఆక్రమించుకుని గుండెమీద పొదవి పట్టుకుంటూ బావురుమని ఏడ్చింది. తనివిదీరా కూతురు వొళ్ళంతా తడిమి మంచంమీద కూర్చుంది. కిరణ్మయిని వడిలోకి తీసుకుని అశ్రునయనాలతో చూడసాగింది. నోటి వెంట మాటలు పెగిలి రావటంలేదు. మౌనంగా ఏడుస్తోంది.

కిరణ్మయికి అమ్మ వొడిలో హాయిగా వుంది. రెండు క్షణాలు ఆ ఆనందాన్నలా జుర్రుకుందో, లేదో- భూమిలో నిక్షిప్తమై ఒకేఒక్క ఘాతానికి పొరలు చించుకుని భళ్లున పెల్లుబికి తన్నుకొస్తోన్న పాతాళగంగకుమల్లే గుండెలోతుల్లోంచి ఆవేదన తన్నుకొచ్చింది. నిర్నిరోధంగా విలపించింది.

"ఇన్నాళ్లకు గుర్తొచ్చానా అమ్మా?" ఆ దుఃఖపుపొంగు శాంతించగానే అడిగింది ఆర్ద్రంగా.

తల్లి గుండె కరిగి నీరయ్యేందుకు ఆ మాటలోని వేడిమి చాలు, తల్లడిల్లిపోయింది భువనేశ్వరిదేవి.



"వచ్చేశానుగా తల్లీ..." అంది ఉపసంహా రంగా.

కిరణ్మయి కళ్లు దీనంగా మెరిశాయి.

శల్యావశిష్టంగా మారిన కిరణ్మయిని జాలిగా చూస్తూ, "చివరికి ఎముకలగూళ్ళా ఎంతగా మారిపోయావు తల్లీ... సరే, అయిందేదో అయింది. ఇక నువ్వు బాగా కోలుకుని మామూలు మనిషి వయ్యేదాకా బ్రహ్మరుద్రాదులు వచ్చినా నేను వెళ్లను. నీ కిష్టమైనవన్నీ వొండిపెట్టి, వారంరోజుల్లో నిన్ను మళ్ళీ మామూలు మనిషిని చేసుకుంటాను. అధైర్యపడకు. అన్నింటికీ ఇక నేనున్నానుగా..." అంది భువనేశ్వరీదేవి.

కిరణ్మయి గుండెనిండా గాలిపీల్చుకుంది. అడ్డాలనాటి బిడ్డలా అమ్మ వొడిలో వొదిగి పోయి గువ్వలా ముడుక్కుంది.

అత్తగారు రావటంతో పరాత్పరానిక్కూడా ధైర్యం చిక్కింది. అంతవరకూ అతను మౌనంగా నించున్నా వాతావరణం గంభీరంగా ఉండటం గమనించకపోలేదు.

"అట్లా అమ్మాకూతుళ్లు గూట్లో గువ్వల్లా కూర్చుంటే కంచాల్లోకి అన్నం రాదు. అత్తయ్యగారూ... నేను వెళ్లి కూరలు తెస్తాను. ఈలోగా మీరు మీ ముద్దుల కూతురికి ఏం వండి పెడతారో మీరే నిర్ణయించండి" అని ఓ నవ్వు నవ్వి, వాతావరణం తేలికపడిందని భావించి, కూరల సంచితో బయటికి వెళ్లిపోయేడు పరాత్పరం.

అతను వెళ్లగానే భువనేశ్వరీదేవికి అప్పుడే స్వతంత్రం వచ్చినట్టనిపించింది. కిరణ్మయిని అడిగి ఎక్కడ స్నానం చెయ్యాలో తెలుసుకుని వెళ్లి స్నానం చేసి మడికట్టుకుని వచ్చింది.

ఆమెకు దేవుడి విగ్రహాలు గుర్తొచ్చాయి. తనలోతనే నవ్వుకుంది.

పరాత్పరం రోజూ ధ్యానించే అమ్మవారి పఠం ముందు కూర్చుని కళ్లు మూసుకుని ధ్యానం చేసింది. కొంచెంసేపటి తర్వాత కళ్లు తెరిచి లెంపలు వేసుకుంది. అమ్మవారి వేపే భక్తిగా చూస్తూ "అమ్మా! పరాత్పరం పూజలు నిజమనుకోకు. ఆ పాపిని మాత్రం క్షమించకు!" అని మనసారా వేడుకుంది.

పరాత్పరం వచ్చాడు.

భువనేశ్వరీదేవి వంటకు ఉపక్రమించి కూరలు తరుగుతోంటే కిరణ్మయి ఆమె పక్కనే కూర్చుని గమనిస్తోంది.

పరాత్పరం అరడజను అరటిపండ్లను చేత్తో పట్టుకుని బయటికి వెళ్లి పది నిముషాల్లో తిరిగొచ్చేడు.

"కిరణ్మయీ! నీ అరటిపండ్లు సిద్ధం చేసి సంచిలో పెట్టి గోడకు తగిలించాను. జాగ్రత్త! పరిమితంగా తిను. లేకుంటే మళ్లీ హంగామా చేస్తావ్" అన్నాడు కిరణ్మయి చెవిలో రహస్యంగా.

"అవసరంలేదు. అమ్మ చూస్తే బాధపడుతుంది" అంది కిరణ్మయి.

"మానేస్తే మంచిదేకానీ నీ శరీరం నీ మాట వింటుందో లేదో! అదంతా నువ్వే చూసుకో, నీ అవసరాన్నిబట్టి!" అని చెప్పి పరాత్పరం వెళ్లి దూరంగా కూర్చున్నాడు.

విధి బాధితులెవరో అతని కోసం వచ్చారు.

నాలుగు రోజులదాకా అమ్మవారు ఎవ్వరికీ ప్రశ్నలు చెప్పటంకానీ తాయత్తులు, విబూది, కుంకుమ ఇవ్వటం కానీ చెయ్యదని నిష్కర్షగా చెప్పి వాళ్లందర్నీ పంపించివేసేడు పరాత్పరం.

వంట పూర్తయింది.

"ఇక భోజనాలు చెయ్యొచ్చు" అంది భువనేశ్వరీదేవి.

"అత్తయ్యగారూ! ముందు మీ ఇద్దరూ భోంచెయ్యండి. నాకు ఆకలిగాలేదు. తర్వాత తింటాను" అని చెప్పేడు పరాత్పరం.

భువనేశ్వరీదేవికి గుండెమీంచి కుంపటి దించినట్లనిపించింది. అదే అవకాశమన్నట్లు




గబగబా కిరణ్మయికీ, తనకూ రెండు విస్తర్లు పరిచి నీళ్లతో శుద్ధి చేసింది. కూరలూ, అన్నం వడ్డించింది.

ఇద్దరూ భోజనానికి ఉపక్రమించేరు.

ఒక్కో ముద్దా నమిలి మింగుతుంటే కిరణ్మయికి ఎన్నో ఏళ్ల తర్వాత తొలిసారిగా అలాంటి భోజనం చేస్తోన్న అనుభూతి కల్గింది. నిత్యం మత్తులో జోగుతూ కేవలం ఆకల్ని చంపేందుకు నాలుగు మెతుకులు గతుకుతూ అనుభూతులను కూడా చంపేసి కేవలం ఓ జీవశ్చవంలా కాలం గడుపుతోన్న తనకు ఆ అనుభూతి పునర్జన్మనిచ్చినట్లే వుంది.

నిష్కారణంగా ఆమె కళ్లు చెమ్మగిల్లేయి.

భువనేశ్వరీదేవికి ఆనందంగా వుంది. భయంగొల్పిన దృశ్యం పీడకలగా తేలిపోయినప్పుడు మనసు కుదుటపడ్డట్టే ఆమె నిబ్బరంగా వుంది.

నిజానికి కిరణ్మయి అనారోగ్యం పాలై స్పృహ కోల్పోయిందని మార్కండేయులు చెప్పగానే ఆమె ఎంతగా తల్లడిల్లిందో! అలాంటిదిప్పుడు కూతురు లేచి కూర్చుని తన కళ్ల ఎదుటే నాలుగు మెతుకులు తింటోంటే కన్నతల్లికి అంతకన్నా ఆనందం మరేముంటుంది.

"అన్నట్టు మర్చేపోయేను! మార్కండేయులుకు నువ్వు బాగానే వున్నావని కబురైనా పెట్టాలి!" అంది భువనేశ్వరీదేవి, ఎవర్నీ ఉద్దేశించకుండానే.

"ఆయనకు కబురు పెట్టకపోతే ఏమంత కొంపలు మునిగేయిలే..." అంటూ ముఖం చిట్లించుకుంది కిరణ్మయి.

దూరంగా కూర్చున్న పరాత్పరానికి భువనేశ్వరీదేవి మాటలు వినిపించేయి. "అన్నట్లు, నేనూ చెప్పటం మర్చేపోయానండీ అత్తయ్యగారూ... ఇందాక కూరలకు వెళ్లినప్పుడు మార్కండేయులు బావగారికి ఫోన్ చేశాను. మీరిక్కడికి క్షేమంగా చేరారనీ, కిరణ్మయి కోలుకుందనీ చెప్పాను" అంటూ చేత్తో విసనకర్ర పట్టుకుని వెళ్లి భువనేశ్వరీదేవి ఎదురుగా కూర్చొని విసుర్తూ,

"మీరేం ఆలోచించకుండా కడుపునిండా భోంచెయ్యండి అత్తయ్యగారూ!" అన్నాడు పరాత్పరం.

భువనేశ్వరీదేవికి వంటిమీద తేళ్లు, జెర్రులూ పాకినట్టనిపించింది.

అన్నంలో చూపుడు వేల్తో సున్నాలు చుడుతూ కిరణ్మయివేపుకు తిరిగి "మార్కండేయులు ఒక పట్టాన అర్థమయ్యే మనిషి కాదమ్మా! వాస్తవం చెప్పాలంటే దత్తు వెళ్లిం తర్వాత మన బాధ్యతలన్నీ వాడే భుజాన వేసుకోవటం వాడికేం పని? ఊళ్లో మన ఇల్లు అమ్మితే వచ్చిందంతా మనకే ఇచ్చాడు. మిథిలను డాక్టరీ చదివించాడా. సరే... గ్రహచారం బాగాలేక నీ కర్మ ఇలా కాలిందనుకో" అంటూ పరాత్పరాన్ని చూసి నాలుక కొరుక్కుని,

"వాడు మిథిల పెళ్లి ఎంత రంగరంగ వైభవంగా చేశాడనుకున్నావ్! ఆకాశమంత పందిరి, భూదేవంత కల్యాణ మండపం అన్నట్టే చేసేడు. చెప్పొద్దూ... గోపీకృష్ణతో మిథిలకు పెళ్లి చేస్తున్నట్టు ముందుగా వాడు నాతో మాటమాత్రం చెప్పలేదు. కోపం వచ్చింది. తీరా పెళ్లిపందిట్లో ఆ జంటను చూస్తుంటేనే ఎంత కనుల పండువగా ఉందనీ! దాంతో నా కోపం ఇట్టే మటుమాయమైంది..."

భువనేశ్వరీదేవి చెప్తోంది పూర్తి కాకుండానే కడుపునిండా మంచినీళ్లు తాగి "భోంచెయ్య బుద్ధి కావటం లేదమ్మా, ఎందుకో నోరంతా చేదుగా ఉంది" అని తల వంచుకుని కూర్చుంది కిరణ్మయి.

పరాత్పరం తనకు ఎదురుగా అలా

కూర్చుంటే భువనేశ్వరీదేవికూడా ముద్ద మింగుడు పట్టంలేదు. కిరణ్మయి విస్తరి మీంచి లేస్తే తనూ లేచి వెళ్లవచ్చునన్న ఆలోచనతో కిరణ్మయివేపు చూసింది.

"అత్తయ్యగారూ! కిరణ్మయితో మీరు పోటీ పడకండి. జబ్బు మనిషికదా..." అన్నాడు పరాత్పరం అనునయంగా.

అనుకోని విధంగా సరిగ్గా అప్పుడే పరాత్పరం భార్య వచ్చింది. ఆమెను చూడగానే కిరణ్మయికి నవనాడులూ స్థంభించిపోయేయి. భయంగా ఆమెవేపు చూసింది.

"అప్పోవ్, బువ్వ తింటన్నట్టుందే. కానీండి, ఈడ కూకుంటాన్లే!" అని తడికె తలుపు దగ్గరే కూర్చుని భువనేశ్వరీదేవి వేపు ఎగాదిగా చూసి "ఎవరీమె? మీ అమ్మా? " అనడిగింది.

కిరణ్మయి ముఖం వివర్ణమైంది.

భువనేశ్వరీదేవి వేపు కంగారుపడుతూ అదోలా చూసింది.

భువనేశ్వరీదేవి విస్తర్ని మడుస్తూ "అమ్మా! కిరణ్మయీ! నాకూ భోజనం సహించటంలేదు!" అంటూనే కిరణ్మయి వేపు చూసింది.

"విస్తర్లు నేను తీస్తాన్లేమ్మా" అంది కిరణ్మయి.

పరాత్పరం లేచి వెళ్లేడు. గుడిసెలో ఓ మూలగా వున్న పాతకాలపు చెక్క పెట్టె లోంచి అముల్ డబ్బా బయటికి తీసేడు. అందులోంచి డబ్బుతీసి కిరణ్మయికి యివ్వబోయేడు.

"నాకెందుకూ... ఆమెకే యివ్వండి" అంది కిరణ్మయి చేతుల్ని వెనక్కు లాక్కుంటూ.

"నీ చేతుల మీదుగా యిస్తే బాగుంటుందనీ..."





కిరణ్మయి డబ్బు అందుకుని ఎస్తేరమ్మకిస్తూ "ఇవి నాలుగు వేలే! ఇంకా మీకు వెయ్యి రూపాయలివ్వాలి. తొందర్లోనే ఆ డబ్బుకూడా యిస్తాం" అంది, ఆమెకు మాత్రమే వినిపించేట్టు లోగొంతుతో.

దాంతో ఆవిడ అంటుకున్న చిచ్చుబుడ్డిలా ఖస్సున లేచింది. చీరెను నడుంచుట్టూ తిప్పి బిగించి "ఏంటప్పోవ్! ఏదోలే చిన్న పిల్లవు పెద్దకులందానివి గదా అని నువ్వు సెప్పినట్టల్లా యిని సెవులూపుతుండాను. ఇదే సివరి గడువన్జెప్పి తీరా యిచ్చేప్పటి కల్లా వెయ్యి రూపాయలు కొరవబెడ్తే ఎట్లాగాంట!" అంది పెద్ద గొంతుతో.

కిరణ్మయి నవనాడులూ కృంగిపోయాయి.

అవమాన భారంతో తల దించుకుంది.

ఆమె కళ్లు తవ్విన చలమలయ్యేయి.

పరిస్థితి అంతా భువనేశ్వరీదేవికి అర్థమైంది. తలెత్తి కిరణ్మయిని చూస్తూ "ఆమెకు ఎంతివ్వాలి? " అని అడిగింది.

తల్లి చూపుల్నించి తప్పించుకుంటూ గత్యంతరం లేక ఎంతివ్వాలో చెప్పింది కిరణ్మయి. మార్కండేయులు యిచ్చిన డబ్బును ఆ బాకీ కింద యిచ్చేసింది భువనేశ్వరీదేవి.

"అద్గదీ... మడిసంటే అట్టుండాలి. ఎనకటి కాలం మడుసుల్లో యింకా దర్మం వొడ్డునపడ్డ సేపలెక్క కొట్టకలాడ్తాందిగానీ ఈ కాలపోళ్లలో కలికానిగ్గూడా కనిపిచ్చటం లేదు!" అంటూ, కాల వైపరీత్యానికి నొచ్చుకుంటో వెళ్లిపోయిందామె.

భువనేశ్వరీదేవి మంచంమీద వెల్లికిలా పడుకుని గుడిసె కప్పువేపే దీక్షగా చూస్తోంది.

కిరణ్మయి రహస్యంగా ఆవేదనపడుతోంది. ఆ ఆవేదన స్థాయి వర్ణనాతీతంగా వుంది.

సవతి వ్యవహారం ఆమె ముందు బయ

టపట్టం, తన దౌర్భాగ్య పరిస్థితినంతా అమ్మ గమనించటంతో ఆత్మహత్య చేసుకుందామన్నంతగా కృంగిపోయింది.

మెల్లగా లేచి నించుంది. అమ్మ చూడకుండా వెళ్లి గోడకు తగిలించివున్న సంచి లోంచి అరటిపండ్లు బయటికి తీసి చాప మీద కూర్చొని పండ్లన్నీ వొల్చుకుని తింది.

అయినా ఆమెకు దివ్య శ్లోకాలు కనిపించ లేదు!

అమ్మవారి పటం వెనుక చాటుగా పరాత్పరం దాచిపెట్టిన నల్లమందుడబ్బా యివతలికి తెచ్చి మూత తెరిచింది.

ఇప్పుడు ఆమెకు అరిటిపండ్లు అవసరం అనిపించలేదు. నల్లమందును వుండలు వుండలుగా తీసి దఫాలవారిగా మింగుతూ కూర్చుంది.

పరాత్పరం గుడిసె బయట అరుగుమీద కూర్చుని 'మవ్యపోస' కార్యదర్శితో మాట్లాడుతోన్నాడు.

అసెంబ్లీ ఎన్నికలు దగ్గరపడుతోన్నాయి. జిల్లాలో వున్న రిజర్వేషన్ సీటును పరాత్పరంకు కేటాయించి, అతడ్ని గెలిపించాలని అధికార పార్టీ నిర్ణయించిందిట.

వాళ్లు పరాత్పరంను పార్టీ కార్యాలయానికి పట్టుకు రమ్మని చెప్పి ఈ 'మవ్యపోస' బెంజిమన్‌ను పంపించేరు.

పరాత్పరం ఆనందం అంతా యింతా కాదు! అధికార పార్టీతో తమ బేరసారాలు ఎలా వుండాలన్న విషయం బెంజిమన్తో వివరంగా చర్చించి, ఆ శుభవార్త కిరణ్మయికి చెప్పేందుకు ఇంట్లోకి వెళ్లేడు. చాపమీద పడుకున్న కిరణ్మయిని తట్టి లేపబోయేడు. కిరణ్మయి అప్పటికే స్పృహకోల్పోయింది. నోటివెంట నురగలు కక్కుతోంది. మధ్య మధ్యలో కాళ్లూ చేతులూ కొట్టుకుంటోంది. క్షణం నిర్ఘాంతపోయి ఆనక తేరుకుని గావు కేక పెట్టేడు పరాత్పరం.

ఆ కేక విని ఉలిక్కిపడి లేచింది భువనేశ్వరీదేవి. అనుమానంగా చూస్తూ కిరణ్మయి దగ్గరికి వెళ్లింది. భుజాలు పట్టుకుని కుదుపుతూ "కిరణ్మయీ... కిరణ్మయీ..." అంటూ గట్టిగా పిలిచింది. కిరణ్మయిలో చలనంలేదు. పెద్దగా ఏడుపు లంకించుకుంది భువనేశ్వరీదేవి.

సరిగ్గా అప్పుడే ఇంటిముందు కారు ఆపుకుని లోపలికి వచ్చాడు గోపీకృష్ణ.

అతణ్ణి చూడగానే స్వరం మరింతగా పెంచి ఘొల్లున ఏడ్చింది భువనేశ్వరీదేవి.

గోపీకృష్ణ కిరణ్మయి పరిస్థితి గ్రహించి పరాత్పరంతో "కిరణ్మయిని ఆస్పత్రికి తీసుకుని వెళ్దాం!" అన్నాడు.

కిరణ్మయిని ఆస్పత్రికి పంపిస్తే నల్లమందు విషయం బయటపడుతుంది, పైగా ఆమెను ఆస్పత్రికి తీసుకుని వెళ్లేందుకు సిద్ధపడ్డది గోపీకృష్ణ. ఆ రెండు విషయాలూ పరాత్పరం అంగీకరించేవికావు. కానీ యిప్పుడు పరాత్పరం ధ్యాసంతా అసెంబ్లీ ఎన్నికలమీదవుంది. కిరణ్మయిని ఆస్పత్రికి తీసుకుని వెళ్లే బాధ్యత గోపీకృష్ణకు అప్పగిస్తే తను నిరాటంకంగా అధికార పార్టీ కార్యాలయానికి వెళ్లవచ్చు.

అందుకే అన్నాడు గోపీకృష్ణతో, "ఆమెను మీరు ఆస్పత్రికి తీసుకుని వెళ్లండి. నేను కొంచెం ఆలస్యంగా వస్తాను"

గోపీకృష్ణ అంగీకారంగా తలూపేడు. పరాత్పరం సహకారంతో కిరణ్మయిని కార్లోకి చేర్చి, భువనేశ్వరీదేవిని కూడా ఎక్కించుకున్నాడు గోపీకృష్ణ.

"వెళ్లేది మీ ఆస్పత్రికేగా? " అడిగేడు పరాత్పరం.

"కాదు విజయా నర్సింగ్‌హోం!" చెప్పేడు గోపీకృష్ణ.

కారు వేగంగా ముందుకు దూసుకుపో



యింది.

పరాత్పరం వెసులుబాటుగా శ్వాసపీల్చు కుని బెంజిమన్‌తో కలిసి అధికార పార్టీ కార్యాలయానికి దారి తీసేడు.

★ ★ ★

కిరణ్మయికి స్పృహ వచ్చేందుకు రెండు రోజులు పట్టింది. ఆ రెండు రోజులూ ఆమెకు ఆహారం ట్యూబుల ద్వారా ఎక్కిం చేరు. సెలైనూ, యింజక్షన్లు లెఖ్ఖలేదు.

గోపీకృష్ణ కూడా భువనేశ్వరితోపాటు ఆ రెండు రోజులూ నర్సింగ్‌హోంను వొదిలిపె ట్టలేదు. మార్కండేయులు, కాత్యాయిని వస్తూ పోతూన్నారు. పరాత్పరం వీలు చిక్కినప్పుడల్లా వచ్చి కిరణ్మయి ఆరోగ్యం గురించి వాకబు చేసి వెళ్తున్నాడు.

అదే రోజు పరాత్పరంకు సీటు ఖాయం కావటం, నామినేషన్ వెయ్యటం కూడా జరి గింది. ప్రచారం ముమ్మరంగా సాగుతోంది. డప్పు దండోరాలతో పల్లెకారులు తమ బాధ లకు పాటల రూపం యిచ్చి ప్రజలను ఆక ర్షిస్తూ పరాత్పరంకు ఓట్లు వెయ్యమని అడు గుతున్నారు.

అలా పరాత్పరంకు ఊపిరి పీల్చుకుందు క్కూడా తీరిక చిక్కటంలేదు.

మరో రెండు రోజులు గడిచిం తర్వాత మిథిల విజయా నర్సింగ్‌హోంకు వచ్చి మొక్కుబడిగా కిరణ్మయిని పలుకరించింది.

"అమ్మా, మిథిలా! నువ్వు డాక్టరువై య్యుండి చెల్లాయిని వేరే ఆస్పత్రిలోవుం చటం ఎందుకూ? వెంటనే మనం మన ఆస్పత్రికి వెళ్లిపోదాం!" అంది భువనేశ్వరీ దేవి.

గోపీకృష్ణ చివాల్న తలెత్తి మిథిల వేపు చూసేడు.

"అదంటే నాకు అమితమైన ప్రేమకదా... అందుకే అది నా ఆస్పత్రిలో కళ్లెదురుగా బాధపడుతుంటే నేను చూళ్లేను. దాన్ని ఇక్కడే వుంచండి!" అంది మిథిల.

ఆమె మాటల్లోని వెటకారాన్ని గ్రహించేడు గోపీకృష్ణ.

"మీరిలా రండి..." అని గోపీకృష్ణను పిలిచి బయటికి దారితీసింది మిథిల.

గోపీకృష్ణ లేచి ఆమె వెంటవెళ్లేడు.

సందర్శకుల గది ఖాళీగా వుంది. ఇద్దరూ ఆ గదిలో కూర్చున్నారు.

"ఏంటో చెప్పు!" అన్నాడు క్షణం తర్వాత గోపీకృష్ణ.

"చెప్పాల్సింది మీరే! కనీసం ఇంటిక్కూడా రాకుండా మీరు ఇక్కడే అంటిపెట్టుక్కూర్చు న్నారు. అన్నం నీళ్లు కూడా మానేసినట్టు న్నారు. అద్దంలో ఒకసారి ముఖం చూసు కోండి. ప్రేతకళ కనిపిస్తోంది! నేను డాక్ట ర్నయి వుండి నా భర్త దాన్ని వేరే ఆస్ప త్రిలో చేర్పించి యిలా సేవలు చేస్తున్నా డంటే నలుగురూ ఏమనుకుంటారు? నవ్వి పోరూ..." అని, గోపీకృష్ణ వేపు చూడకుం డానే అతని సమాధానం కోసం చెవులు రిక్కించి చూస్తూ కూర్చుంది మిథిల.

గోపీకృష్ణ పేలవంగా నవ్వేడు.

"అక్కా చెల్లెళ్లకు పడదేమో అనుకుం టారు. అయినా నువ్వంత సానుభూతితో కిరణ్మయిని నీ ఆస్పత్రిలో చేర్చుకుంటే ఇంత రాద్ధాంతానికి ఆస్కారం వుండేదికాదుగా..." అన్నాడు నెమ్మదిగా.

"ఒక చెల్లాయిగానో, పేషంటుగానో దానికి ఆశ్రయం ఇచ్చేందుకు నాకెలాంటి అభ్యం తరం లేదు. కానీ దాని విషయంలో మీ ఆలోచన మరోలా వున్నప్పుడు నా గొయ్యి నేనెలా తవ్వుకుంటాను?"

"అందుకేగా కిరణ్మయిని ఇక్కడ చేర్చాను! ఇక్కడిక్కూడా వచ్చి అల్లరి పెట్టటం ఎందుకూ?"

"నేనేం అల్లరి పెట్టేందుకు రాలేదు! మన సంసారం అల్లరి పాలౌతుందన్న భయంతో





వచ్చాను, ఇంటికి వెడదాం పదండి"

"కిరణ్మయిని వదిలిపెట్టి నేను రాలేను!" చెప్పేడు గోపీకృష్ణ నిర్ద్వందంగా.

"పర్యవసానం ఆలోచించారా? "

"అన్నింటికీ సిద్ధంగానే వున్నాను" అన్నాడు దృఢంగా.

మిథిల చివాల్న కుర్చీలోంచి లేచి విస విసా నడుస్తూ వెళ్లిపోయింది.

కొంచెంసేపటి తర్వాత మార్కండేయులు, కాత్యాయిని వచ్చేరు. ఏదో మాటల సందర్భంలో చెప్పేడు మార్కండేయులు, బ్రహ్మాంజీ కాశ్మీరునించి కన్యాకుమారిదాకా హిందూ మతోద్ధరణకు కంకణం కట్టుకుని చేస్తోన్న పర్యటనలో భాగంగా రేపు ఇక్కడికి వస్తున్నారట!

ఆ విషయం మార్కండేయులు చెప్పగానే అందరికన్నా ఎక్కువగా సంతోషపడ్డది భువనేశ్వరీదేవి! ఆపదలో వున్నప్పుడు అందుబాటులో లేని వ్యక్తులమీదనే నమ్మకం అధికంగా వుంటుంది. భగవద్దర్శనం జరుగబోతోన్నంతగా ఆనందించింది ఆమె!

మరుసటిరోజు బ్రహ్మాంజీ వచ్చేరు.

ఊరంతా కోలాహలంగా వుంది! ఎక్కడ చూసినా స్వాగత ద్వారాలూ, రంగురంగుల విద్యుద్దీపాలూ, తోరణాలూ... భగవద్గీత శ్లోకాలను అందంగా రాసిన బ్యానర్లు ప్రధాన రహదారి కూడళ్లలో వేలాడుతోన్నాయి. రకరకాల అలంకరణలతో ఊరు దేదీప్యమానంగా ముస్తాబైంది.

కరివేపాకు ప్రొద్దున్నే మార్కండేయులు ఇంటికి వచ్చేడు. బ్రహ్మాంజీ ఆగమనంతో మార్కండేయులు ఇల్లు చాలా సందడిగా వుంటుందనీ, బ్రహ్మాంజీ ఉపదేశాలు విని తమతమ అజ్ఞానపు చీకట్లను తొలగించుకుని జ్ఞాననేత్రాలు వికసింపచేసుకుని పదుగురితోపాటు తనూ విజ్ఞానదాయకమైన బోధలు వినవచ్చుననీ అతని ఆలోచన.

భువనేశ్వరీదేవి కూడా కిరణ్మయిని జాగ్రత్తగా చూస్తుండమని ఆస్పత్రి సిబ్బందికి చెప్పి పెందరాళే ఇల్లు చేరుకుంది. కిరణ్మయిని ఆశీర్వదించమని బ్రహ్మాంజీని కోరేందుకు.

బ్రహ్మాంజీ మార్కండేయులు ఇంటికి శిష్య సమేతంగా వచ్చారు.

నాలుగు ఏనుగులు, రెండు ఖరీదైన విదేశీ కార్లూ, వందిమాగధులూ, స్తుతిస్తోత్రాలూ...

అన్నింటికన్నా ముందున్న ఏనుగుమీద అంబారీ వేసి, పట్టు వస్త్రాలతో పరదాలు కట్టి, బూరుగుదూది పరుపును ఆసనంగా వేసి బ్రహ్మాంజీ ఆశ్రమ పీఠపు సిరిసంపదలకు దర్పణం పడుతోన్న అంబారీకి దీటుగా సువర్ణ ఘంటలతో గలగలరావాలు చేస్తూ మందగమనంతో వచ్చి ఆ ఏనుగుల గుంపు మార్కండేయులు ఇంటిముందు ఆగింది.

పరదాలు తొలగించుకుని బ్రహ్మాంజీ నింపాదిగా కిందికి దిగేరు. పావుకోళ్లు టకటకలాడిస్తూ గృహప్రవేశం చేసేరు.

అప్పటికే మార్కండేయులు ఇంటివద్ద వేచివున్న పురప్రముఖులంతా బ్రహ్మాంజీకి పాదాభివందనం చేసి లోపలికి ఆహ్వానించేరు.

గత స్మృతులు జ్ఞాపకం వచ్చాయేమో, బ్రహ్మాంజీ విప్పారిన ముఖంతో అందరి వేపూ చిరునవ్వులు చిందిస్తూ ఇల్లంతా పరకాయించి చూస్తూ అడుగులో అడుగేస్తూ కదిలేరు.

మిథిల అప్పుడే వచ్చింది.

"బావ రాలేదా? " అడిగేడు మార్కండేయులు.

మిథిల చుట్టూ చూసింది. ఎవ్వరూ తమ మాటల్ని వినటంలేదని గ్రహించి "ఆయనకి లాంటివి మనసుకు పట్టేట్టున్నాయా... ఇప్పుడు కూడా విజయానర్సింగ్ హోంలో

కిరణ్మయి దగ్గరే వున్నాడు" అంది నిష్ఠూరంగా.

కాత్యాయిని, మిథిల బ్రహ్మాంజీకి పాదాభివందనం చేశారు.

మార్కండేయులు అందర్నీ పరీక్షగా గమనిస్తున్నాడు. చిన్నపిల్లల దగ్గర్నించి వయోవృద్ధులదాకా అలా అందరూ అతనికి పాదాభివందనం చేస్తున్నారు. బ్రహ్మాంజీ ఆశీర్వదిస్తూనే వున్నారు.

కన్నతల్లికి తప్ప స్వామీజీలు మరెవ్వరికీ నమస్కరించరట, దేవుడికి తప్ప!

మార్కండేయులు భువనేశ్వరీదేవి దగ్గరికి వెళ్ళి ఆమె చెవిలో అడిగేడు రహస్యంగా, "అమ్మా! నాన్నగారు బతికివుంటే ఇప్పుడు వారే బ్రహ్మాంజీకి నమస్కరించేవారా?" అని.

"తప్పదు! అది రివాజు. కన్నతల్లికి తప్ప స్వామివారి నమస్కారం అందుకునే అర్హత మరెవ్వరికీ వుండదు" అంది భువనేశ్వరీదేవి.

మార్కండేయులు పెద్దగా నవ్వేడు.

"ఎందుకలా నవ్వుతావ్?" అంది భువనేశ్వరీదేవి.

మార్కండేయులు బలవంతంగా నవ్వును ఆపుకుని "మరేం లేదమ్మా... ఆదినించీ మగవాళ్ళకు జరుగుతోన్న యీ అన్యాయం తీవ్రంగా ఖండించవలసిందే. పురుషులపట్ల ఎందుకు అంత వివక్ష! ఈ విషయంమీద పురుషవాదులు బయల్దేరి సాహితీ ఉద్యమం చేపడితే ఇదో గొప్ప కవితా వస్తువౌతుంది. పుంఖానుపుంఖాలుగా రచనలు చేయొచ్చు!" అని, ఇక నియంత్రించుకోలేక భళ్ళున నవ్వేడు మార్కండేయులు.

మార్కండేయులు అన్నదేంటో భువనేశ్వరీదేవికి అర్థంకాలేదు. అయోమయంగా అతనివేపు చూసింది.





అంతలో బ్రహ్మాంజీ కార్యదర్శి వచ్చేడు. "స్వామివారు కొంచెంసేపు కుటుంబ సభ్యులతో ఏకాంతంగా మాట్లాడేందుకు అనుమతించి ఆశీనులైవున్నారు" అని చెప్పేడు.

మార్కండేయులుతోసహా అందరూ బ్రహ్మాంజీ దగ్గరికి వెళ్ళేరు.

స్వామివారి సెక్యూరిటీ సిబ్బంది కుటుంబ సభ్యులనూ, స్వామివారు సూచించిన కొంతమంది స్నేహితులను మాత్రం అక్కడ వుండేందుకు అనుమతించి మిగిలిన వాళ్ళందరినీ బయటికి పంపించేరు.

జిల్లా ప్రభుత్వ యంత్రాంగంలోని ముఖ్యమైన అధికారులంతా మార్కండేయులు ఇంటిబయట వీధిలో నించున్నారు. జిల్లా కలెక్టరు, పోలీసు సూపరెంటెంటే కాకుండా జిల్లాకు చెందిన ఒక మంత్రి కూడా వారిలో వుండటం ఆ పరిసరాలకే ఎంతో శోభను సంతరించిపెట్టింది.

బ్రహ్మాంజీ కార్యదర్శి స్వామివారిముందు వినయంగా నిలబడి "స్వామీ! ఒక్క నిమిషంలో మన గుంటూరు పర్యటనలోని వివరాలు చెప్పి నేను వెళ్ళిపోతాను. ఆ తర్వాత మీరు మీ వాళ్ళతో స్థిమితంగా మాట్లాడుకోవచ్చు" అన్నాడు.

స్వామివారు చిర్నవ్వుతోనే అంగీకారం తెలిపేరు.

కార్యదర్శి చెప్పుకుని పోతున్నాడు.

"స్వామీ! మన ఆశ్రమ కార్యాలయంవారితో సంప్రదించి, ముందుగా అనుమతిపొందిన వారి వివరాల ప్రకారం పాదపూజలు మొత్తం యాభై. పాదధూళితో పావనం చేసి ఆశీర్వదించాల్సినవి ఎనభై. అటు తర్వాత మధ్యాహ్నభోజనం మంత్రిగారి గృహంలోనూ, రాత్రి భోజనం మున్సిపల్ ఛైర్మన్‌గారింట్లోనూ! ఇకపోతే, మన ఏనుగులకు దాణా సేల్స్‌టాక్సు డిపార్టుమెంటు వారున్నూ, ఆశ్రమ సిబ్బందికి ఎక్సయిజుశాఖ వారున్నూ ఏర్పాటుగావించారు.

రాత్రికి గాంధీపార్కులో విశ్వశాంతిపై తమ ఉపదేశమున్నూ, అనంతరం విశ్రాంతి, ఆపైన సూర్యోదయం తర్వాత తిరుగు ప్రయాణం..."

"ఈరోజు మన ఆశ్రమ ఆదాయం ఎంత?" అడిగేరు స్వామి.

"స్వామీ! ఈ జిల్లాలో వర్షాలు సక్రమంగా కురవక పంటలు సర్గిగా పండలేదట. అందువల్ల రైతాంగం 'సౌండు'గా లేదు. ఇక పోతే, రాజకీయ పార్టీలమధ్య కక్షలూ, కార్పణ్యాలతో జరిగిన హత్యలకు నిరసనగా పలు పర్యాయాలు బందులు జరిగున్నూ, బందుల సందర్భంగా ఇరువర్గాల కార్యకర్తలూ కలిసి దుకాణాలు బద్దలుకొట్టి దోచుకున్నందుననూ వ్యాపారస్థులు 'సౌండు'గా లేరు. పైగా ఇది అసెంబ్లీ ఎన్నికల సీజను. అందుచేత జిల్లా ఆర్థిక, రాజకీయ పరిస్థితులను పరిగణలోకి తీసుకుని ఇక్కడ మేము నిర్ణయించిన రేట్ల ప్రకారం పాద పూజ ఒక్కింటికి వెయ్యిన్నూట పదహార్లున్నూ, ఆశీర్వచనాలకు నూట పదహార్లున్నూ నిర్ణయించాం. మన ఆశ్రమం తీసుకున్న సదరు నిర్ణయం ప్రకారం మొత్తం యాభై పాదపూజలకూ, ఎనభై ఆశీర్వచనాలకూ కలిపి ఈరోజు మన ఆదాయం అరవైవేలు దాటింది" అని చెప్పేడు కార్యదర్శి.

బ్రహ్మంజీ గాఢంగా నిట్టూర్చేరు. శూన్యంలోకి తీక్షణంగా చూస్తూ "మన మహత్తరమైన హిందూ మతోద్ధరణకు అందరూ కలిసి కృషి చేస్తేనే తప్ప అది దుస్సాధ్యం. ఇలాంటి స్వల్ప ఆదాయాలతో అంతటి బృహత్తరమైన కార్యక్రమాన్ని నిర్వహించటం చాలా కష్టం!" అన్నారు విచారంగా.

అప్పటిదాకా శాంతంగా వింటోన్న మార్కండేయులు ఠక్కున తలెత్తి "అంత శ్రమకోర్చి మతాన్ని ఉద్ధరించకపోతే ఏం?" అనడిగేడు సూటిగా.

అజ్ఞానివేపు జాలిగా చూసిన జ్ఞానికిమల్లే బ్రహ్మంజీ అతనివేపు చూస్తూ "సకల చరాచర జగత్తుకు మూల కారణాలనించీ, భౌతిక శరీరంనించి సూక్ష్మశరీరం వరకూ, జీవి పుట్టుకనించి మరణానంతర జీవితం వరకూ వివరించగల హిందూ మతమే విచ్ఛిన్నమైతే సమాజ గమనం ఎంత కష్టతరమౌతుందో గ్రహించండి! హిందూ మతోద్ధరణ అవశ్యకత ఎలాంటిదో అప్పుడు బోధపడుతుంది" అన్నారు స్వామీజీ మెరుపు కళ్ళతో.

"సమాజం సక్రమంగా మనగల్గేందుకు మతమే అవసరం అనుకుంటే అలాంటి హిందూమతాన్ని ఉద్ధరించేందుకు మరో ఆది శంకరుడు ఉద్భవించాలి. జనజీవన స్రవంతిలో తనూ ఒకడినన్న నిజాన్ని గుర్తించి ఓ సంస్కర్తగా, దిక్సూచిగా, వెలుతురు దివ్వెగా, జ్ఞానిగా, నిగర్విగా, సామాన్య ప్రజానీకానికి సహితం అందుబాటులో వుండే ఆప్తుడిగా ప్రజల హృదయాల్లో స్థానం పొందాలి. తను ప్రవచించే మతం మనిషి మనుగడకు అవసరం అన్న భావం, విశ్వాసం కల్గించాలి. కానీ, అలాంటి వాతావరణం లేదుగా"

బ్రహ్మంజీ కళ్ళు చికిలించి చూసేరు. "లేదని అలా భావించటం అనుచితం! ఎందరో మహానుభావులు సర్వసంగ పరిత్యాగులై నిత్యం శ్రమిస్తోంది హిందూ మతోద్ధరణ కోసమే. వారి కృషి వృథాకాదు!'' అన్నారు గంభీరంగా.

"ఎక్కడో పుట్టి సముద్రాలు దాటి వచ్చిన మతాలు కూడా మనదేశంలో స్థిరంగా కుదురుకున్నాయి. అందుకు కారణం ఆ మతాలు సామాన్య ప్రజలతోకూడా మమేకం కావటమే! ఆకలికి ఓ రొట్టెముక్కా, వొంటికి ఓ గుడ్డముక్కా, ఆవేదనలో వున్నప్పుడు ఆదరించి కన్నీళ్ళు తుడిచే ఓ స్నేహహస్తమో ఆశించే ప్రజలకు వారి తక్షణావసరాలను విస్మరించి జనజీవన స్రవం

తికి సుదూరంగా ఎన్నో రక్షణ వలయాల వెనుక దాక్కునే మీ అధికార పీఠంమీద విశ్వాసం ఎలా కుదుర్తుంది? వాళ్ళ ఆర్తనాదాలు మీ పీఠానికి వినిపించవు. వాళ్ళ ఆకలి కేకలు మీ అంబారీల వరకు ధ్వనించవు. ఖరీదైన మీ జీవితాలు జనబాహుళ్యానికి దూరంగానే మిమ్మల్ని నిరోధిస్తున్నాయి. ప్రజలకు కావలసింది ఓ మహానుభావుడి పాదస్పర్శతో పులకితమయ్యే గొప్ప అనుభూతి! ఆ అనుభూతిని వెయ్యిన్నూట పదహార్లిచ్చి కొనుగోలు చెయ్యగల ఆర్థిక స్తోమత ఎంతమందికుంటుంది? ఇక్కడ పుట్టిన బౌద్ధమతం ఇక్కడ అంతరించి పరాయిదేశాల పంచల్లో కుదురుకుందంటే అందుకు కారణం ఏంటో ఆలోచించి దాన్నే గుణపాఠంగా తీసుకోండి! రాజుల ఆశ్రయం ఉన్నంతకాలం బౌద్ధం మనదేశంలో ఉచ్ఛదశలోనే వుంది. క్రమంగా అది రాజులతోటే అంతరించిపోయింది. అలాగే మీరూ ఆనాటి రాజులకుమల్లే ఆకాశంలో విహరిస్తే మీమతం కూడా మీతోటే అంతరిస్తుంది!'" అన్నాడు మార్కండేయులు నిర్మొహమాటంగా.

భువనేశ్వరీదేవి కల్పించుకుంది! బ్రహ్మంజీ ఇంటికి రాగానే ఆమె కిరణ్మయి విషయం వారికి చెప్పింది. ఆస్పత్రికి వచ్చి ఆమెను ఆశీర్వదించమని కూడా వేడుకుంది. ఆ విషయాన్ని బ్రహ్మంజీకి గుర్తు చేస్తూ.

"కిరణ్మయి దగ్గరకి వెళ్లరూ? " అంది.

ఇక చర్చకు ఎలాంటి అవకాశం ఇవ్వకుండా బ్రహ్మంజీ కిరణ్మయిని పరామర్శించేందుకు ఆస్పత్రికి బయల్దేరారు. వారి బంధువులతోసహా అధికార యంత్రాంగం కూడా ఏనుగుల గుంపు వెంటే కదిలిపోతోంది!

అందరూ ఆస్పత్రికి చేరుకున్నారు.

కిరణ్మయి పడుకున్న మంచందగ్గరికి వెళ్ళి చిరునవ్వు నవ్వుతూ పలకరించేరు బ్రహ్మంజీ.

కిరణ్మయి కళ్ళు చెమ్మగిల్లేయి. ఏదో మానసిక వత్తిడితో ఉక్కిరిబిక్కిరైపోతోంది.

ఆమె పరిస్థితిని చూపులతోటే గ్రహించేరు బ్రహ్మంజీ. కళ్ళు మూసుకుని క్షణకాలం ధ్యానంలోకి వెళ్ళి ఆ పైన నెమ్మదిగా కళ్ళు తెరిచేరు. "నువ్వు త్వరగా కోలుకుని ఆనందమయమైన జీవితాన్ని పొందాలని ఆశిస్తున్నాను. నా ప్రార్థనను పరమదయామయుడైన ఆ పరమేశ్వరుడు తప్పక మన్నిస్తాడు" అన్నారు బ్రహ్మంజీ.

కిరణ్మయి పేలవంగా నవ్వి దూరంగా నించున్న గోపీకృష్ణమీదే చూపు నిలిపింది.

కిరణ్మయినే దీక్షగా చూస్తున్న మిథిలను బ్రహ్మంజీ దగ్గరకి పిల్చేడు.

మిథిల వెళ్ళి ఆయన ఎదురుగా నించుంది.

"మేము ఐహిక సుఖాలూ, బంధాలూ అన్నింటినీ త్యజించి పరిధిని విశ్వవ్యాప్తంగా విస్తృతం చేసుకుంటాం. అందువల్ల మేం ఎక్కడ వున్నా నాది అన్న ఆలోచన లేకుండా విశ్వంలో ఇమిడిపోతాం. కానీ మీరంతా అలా కాదు. అరిషడ్వర్గాలతో సతమతమౌతోంటారు. నాది అన్నది అందుబాట్లోకివస్తే ఆనందపడతారు. ఆ భావన మనసుమీద పనిచేస్తుంది. త్వరగా స్వస్థత చేకూరుస్తుంది. అందువల్ల నువ్వు తక్షణం ఎలాంటి సంకోచాలకూ ఆస్కారం యివ్వకుండా గుండె నిబ్బరం చేసుకుని కిరణ్మయిని నీ వెంట తీసుకుని వెళ్ళు. నీ ఆస్పత్రిలోనే వుంచి ఆమెకు వైద్యం చెయ్యి. అలా అయితే కిరణ్మయి త్వరగా కోలుకుంటుంది" అన్నారు బ్రహ్మంజీ.

మిథిల ఉలిక్కిపడింది! బ్రహ్మంజీ మాటల్లోని ఆంతర్యం ఆమెకు అంతుపట్టలేదు. ఒకవేళ కిరణ్మయి, గోపీకృష్ణల వ్యవహారం అతనికి తెలిసే అలా మాట్లాడేడా అన్న




సందేహం కూడా ఆమెకు కల్గింది.

ఆందోళనను నిగ్రహించుకుంటూ అలాగే నించుంది మిథిల.

బ్రహ్మంజీ ఆస్పత్రినించి పాదపూజల కోసం బయల్దేరేడు. వాకిట్లోనే పరాత్పరం ఎదురొచ్చి తననుతాను పరిచయం చేసుకున్నాడు.

పరాత్పరంతో తన బంధుత్వాన్ని అతడి నోటివెంటే విన్న బ్రహ్మంజీ నిర్వికారంగా చూశారు.

"స్వామీ! అసెంబ్లీ ఎన్నికల్లో పోటీచేస్తున్నాను. మానవబలం దైవబలంముందు ఏపాటిది కనుక! నన్ను మీరు ఆశీర్వదించాలి!" అంటూ అమాంతం స్వామివారి పాదాలమీద పడబోయేడు పరాత్పరం.

బ్రహ్మంజీ చిర్నవ్వు నవ్వేరు. "మీ అభిమతం నెరవేరుతుంది!" అని ముందుకు కదిలిపోయేరు.

స్వామివారి పాదాలు తాకే అవకాశం చిక్కినట్లే చిక్కి చెయ్యి జారి పోవటంతో పరాత్పరం అక్కసుపట్టలేక లోలోపలే మండిపడ్డాడు.

ఆ సాయంత్రం స్వామివారి ఆదేశం మేరకు అందరూ కలిసి కిరణ్మయిని మిథిల ఆస్పత్రికి తరలించేరు. అందుకు నిరాకరించే ధైర్యం చెయ్యలేకపోయింది మిథిల.

భువనేశ్వరీదేవి కూడా కిరణ్మయి వెంట మిథిల ఇంటికి వెళ్ళింది.

మార్కండేయులు, కాత్యాయిని కిరణ్మయిని మిథిల ఆస్పత్రికి చేర్చి తమ దారిన తాము వెళ్ళిపోయారు.

పరాత్పరం ఎన్నికల ప్రచారానికి వెళ్ళేడు.

కిరణ్మయిని అలా తరలించటానికి కారణభూతుడైన బ్రహ్మంజీకి మనసులోనే కృతజ్ఞతలు చెప్పుకున్నాడు గోపీకృష్ణ. అతని ఆనందానికి అంతేలేదు. గుండెమీంచి పెద్ద బరువు దించినట్లుంది. హాయిగా శ్వాస పీల్చుకున్నాడు.



మనసు బాగాలేక ఆరోజు మిథిల భోజనం చెయ్యలేదు.

రాత్రి పన్నెండు గంటలైంది.

మంచంమీద అటూ ఇటూ పొర్లి ఎంతకూ కునుకు పట్టక లేచి వెళ్ళి కిటికీ పక్కనే నిలబడి బయటికి చూస్తూ ఆలోచిస్తూంది మిథిల.

ఆకాశంలో కారు మబ్బులవెనుక చంద్రుడు రేఖామాత్రంగా అస్పష్టంగా కనిపిస్తున్నాడు. అంతా చీకటిగా వుంది. నిశ్శబ్దంగానూ వుంది.

ఆ నీరవ నిశ్శబ్దంలో అంతర్గహాల్లో ఎక్కడో చిక్కుబడిపోయినట్లుగా మనసును వేపుకుని తింటోన్న ఒంటరితనం ఆమెను వేధిస్తోంది. ఆ చీకటీ, ఒంటరితనం ఆమె గుండె గాయాన్ని జ్ఞాపకాల ములుకులతో పొడిచి రేపుతూ గుండె మంటలకు ఆజ్యం పోస్తున్నట్లున్నాయి.

తనతోడిదే లోకమంటూ ఆరాధించిన గోపీకృష్ణ ఇప్పుడెంతగా మారిపోయాడు!

చెల్లాయితో 'అనుబంధం' అనే ఓ చిన్న సెంటిమెంటుకు యిప్పుడు తలవొగ్గితే జీవితం తనకు మిగిల్చేది విషాదమే. కిరణ్మయి గోపీకృష్ణ జీవితంలోకిప్పుడు తనతో

పాటు సమానమైన హోదాలో ప్రవేశిస్తే తన బతుకు నరకం కావటం అనివార్యం. ఆ దుర్భర నరకాన్ని ఊహించుకుందుకే ఆమె మనసు ససేమిరా అంగీకరించటం లేదు. ఒక డాక్టరుగా ఇప్పటి గోపీకృష్ణ మానసిక పరిస్థితిని ఆమె అర్థంచేసుకుంది. అతడి జీవనయానంలో ఎంతో మానసిక సంఘర్షణ తర్వాత కిరణ్మయి యిప్పుడు అతనికి స్వంతమైతే ఇకపై అతనికి ఆమె తప్ప అన్యం పట్టదు. కిరణ్మయే తన ప్రపంచం అనుకుని ఆ పరిధిని దాటి క్షణం కూడా ఆలోచించడు!

కిరణ్మయి జ్ఞాపకాలు ఎంతోకాలంగా అతడి మనసు పొరల్లో నిక్షిప్తమై యిప్పుడు వెలికి తన్నుకుని వస్తున్నాయంటే అతడిక యావత్ప్రపంచం తన కళ్ళముందే భస్మమైనా పట్టించుకోడు కానీ, కిరణ్మయిని మాత్రం దూరం చేసుకోలేడు.

శకుంతలా దుష్యంతుల పునఃసంగమానికి మల్లేనే ఇదీను.

మిథిల వెక్కివెక్కి ఏడుస్తోంది. కోపంతో ఉడికిపోతోంది. ఆవేదన గుండెకు ఎగదట్టి బరువుగా శ్వాస పీలుస్తోంది. ఆ శ్వాస పాము బుసకుమల్లే వినిపిస్తోంది.

ద్వేషం, కసి, ఈర్ష్య, ఆవేదన, ఆవేశం, భయం కలగాపులగంగా మిథిలను ముట్టడించి క్షణక్షణానికీ మరింత దుర్భరంగా మార్తోన్న గుండెమంటతో తల్లడిల్లిపోతూ క్రమంగా ఉన్మాదంలోకి జారి, విచక్షణ కోల్పోయి, ఏ అజ్ఞాత శక్తో శాశించినట్టే అగ్నిగోళాల్లా మండుతోన్న కళ్ళను మరింత విప్పార్చి చూస్తూ, మనసులో వికృతంగా రూపుదిద్దుకున్న ఏదో ధ్యేయంతో ఆమె ముందుకు కదిలిపోతోంది మృత్యువుకు మల్లేనే!

ఇప్పుడు ఆమె మిథిల కాదేమో! ఏదో మంత్రశక్తితో విధ్వంసానికి శ్రీకారం చుట్టేందుకు లోహ గంటల గర్జారావాలతో కదిలిపోతోన్న విలయమో! ప్రళయమో!!

ఆమె మరబొమ్మలా కిందికి దిగింది. నేరుగా తన గదిలోకి వెళ్ళింది. ఏదో మందును సిరెంజిలోకి లోడ్ చేసుకుని కిరణ్మయి గదిలోకి వెళ్లింది. చుట్టూ చూసింది.

అందరూ నిద్రావస్థలో కనిపించేరు.

మరికొంచెం ముందుకు జరిగి చెల్లాయి ముఖంలోకి చూసింది.

ఆమెలోని మానవత్వపు దీపం కొడిగట్టి ఆరిపోతూ చివరిగా ఓ వెలుగు వెలిగిందేమో, సంశయిస్తూ క్షణం ఆగింది. యాదృచ్ఛికంగా తలెత్తి చూసింది.

చెక్క బల్లమీద గోపీకృష్ణ కనిపించేడు!

కసి కెరటం త్రుళ్ళిపడింది.

పళ్ళు పటపటా కొరికింది.

కిరణ్మయి చేతి నరంలోకి నీడిల్ను గుచ్చి పుష్ చేసింది.

"అక్కా..." పిల్చింది కిరణ్మయి నీరసంగా కళ్ళు తెరిచి.

"అక్కా" అన్న ఆ పిలుపులో ధ్వనించిన ఆర్ద్రతకు మిథిల చప్పున చల్లారిపోయింది!

ఉన్మాదంలోంచి తేరుకుని వాస్తవికతలోకి వొచ్చి చెల్లాయి ముఖంలోకి జాలిగా, దీనంగా చూస్తూ నించుంది నిర్ఘుండెపడ్డట్టు!

పుష్ చేసిన మందు కిరణ్మయి నరాల వెంట రక్తంతో కలిసి అంతే వేగంగా ఆమె శరీరంలోకి ప్రవహిస్తోంటే కొయ్యబారి చూస్తూ నించుంది మిథిల. ఇప్పుడు ఆమె వున్న మానసికస్థితిలో ఆ దారుణాన్ని ఉపసంహరించుకుని నిలువరించే రేఖా మాత్రమైన అవకాశం ఆమెకున్నా తప్పకుండా చెల్లాయిని కాపాడుకునేదే. కానీ అందుకు అవకాశం లేదు. చెయ్యిజారిపోయింది. ఆమె దేవతేం కాదు, డాక్టరు మాత్రమే!

కిరణ్మయి తల వాల్చేసింది.




ఎంతో ఆవేదనను పదిలపరచుకున్న ఆమె గుండె యిప్పుడు విశ్రాంతి తీసుకుంటోంది.

వేడిమి ఆమె శరీరం నించి చల్లగా జారుకుంటోంది.

కొద్దిక్షణాల తర్వాత మంత్రదండంతో తుడిచి రాయిని మనిషిని చేసినట్టు చలనం కల్గి "కిరణ్మయీ!..." అంటూ గావుకేక పెట్టింది మిథిల.

అది పిలుపో, అరుపో, ఆర్తనాదమో కానీ ఆ ధ్వని తరంగ తరంగాలుగా ఆస్పత్రి గోడల్ని తాకి ప్రతిధ్వనిస్తూ మరణమృదంగంలా వినిపిస్తూనే వుంది.

అందరూ నిద్రలేచేరు.

చూశారు.

జరిగింది తెలుసుకుని మంచంమీదికి దూకి, కిరణ్మయి తలను వొడిలో పెట్టుకుని ఆస్పత్రి పునాదులు కదిలేలా ఏడుస్తోంది భువనేశ్వరీదేవి.

ఎలా జరిగిందో ఊహించేడు కాబోలు గోపీకృష్ణ! దోషిని చూసినట్టు మిథిల కళ్ల లోకి సూటిగా చూస్తూ "మిథిలా! ఇకనన్నా ఆ సిరెంజిని దూరంగా పారేయ్..." అన్నాడు శాంతంగా.

అతడి శాంతానికి మిథిల అదిరిపడింది.

ఆది తుపానుముందు ఆవరించే ప్రశాంతతగాతోచి నిశ్శబ్దంగా ఏడుస్తూ అక్కడే కుప్ప కూలిపోయింది మిథిల.

★ ★ ★

కాలగమనంలో క్రమంగా కిరణ్మయి చితి మంటల్లో కాలిపోయిన విషాదం మాసిపోతోంది.

జీవితాన్ని గురించిన తన అంచానలన్నీ తారుమారై మిథిల బతుకులో చీకట్లు ముసురుకున్నాయి. ఏ గోపీకృష్ణ తనకు దూరం కాకూడదని ఆమె అమానుష కృత్యాల క్కూడా వెనుదీయలేదో ఆ గోపీకృష్ణే ఆమెను అసహ్యించుకున్నాడు. ఉద్యోగానికి రాజీనామా యిచ్చి ఇల్లు మర్చేపోయి ఎక్కడెక్కడో తిరుగుతోన్నాడు.

బేల్దారు మేస్త్రీ ఎవరో కలవాడి సమాధి కట్టేందుకు స్మశానానికి వెడితే అక్కడ గోపీకృష్ణ కనిపించేట్ట. ఆ విషయం అతను మిథిలకు చెప్పేడు.

"స్మశానంలో కనిపించాడా? " ఆశ్చర్యగా అడిగింది మిథిల.

"అవునమ్మా; నేనే స్వయంగా చూశాను" అన్నాడతను.

ఆమె మౌనం దాల్చింది. గోప్యంగా ఏడ్చింది.

చెల్లాయి చితి పేర్చి మంటల్లో కాల్చిన ఆ స్మశానం దగ్గరికి వెళ్ళేందుక్కానీ, గోపీకృష్ణను కలిసి ఇంటికి రమ్మని అడిగేందుక్కానీ ఎంతో సాహసం కావాలి. అలాంటి సాహసం మిథిలకు లేదు. కళ్ళముందు జరిగే ప్రతి సంఘటననూ అప్రమేయంగా తెరమీద కదిలే చిత్రాల్లా భావిస్తోంది. ఏదో తాత్వికతకూ, నిర్లిప్తతకూ లోనైపోయింది.

మిథిల ఆస్పత్రి విషయమే పట్టించుకోవటం లేదు. పేషంట్లు రావటంలేదు. నిన్న టిదాకా జనంతో కిటకిటలాడిన ఆస్పత్రి యిప్పుడు పాడుబడ్డ బంగళాకుమల్లే నిర్మానుష్యంగా కనిపిస్తోంది.

ఆ పరిణామాన్ని గురించి మిథిల అసలు పట్టించుకోలేదు. ఇప్పుడు ఆమెకు కావాల్సింది సిరిసంపదలు కాదు. కొంచెం మనశ్శాంతి.

అనుక్షణం ఆమె గుండెలో కలకవేస్తూ పుటం పెట్టి కాలుస్తోన్న తన పాపాల జ్ఞాపకాలనించి సాధ్యమైనంత దూరంగా తొలిగిపోయేందుకు ఆమె తంటాలు పడుతోంది. అది విఫలమై దేవుడ్ని ఆశ్రయించింది.

నిత్యం జపతపాలతో మనసునలా మరోవే పుకు మళ్ళించుకుని శాంతిని అన్వేషిస్తోంది

మిథిల అలా అయిపోతే, భువనేశ్వరీదేవి మరోలా మారిపోయింది. దశాబ్దాలుగా భగ వంతుడిమీద పెట్టుకున్న నమ్మకాలు, ఆచా రాలూ మొత్తం కిరణ్మయి మృతితో కుదుళ్ళ తోసహా కదిలిపోయాయి. నీరుకావి మడిబ ట్టలూ, ఉపవాసాలతో క్షీణించిన శుష్క దేహం తప్ప చివరకు మిగిలిందేమిటి? అన్న ఆలోచన కొచ్చింది.

కిరణ్మయితో నిర్దాక్షిణ్యంగా ఆడుకున్న విధి చివరికి ఆటమీద ముఖంమొత్తి పాశ వికంగా హింసించి మరీ క్రూరంగా తన పొట్టన పెట్టుకుంటే ఇన్నివేలమంది దేవుళ్ల చూస్తూ మిన్నకున్నారే తప్ప ఒక్కళ్ళయినా జాలితోనో, విశ్వాసంతోనో కిరణ్మయిని రక్షిం చారా!?

అంతటి పీఠాధిపతి, సజ్జనుడు, సత్యవ్ర తుడు, సాక్షాత్తు భగవంతుడి ప్రతిరూపమే అయిన బ్రహ్మాంజీ వచ్చి ఆమెను స్వయంగా దీవించి వెళ్ళేక కూడా ఆ దీవెనలను వమ్ము చేస్తూ ఒక సామాన్య స్త్రీ కిరణ్మయికి మృత్యువును ప్రసాదించిందంటే- భువనేశ్వ రీదేవి నమ్మకాలూ, విశ్వాసాలూ ఫెటేల్మని పేలిపోయి ఆమె ఆస్తికభావాలు దూదిపిం జల్లా గాల్లో కొట్టుకుపోవటంలో ఆశ్చర్యం ఏముంది కనుక!

తులసికోటకు వీపు ఆన్చిపెట్టి కూర్చుని వుంది భువనేశ్వరీదేవి. మార్కండేయులు ఆమెను విచిత్రంగా చూసి దగ్గరకొచ్చి కూర్చుని పలుకరించేడు.

భువనేశ్వరీదేవి ఆదోలా నవ్వింది.

"అబ్బాయ్ మార్కండేయా! దేవుడు లేడ్రా... ఇంతకాలం అతనున్నాడన్న మూఢ నమ్మకంతో విలువైన కాలాన్నంతా మడిబట్ట లకూ, ధూపదీప నైవేద్యాలకూ, జపతపా లకూ వృధాచేశాను. ఇప్పుడు తెలుసుకు న్నాను, నిజంగా దేవుళ్ళేడని" అంటూ కొడుకు ముఖంలోకి చూస్తూ, "జీవిత చర మాంకంలో నాలో ఇలాంటి మార్పు ఎలా వచ్చిందా? అని ఆశ్చర్యపోతున్నావా... జీవి తానుభవం నాకు అలాంటి పాఠం నేర్పింది. నా కళ్లకు కమ్ముకున్న పొరలు తొలగిపోయాయి" అని గుండెనిండా గాలిపీ ల్చుకుని వొదిలింది.

వంశపారంపర్యంగా వచ్చిన భ్రమల్లో నేనిప్పటిదాకా గడిపిన జీవితానికి నామీద నాకే జాలివేస్తోంది. ఆ దేవుళ్ళతో నాకిక నిమిత్తంలేదు. శేషజీవితాన్ని అనుభవాల అధ్యయనంతో గడుపుతాను..."

"అమ్మా! ఇదంతా ఎందుకుగానీ, నీ మన సుకు తోచినట్టు మసలుకో. నువ్వు దానికి మాత్రమే జవాబుదారివి!" అన్నాడు మార్కండేయులు తాత్వికంగా నవ్వుతూ.

భువనేశ్వరీదేవి తన గదిలోకి వెళ్ళిపో యింది.

మార్కండేయులు పుస్తకాలను ముందు వేసుకుని ఓ గంటసేపు వ్యాపారపరమైన లావాదేవీలు చూసుకుని యధావిధిగా తోటకు వెళ్ళేందుకు ఉద్యుక్తుడయ్యాడు.

నిత్యం వ్యాపార విషయాలూ, కౌలు విష యాలూ, పెట్టుబళ్ళ విషయాల్లో మార్కండే యులుతో మాట్లాడేందుకు రైతులెందరు వచ్చినా అందర్నీ సమాధానపరిచింతర్వాత ఉదయం, సాయంత్రం తోటకు వెళ్ళటం, చెట్లకూ, పూలమొక్కలకూ నీళ్లుపెట్టి, పాదులు తవ్వి కొత్త మొక్కలు నాటటం, కలుపు తియ్యటం అతడి దినచర్య! అతను ఆనందం పొందేది ఆ చర్యలోనే.

ఆ సమయంలోనే పిలిచింది కాత్యాయిని.

మార్కండేయులు ఆగి ఆమెవేపు ప్రశ్నార్థ కంగా చూశాడు.

"పద్మరాజుగారు ఉత్తరం రాశారు. పనుల వత్తిడిలోపడి దాని విషయమే మర్చేపో యాను" అంటూ కాత్యాయిని ఉత్తరం తెచ్చి మార్కండేయులికి ఇచ్చింది.

ఆ ఉత్తరాన్ని జేబులో పెట్టుకుని తోటకు





వెళ్ళాడు మార్కండేయులు.

గులాబిపొదల పక్కనే వున్న మల్లెపంది రికింద కూర్చుని తాపీగా ఉత్తరంతీసి చదువసాగాడు.

"మార్కండేయులుగారికి పద్మరాజు వ్రాయునది...

"కిరణ్మయి మరణవార్త నాకు చాలా బాధనిపించింది. నిజం చెప్పాలంటే ఆ దారుణ సంఘటన నన్ను బాగా కుదిపివేసింది. ఇంతకాలం అస్పష్టంగా వున్న నా భావాలకు స్పష్టమైన సమాధానం నాకు కిరణ్మయి మృత్యువు బోధపరిచిందంటే నేనెంతగా ఆ వార్తకు చలించిపోయానో వేరే వ్రాయాల్సిన అవసరం లేదనుకుంటాను.

మీ అమ్మగారు నిత్యం ఎంత నిష్ఠాగరిష్టంగా భగవంతుడ్ని ధ్యానిస్తారో నాకు తెలియంది కాదు. అలాంటి పుణ్యమూర్తికి కడుపుశోకమే మిగిలిందంటే ఏమనుకోవాలి.

మార్కండేయులుగారూ... అపర భగవంతుడూ, పుణ్యామూర్తీ అనే బ్రహ్మాంజీ కిరణ్మయిని ఆశీర్వదించింతర్వాత కూడా మృత్యువు ఆమెను కబళించివేసిందంటే ఎంత ఆలోచించినా నాకు భగవంతుడనేవాడున్నాడనేది అబద్ధంగానే అనిపిస్తోంది.

నేనిప్పుడు ఎలా మారినా నా మార్పువల్ల సమాజానికి ఒనగూడే ప్రయోజనం శూన్యమేనని నాకూ తెలుసు. మీకై మీరే నిబ్బరపడండి. ఆ ఆవేదననించి బయటపడి మీరంతా తిరిగి మామూలు స్థితికి రావాలని ఆశిస్తూ విరమిస్తాను.

ఇట్లు పద్మరాజు"

ఉత్తరం చదివి మార్కండేయులు చిరునవ్వు నవ్వేడు.

★ ★ ★

పరాత్పరం దశ తిరిగింది. ఎన్నికల్లో గెల్చేడు. శాసనసభ్యుడయ్యాడు. ఆ గ్రూపు శాసనసభ్యులంతా కలిసి అతడ్ని తన తరపున మంత్రివర్గంలోకి తీసుకునేలా చూశారు.

పరాత్పరం ఇప్పుడు కేబినెట్ మంత్రి అయ్యాడు.

మహర్దశకు చేరుకున్నాడు...

ప్రమాణ స్వీకారం చెయ్యగానే మంత్రి హోదాలో తొలిసారిగా తమ ఊరు వచ్చాడు పరాత్పరం.

కిరణ్మయి మృత్యువు వెనుక ఏదో మిష్టరీ వుందన్న అనుమానం పరాత్పరంకు లేకపోలేదు. అయినా అతను బయటపళ్ళేదు. ఎన్నికల్లో పోటీచేస్తూ పోలింగు కాకుండా పెద్దవాళ్ళతో పేచీపడితే గెలవటం కష్టమని భావించాడు. కానీ ఇప్పుడతనికి అధికారం వుంది. హోదా వుంది. అంగబలం వుంది. అర్థబలం సైగచేస్తే వచ్చిపడుతుంది.

అయినా పరాత్పరం ఆ విషయానికి అంతగా ప్రాముఖ్యత ఇవ్వలేదు. పోయిన మనిషి ఎటూ పోయింది. అందుకోసం ఇప్పుడు ఘర్షణపడితే పెద్దల సరసన తనకు వేసిన పీఠం ఆ పెద్దలే కూల్చివేస్తారన్న భయం అతనికి లేకపోలేదు.

కోపాన్ని మౌనంగా దిగమింగుకున్నాడు.

పరాత్పరం గెస్టుహౌస్‌లో దిగకుండా నేరుగా తన గుడిసె దగ్గరికి వెళ్ళాడు.

జిల్లా యంత్రాంగం, పత్రికా విలేకర్లూ, పురప్రముఖులూ అంతా అక్కడికి చేరుకున్నారు.

పత్రికా విలేకరుల సమావేశం మొదలైంది.

"మంత్రి హోదాలో వచ్చినా మీరు అందరిలా అధికార వసతిగృహంలో బస చెయ్యకుండా మీ గుడిసెకే వచ్చారంటే వింతగా వుంది" అన్నాడెవరో పత్రికా విలేకరి.

పరాత్పరం మందహాసం చేశాడు. "ఈ గుడిసెలే నాకు దేవాలయాలు. అనాదిగా మేమంతా పుట్టిపెరిగిందీ గుడిసెల్లోనే. ఈరోజేదో అధికారం వొచ్చిందని ఆ గుడిసెల్ని విస్మరిస్తే పాలిచ్చి పెంచిన కన్నతల్లిని విస్మరించినట్లే! అందుకే నేను నా గుడిసెకే వచ్చాను" చెప్పాడు పరాత్పరం.

"గుడిసెల్లో వుండే అట్టడుగు ప్రజలకు మీరు చేయనున్న సేవల్ని వివరిస్తారా? "

"గుడిసెలు మేడలు కావాలంటే వాళ్ళ స్వయంకృషివల్లనే సాధ్యపడుతుంది. వాళ్ళంతా విద్యావంతులు కావాలి. అంబేద్కర్ ఎవరు? ఓ సామాన్య కుటుంబం వాడే. ఎంతగా ఎదిగేడు? పెద్దల సరసన కూర్చుని భారతరాజ్యాంగం రాశారు. అలా అందరూ స్వయంకృషితో అభివృద్ధిలోకి రావాలి!"

"మీరేం చేస్తారన్నది మా ప్రశ్న"

"ప్రభుత్వం వాళ్ళకెన్నో రాయితీలిచ్చింది. సౌకర్యాలు సమకూర్చింది. ఉచితవిద్య, ఉద్యోగాలలో రిజర్వేషన్లు, వయోపరిమితిలో రాయితీ, బ్యాంకురుణాలు, గృహవసతి ఇంకా ఎన్నో పథకాలు చేపట్టింది. వాటి ప్రయోజనం పట్టుకుని వాళ్లే ముందుకు పోవాలి"

"మీరు 'మవ్యపోస' అధ్యక్షులుకదా, ఇప్పుడు కూడా అగ్రవర్ణాలకు వ్యతిరేకంగా పోరాటం కొనసాగిస్తారా? "

"పోరాటపు అనుభవాలతో ఇప్పుడు మేము కొత్త విధానాలు రూపొందించాం. ఇకపై మా పోరాటం కొన్ని పరిమితులకు లోబడి వుంటుంది"

"అదేంటో వివరంగా చెప్పండి"

"ఇకపై మా మవ్యపోసకు వర్ణపోరాటం వుండదు. ఎందుచేతనంటే చట్టసభల సీట్ల విషయంలో కూడా రిజర్వేషన్లున్నాయి. ఆ రిజర్వేషన్లవల్లే నేను ఉన్నత స్థానానికి చేరుకున్నాను. అన్ని వర్ణాలూ కలిసే రిజర్వేషన్లు కల్పించాయి కనుక ఈ దశలో వర్ణ పోరాటంవల్ల వొరిగేదేంలేదు. పైగా మాలాంటి వాళ్ళకు నష్టం కూడా సంభవించవచ్చు"

"ఇంతకూ మీరు వర్ణపోరాటానికి ప్రాముఖ్యత ఇస్తారా? వర్గపోరాటానికి ప్రాముఖ్యత ఇస్తారా? "

"చెప్పానుగా! ఆర్థికపరంగానూ, అధికారపరంగానూ బలపడితే వర్ణవివక్ష తనంతట తానే సమసిపోతుంది ఇప్పుడు మీరే చూస్తున్నారుగా. నేనెవర్ని? ఏ కులంవాడిని? మరి నా కోసం గుడిసెబయట పడిగాపులు కాస్తోన్న జిల్లా కలెక్టరు ఏ కులంవాడు? ఎస్.పి., జాయంటు కలెక్టరు, వీళ్ళే కులంవాళ్లు? ఇక వర్ణవివక్ష ఎక్కడుందో మీరే చెప్పండి. అందుచేత అట్టడుగు ప్రజలకు నా సందేశం ఏంటంటే, బాగా కష్టపడండి. బాగా పైకి రాండి. బాగా చదువుకోండి. బాగా సంపాదించండి. బాగా పదవుల్లోకి రాండి. అప్పుడు అందరూ అన్ని కులాలవాళ్లూ మీ కాళ్ళదగ్గరికే వస్తారు. ఇదిగో... పేపరోళ్లూ...! నా సందేశాన్ని మీరు బాగా రాయండేం? అని పరాత్పరం సమావేశం ముగించేడు.

"చివరిగా ఒక్కప్రశ్న. మీరు "మవ్యపోస' బాధ్యతల్ని ఎవరికి అప్పగిస్తారు? " అడిగేడో విలేకరి.

పరాత్పరం అతనివేపు అసహనంగా చూస్తూ "ఇకదాని అవసరం తీరిపోయింది. రద్దు చేసేస్తున్నాను" అన్నాడు.

విలేకర్లు వెళ్ళబోతోంటే వాళ్లను ఆపి "చివరిగా నాదొక్కమాట!" అన్నాడు పరాత్పరం.

విలేకర్లంతా అతనివేపు చూశారు.

"మరేంలేదు, నాకున్న యావదాస్తిని నా సాటివాళ్లకు పూచికపుల్లతోసహా ఇచ్చివేస్తున్నాను. ఇదే ఆదర్శంగా మంత్రులందరూ తమ తమ ఆస్తుల్ని పేదలకు పంచిపెట్టి నిస్వార్థంగా ప్రజాసేవ చెయ్యాలని కోరుతున్నాను" అని చెప్పాడు పరాత్పరం.

విలేకర్లంతా మంత్రిగారి ఉవాచల వార్త పత్రికలకు పంపేందుకు హడావుడిగా వెళ్ళిపోయారు.

పరాత్పరంతో మాట్లాడేందుకు అతని పల్లెవాళ్లూ, ఆ పక్కపల్లెవాళ్లూ రెండు జట్లుగా దూరంగా చెట్లకింద కూర్చొని ఎదురుచూస్తు





న్నారు.

పరాత్పరం పర్సనల్ సెక్రటరీని పిల్చేడు. మామనీ, భార్యనీ తన దగ్గరికి తీసుకుర మ్మని ఆదేశించాడు.

క్షణంలో వాళ్ళిద్దర్నీ మంత్రిముందు హాజ రుపెట్టాడు పర్సనల్ సెక్రెటరీ.

ఎస్తేరమ్మ పరాత్పరంవేపు అబ్బురంగా చూస్తోంది.

మంత్రి అయిన కొద్దిరోజులకే పరాత్పరం ఎంతగా మారిపోయాడో!

ఖరీదైన కొంగరెక్కల్లాంటి తెల్లటి దుస్తుల్లో నల్లగా నిగనిగా మెరిసిపోతు న్నాడు. కళ్లు కడిగిన వజ్రాల్లా, ముఖం అప్పుడే పాలీష్ పెట్టిన మాచర్ల నల్లరాతి పలకలా మెరిసిపోతున్నాయి.

భార్యను ఉడికించేందుకు కనీసం ఆమెవే పన్నా చూడకుండా మామను దగ్గరికి పిలిచి సరసనే కూర్చోబెట్టుకున్నాడు పరాత్పరం.

అతనూహించినట్లే ఆవిడ ముఖం పొద్దు వాలిన నల్లకలువకుమల్లే వాడిపోయింది.

ముసిముసిగా నవ్వుకున్నాడు. ఆ నవ్వు భార్య చూడకుండా జేబులోంచి కర్చీఫ్ తీసి ముఖానికి అడ్డం పెట్టుకుని 'మామా' అని ఆప్యాయంగా పిల్చేడు.

"ఏంటిది? " అడిగేడు ఆ మామగారు.

"నీకు తెలుసుగదే మామా, నేను మాట నిక్కచ్చి మనిషిని! నా యావదాస్తీ నా వాళ్ళకిస్తానంటే ఇచ్చితీర్తాను మరి. మావా! నువ్వా వయసుడిగిన మనిషివి. కాయకష్టం చెయ్యలేవు. నీకు బ్రతుకుతెరువు చూపించా ల్సిన బాధ్యత ప్రభుత్వానికుంది. అంటే నాకుందన్నమాట. నువ్వేం ఆలోచించ కుండా అమ్మవారి పేటు పట్టుకెళ్లు. ఇక నించి తాయిత్తులు నువ్వేకట్టు. ప్రశ్నలు నువ్వే చెప్పు. కడుపులో చల్ల కదలకుండా నీ జీవితం నిశ్చింతగా గడిచిపోతుంది" అన్నాడు పరాత్పరం.

మామ అతనివంక ఇబ్బందిగా చూశాడు.

"ఎందుకల్లుడూ ఇసుంటి మాట్లూ... సారా కొచ్చేనా, నీకులకొచ్చేనా? " అన్నాడు తిరస్కారంగా

"ఏం, అలా అంటావ్? "

"తాయిత్తులు గట్టుడూ, ప్రెస్నెలు జెప్పుడూ నాకు తెలవదుగదా..."

"అది బ్రహ్మవిద్యేం కాదు. ఎట్లా చెప్పాలో అంతా నీకు వివరిస్తానుగా మామా!" అని వ్యాపారపు మెళకువలన్నీ పూసగుచ్చినట్టు చెప్పాడు పరాత్పరం.

అప్పుడు ధైర్యం చిక్కిందతనికి. అమాంతం లేచివెళ్ళి అమ్మవారి పటాన్ని చేత్తో తీసుకుని కుంకుమ దులిపి తలగు డ్డలో చుట్టుకున్నాడు.

"ఎస్తేరూ..." అని పిల్చేడు పరాత్పరం.

లేడిపిల్లలా అతని దగ్గరికి దూకింది అతని భార్య.

"ఆ రెండు ఈతాకుల చాపలూ, బట్టలెట్టు కునే చెక్కపెట్టె, జర్మన్ సిల్వర్ గిన్నెలూ, బట్టలారేసుకునే ప్లాస్టిక్ వైరూ, పొయ్యికి పెట్టిన ఇటుకరాళ్లూ నీవే పట్టుకుపో... నా కులపోళ్లను కాదని కూడా అన్నీ నీకే ఇస్తు న్నాను. మనిషన్న తర్వాత కులసహనం ఉండాలి. గూడెపోళ్లను కొట్టుకుని చావద్దని నా మాటగా చెప్పు" అన్నాడు పరాత్పరం.

వినయంగా తలూపిందామె.

"జపాన్ తుమ్మకంప పట్టుకుపోవటం మర్చిపోకేం" చెప్పాడు పరాత్పరం.

మంత్రిగారి పర్యటన జయప్రదంగా ముగిసింది.

★ ★ ★

పరాత్పరంలాంటివాళ్లు అక్కడక్కడా కని పిస్తూనే వుంటారు.

అస్పృశ్యులుగా సంఘంచేత వెలివేయబడి దీనంగా, హేయంగా మురికికూపాల్లో బతు కుతూ ఆ జీవితంలోని చేదును మింగలేక మెదడుకు పదునుపెట్టి ఆలోచిస్తారు.

ఉన్నతస్థానం పొందాలన్న ఆకాంక్షతో వాళ్లూ లౌక్యం, దగా, మోసం అలవరుచు కుంటారు.

ఎదుటివాళ్ళ కష్టాలూ, కన్నీళ్లే పరాత్పరం లాంటివాళ్ళ పురోభివృద్ధికి ఉపకరణాలు.

అధికులకు అలా అగ్రపీఠం ఎందుకు చిక్కింది? అన్నదాంతో వాళ్ళకు ప్రమేయం వుండదు. ఆ అంశం జోలికి వాళ్లు వెళ్లరు.

రక్కసిపొదల్లా వ్యాపిస్తోన్న కులాలను చూపిస్తూ అట్టడుగువర్గాల బలంతో వాళ్లు అధికుల ప్రాపకం పొంది వాళ్ళ సరసన కూర్చునేందుకే వెంపర్లాడ్తారు తప్ప తమ వర్గప్రయోజనాలను పట్టించుకోరు.

అది వ్యవస్థ స్వభావం.

దాని ప్రభావానికి పరాత్పరం అతీతుడేం కాదు. అతనూ రక్కసి పొదల మాటున భద్రత ఆశించేవాడే? అందుకు అతడ్ని నిందించి ప్రయోజనం లేదు, జాలిపట్టం తప్ప!



గోపీకృష్ణ కొద్దికాలం అలా పిచ్చివాడిలా తిరిగి, చివరికి బ్రహ్మంజీ ఆశ్రమంలో చేరేట్ట! కరివేపాకు ఆ వార్త మోసుకొచ్చేడు.

"ఎవరు చెప్పారు? " అడిగేడు మార్కండేయులు.

"మిథిల!"

"ఆమె పరిస్థితి ఎలా వుంది? "

"ఆస్తులన్నీ అమ్మింది. ఆశ్రమం పెట్టి గమ్యం తెలియని అభాగినులకు ఆశ్రయం ఇచ్చి అందులోనే మనశ్శాంతి పొందుతోం దిట"

మార్కండేయులు గుంభనంగా నవ్వుకున్నాడు.

పరిశీలన, పరిశోధనా లేకుండా వంశపారంపర్యంగానో, పరిసరాల ప్రభావంవల్లనో ఏర్పడ్డ నమ్మకాలకు శాశ్వతంగా గిరిగీసుకుని అందులోనే ముడుచుకునే ఎవ్వరికైనా అనుభవాలు వెక్కిరించే రోజు ఒకటి రాకతప్పదు.

అనుభవాలు వెక్కిరించేక ఒకనాడు తాము నిర్ద్వంద్వంగా తిరస్కరించిందాన్నే నిర్భీతిగా సమర్థిస్తారు.

తామరాకుమీద నీటిబొట్టులా వుంటూ ఆవేదనకు గురై మనసును కష్టపెట్టకుండా నేర్పుగా జీవించటమే మార్కండేయులు ధ్యేయం. కృతకృత్యుడయ్యాడు కూడా!

తన దినవారి కృత్యాలను ముగించుకుని తోటకు వెడుతూ ఆగి, "కాత్యాయినీ! ఈరోజు నాకిష్టమైన వంటకం వండవూ? " అంటూ భార్య ముఖంలోకి నవ్వుతూ చూశాడు మార్కండేయులు.

"తమరు మామిడికాయలు కొన్నప్పుడే అర్థమైంది ఈరోజు పప్పొండమంటారని"

"అలాగే కొంచెం వడియాలు కూడా వేయించు"

"పూజ కాగానే..."

"అయితే నువ్వా పూజలో ఆనందం పొందు. ఈలోగా నేను తోటపని చేస్తూ నా ఆనందం నేను పొందుతాను" అని మార్కండేయులు వెళ్ళిపోయాడు.

అతడి ముఖంమీది దరహాసం చెదిరిన దాఖలాలు ఎప్పుడూ లేవు.

సూర్యుడికి మల్లేనే తన విధిని తాను నిర్వర్తించుకుని వెడుతోండటంలో ఎంత సున్నితమైన ఆనందం వుందోకదా!

★



# చెక్కతో బనీను

మనకు బనీనులా కనుపించే ఈవిడగారి షర్టును చెక్కతో తయారుచేయించుకుంది. ముడతలు పడే అవకాశం లేని ఈ షర్టు ఖరీదు మూడువేల రూపాయలు మాత్రమే.

# రచయితలకు మనవి



★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతురకతలు', 'చతుర ప్రవంచం'వంటి శీర్షికలు కాక కేవలం నవలమాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల నంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో 100 పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూనుకుని వంపవలని వుంటుంది.

★ ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూనుకుని, ఆమేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు నరిపోయేలా ప్లాన్‌చేనుకుని 'చతుర'కు అనుకూలంగా వుండేసైజులో వంపడం మంచిపద్ధతి.

★ అవిధంగా నవలలు 'చతుర'కు నరిపడా లేకపోయినట్లయితే అయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి వంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయిననందర్భాల్లో మా బాధ్యత వుండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పివంపడం జరుగుతుంది.

★ ప్రతి నవలకు అందజేసే రు: 3000/– పారితోషికం ఏనెల 'చతుర'లో ప్రచురిస్తే ఆనెల మొదటివారంలోనే వంపబడుతుంది.

ఎడిటర్:

# చతుర

'ఈనాడు' కాంపౌండ్ హైదరాబాద్-500 482.

# 'బాచీ' పై సమీక్షలు

**అక్టోబర్ 'చతుర'లో ప్రచురితమైన కోలపల్లి ఈశ్వర్ రచన 'బాచీ'పై మా కందిన ఉత్తమ సమీక్షలు.**

## ఆరోగ్యకర హాస్యం

*(ప్రథమ బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)*

పెద్దలు అనుభవంతో చెప్పిన సూత్రాలని సమయానుకూలంగా వాడుకొంటే మనిషి ప్రయోజనాన్ని పొందగలుగుతాడు. దానికి విరుద్ధంగా ఆ సూత్రాలని గుడ్డిగా నమ్ము కుంటే అవకాశాలని చేజార్చుకొంటాడు. ఇదే 'బాచీ' నవలద్వారా రచయిత చెప్పదల చుకున్న విషయంలా ఉంది. అయితే చిన్న విషయాన్నే తీసుకున్నా, నవలని ఆద్యంతం చదివించేలా చేయగలిగారు రచయిత. ఎవ్వ రినీ నొప్పించని సునిశిత హాస్యం అడుగడు గునా కనిపించే ఈ నవలలో మనకి ద్యోతక మయ్యే సత్యాలు వేరే ఉన్నాయి.

మామూలు డిగ్రీ పూర్తిచేసి ఉద్యోగం వే టలో పట్నానికి చేరుకుని, ఎవరి అండదండ లూ లేకుండా జీవితంలో విజయాన్ని సాధించాలనుకునే అమాయకులకు ప్రతినిధి లా కనిపించే కథానాయకుడు అక్కడ మంచి వాళ్లని కూడా చూసి ఆశ్చర్యపడతాడు. పట్టణ జీవన విధానాలని ఓ వైపు ఆకళింపు చేసుకుంటూనే, ఆశయాన్ని విడవకుండా ఓ పోరాటాన్నే కొనసాగిస్తాడు.

నిరుద్యోగులని తమ స్వప్రయోజనాల కోసం వాడుకునే వ్యాపారవేత్తల వ్యవహారశై లిని కూడా హాస్య ధోరణిలోనే ఎత్తి చూపడం గమనించదగిన విషయం. కాగా అతను పేరు కూడా తెలియని ఓ అమ్మాయి ప్రేమ లోపడి చివరకి ఆమెకి చేరువై తన మరో ఆశయాన్ని కూడా సఫలం చేసుకోవడం ఈ నవలలో రెండో భాగం అనుకోవచ్చు.

సమాజపోకడలని... ఒక సులభ హాస్య శైలిలో వివరిస్తూ, ఆత్మ విశ్వాసాన్ని అలవ ర్చుకోవడం ఎంత ముఖ్యమో కూడా చెప్పక నే చెప్పారు రచయిత.

నవల సందేశాత్మకతతోపాటు, హాస్యరస భరితంకూడా అయింది. శృతిమించనీయ కుండా, ఒక ఆరోగ్యకరమైన విధానంలో కథాగమనం సాగించడంలో కృతకృత్యుల య్యారు రచయిత.

-టి.సురేఖారాణి,
వరంగల్-506 002

## కాస్త కాలక్షేపం

*(ద్వితీయ బహుమతి రూ. 75/- పొందిన సమీక్ష)*

నూట యిరవై పేజీలు బోరుకొట్టించకుండా చదివించిన నవల అక్టోబరు చతుర నవల 'బాచీ'! నేటి మధ్యతరగతి బతుకులో కే వలం ఒక భాగం తీసుకుని, అదీ ఒక వ్యక్తి జీవితంలో ఒక ఛాదస్తానికి కుదించి, రాయ డంవల్ల యిది అతి తేలిగ్గా వుంది. శైలి సాఫీగానూ కథ పేనడం అతి సాధారణంగా నూ వుంది. జీవితంలో ఒక్క కోణమైనా బలంగా చిత్రించాలనే కోరిక లేనందువలన ఏ ఒక్క సన్నివేశం మనసుకు హత్తుకునేట్టు రాయలేకపోయారు రచయిత! నవల మొ త్తం 'హేపీగోలక్కీ' టైపుగా తయారై ఏ ముద్రావేయకుండా మురమొరాలు నమిలిన ట్టుగా వుంది.

బతుకు తెరువు ఎరిగిన గోకారికీ తాత గారి వుపదేశాన్నే ఆదర్శం చేసుకుని యిస్త్రీ దుస్తులకే తంటాలుపడ్డ బాచీకీ మధ్యగల తేడానూ, బతుకుపట్ల వారి అవగాహనల్లోని



అగాధాన్నీ ఈనాటి నేపథ్యంలో మరికొంత వివరంగా రాయగలిగితే నేటి జీవిత వాస్తవం మరింత నిజంగా, నిండుగా కనిపించేది. ఆ ధ్యాస ఎక్కడాలేదు. మాటిమాటికీ అంతరాత్మను బైటికీడ్చి, బాచీని, చదువరిని కూడా యిబ్బంది పెట్టవలసిన అవసరం ఏమొచ్చిందో బోధపడదు. ఈనాటి ఈజీ శైలిలో అదొక భాగం అయిపోయింది. హుషారైన హాస్యమో, కాస్త తక్కువ రకందే అయినా కామిక్కో, రైల్వే పోలీసు ఎపిసోడ్స్ వంటివి చొప్పించినా, కొంత నయంగా వుండేది.

అతి తక్కువ సేపే కనపడ్డా నవ్య ఒక్కతే కాస్త ప్రాణమున్న పాత్ర. తర్వాతి స్థానం గోకారిది. రాత్రికి రాత్రి నవ్య యింటికి వెళ్లి ఆమెను ఆస్పత్రికి రమ్మని గోకార్రి బతిమలాడిన సంఘటన ఒక్కటే కాస్త మనసుకు పట్టేది. మధ్యలో వచ్చిన రెండు మెరుపులు సౌభాగ్యలక్ష్మి, వరహాల్రాజులను కూడా అరకొరగానే వదిలేసేరు. కథను మలుపు తిప్పిన సన్నివేశాలు ఏవీ సహజంగా లేవని కొట్టి పారెయ్యలేంగాని, కథను ముందుకు నెట్టడంకోసం తెచ్చిపెట్టినట్టున్నాయి.

రెండు పరస్పర వ్యతిరేక సూక్తులు పట్టుకుని, కష్టపడకుండా కథపేని అలవోకగా చదివించే అవధాన క్రియని రచయిత అభినందనీయంగానే ముగించారని చెప్పుకోవచ్చు. కాలక్షేపానికి విసుక్కోకుండా చదువుకోవచ్చు.

-ఎన్.వేణుగోపాల్

మద్రాసు- 600 029

## ఎడారిలో ఒయాసిస్సు

(మూడవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)

ఆధునిక కాలంలో మనుషుల జీవితాల్లో 'యాంత్రికత' పేరుకుపోతున్న తరుణంలో 'బాచీ' నవల పాఠకులను కడుపుబ్బ నవ్వించింది. ఆర్థిక సంబంధాలు మిగిలిన అన్ని సంబంధాలను అధిగమించడంతో మనిషి జీవితంలో వేగం, ఒత్తిడి పెరిగాయి. దాంతో మానసిక జబ్బులు పుట్టగొడుగుల్లా పుట్టుకొచ్చాయి. అందుకే రోజువారీ జీవితంలో కాసేపు అయినా మనసింకా నవ్వుకోండి అని ప్రపంచవ్యాప్తంగా డాక్టర్లందరూ నెత్తీ నోరు బాదుకుంటున్న సమయంలో ఇటువంటి హాస్య రచనల ఆవశ్యకత ఎంతైనా ఉంది. మండుటెండ తర్వాత వేపచెట్టు నీడ మనసుకు ఎంత హాయినిస్తుందో సీరియస్ నవలల తర్వాత ఈ హాస్య నవల పాఠకులకు అంత రిలాక్స్‌నిచ్చింది.

ఈ నవలలోని అన్ని పాత్రలు సజీవమైనవే! సగటు మనసుల సహజ ప్రవర్తనలనే హాస్య సన్నివేశాలుగా మార్చడం బాగుంది! నవలా నాయకుడు భాస్కర్రావ్ అమాయకత్వం, నెమ్మది పాఠకులను ఆకట్టుకోవడమే కాకుండా నవ్విస్తాయి కూడా. భాస్కర్రావ్, వరహాల్రాజులు పరస్పర విరుద్ధ అభిప్రాయాలు, భాస్కర్రావ్ అంతరాత్మతో జరిపే సంభాషణ, నవ్యను ప్రేమించడంలో భాస్కర్రావ్ మనసులోని స్వచ్ఛత, అంకితభావం, ప్రేమను సఫలం చేసుకోవడానికి పడ్డపాట్లు నవలను చకచకా నడిపిస్తూ పాఠకులను రంజింపచేశాయి. ఉమ్మడి కుటుంబాలు పతనమైన తరువాత కుటుంబంలోని వ్యక్తులమధ్య హాస్యం కరువైపోతున్నది! అందుకని హాస్యాన్ని బతికించే బాధ్యత వెకిలిహాస్యపు సినిమారంగంపైగాక సాహిత్యరంగంపైనే పడింది. ఈ బాధ్యతను నిర్వర్తించడానికి చతుర ఇటువంటి హాస్య రచనలను మరిన్ని అందిస్తుందని ఆశిద్దాం.

-బి.శారద

మర్రిపల్లిగూడెం-505 102

## హాస్యాభినందనలు

(నాలుగవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)

నవరసాల్లో తలమానికమైన హాస్య రస ప్రధానంగా సాగిన నవల 'బాచీ' ఆద్యంతం వినోదమయంగా వుండి, పాఠకులకి ఒక

కామెడీ సిన్మా చూసిన అనుభూతిని మిగి ల్చింది.

సస్పెన్స్ థ్రిల్లర్, మషాలా నవలలు జనాల్ని పట్టి ఊపేసే ఈ తరుణంలో హాస్యం కథాంశంగా నవల వెలువడడం సాహితీ పిపాసులకు నిజంగా విందే.

కథ సాదాసీదాగ వున్నా, హీరో పాత్ర పోషణా, ఆయన చేసే విచిత్రమైన పనులూ పాఠకుణ్ణి కడుపుబ్బ నవ్విస్తాయి. ఈనాటి నవలల్లో వచ్చే హాస్యంకంటే ఈ నవలలోని హాస్యం ఆరోగ్యకరమైంది కానీ కథలో కొన్ని చోట్ల సంభాషణలు సాగదీసినట్లుండి, హాస్యాన్ని అపహాస్యం చేయకూడదని రచయిత కష్టపడినట్లు అనిపిస్తోంది. కథలో బిగువు లేకపోవడంవల్ల రచయిత శైలి, శిల్పం మీద ఎక్కువగా ఆధారపడ్డారు. దీనికంటే కథా వస్తువు ఎన్నికలోనే రచయిత ఇంకాస్త శ్రద్ధ చూపినట్లయితే ఈ రచన బాగా రక్తికట్టించి వుండేది.

రామేశ్వరి పాత్ర చాలా బావుంది. హీరో సబ్బులు అమ్మటం దగ్గర కడుపుబ్బ నవ్వొచ్చింది. నవలలో సెంటిమెంటుని కూడా పండించడంలో రచయిత పరిణితి ప్రదర్శించారు. రచయితకి మా హాస్యాభివందనాలు.

-డాక్టర్ కె.సుబ్బారావుచౌదరి
తణుకు-534 211

# అనుభవం ఒక వ్యక్తిగత అనుభూతి

*(ఆయిదవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

''అనుభవం అనేది వ్యక్తికి వ్యక్తికి మారుతుంటుంది. ఒక వ్యక్తియొక్క అనుభవాన్ని పూర్తిగా మరోవ్యక్తి ఆచరణలో పెడితే అనుకోని సమస్యలు ఎదుర్కోవలసి వస్తుంది. 'నిదానమే ప్రధానం', 'ఆలస్యం అమృతం విషం' లాంటి నానుడులు పెద్దలు అనుభవంతో చెప్పినా, ఏదో ఒక్కదానినే గుడ్డిగా అనుసరించకుండా సందర్భాన్నిబట్టి ఆచరణలోపెట్టాలి'' అనే మంచి సందేశాన్ని సుతిమెత్తని హాస్యంతో మేళవించి కోలపల్లి ఈశ్వర్‌గారు తన 'బాచీ' నవలద్వారా విశద పరిచారు.

ప్రేమించిన వాళ్లకుండాల్సింది నిజాయితీ, సంకల్పబలం, పట్టుదల, ధైర్యం, చొరవ కానీ మొహమాటం, ఊగిసలాట ధోరణి, భయం కావని అలావుంటే ఎదుర్కొనే అనర్థాలు, వ్యర్థమయ్యే విలువైన సమయం, జీవితంగూర్చి భాస్కర్రావు పాత్ర ద్వారా బహుచక్కగా తెలియజేశారు.

అనుబంధం, అభిమానం, ఆప్యాయతలను రక్త సంబంధాలకు అతీతంగా కూడా మంచితనం ద్వారా సంపాదించుకోవచ్చని బాచీ, రామేశ్వరి, గోకారి, వరహాల్రాజు, సౌభాగ్యలక్ష్మి, వెంకటలక్ష్మి పాత్రలద్వారా రచయిత నిజం చేశారు.

సేల్స్ రిప్రజెంటేటివ్‌గా బాచీపడే తిప్పలు, ప్రేమించిన అమ్మాయి అడ్రసు వెదికే వైనం, బట్టల షాపు ప్రహసనం పాతవే అయినా బాగా నవ్వు తెప్పించాయి.

నవ్య పాత్ర ప్రవేశించేంతవరకు కథ కాస్త నత్తనడక నడిచినట్లు అన్పిస్తుంది.

రైల్వేస్టేషన్‌లో సూట్‌కేసు దొంగతనం ప్రహసనం చదివితే బాచీలాంటి అమాయక వ్యక్తులు ఈ స్పీడ్ యుగంలో ఉన్నారంటే అతిశయోక్తే.

అక్కడ కూడా డైరెక్టుగా అర్థమయ్యే సీన్లకు కూడా వివరణ, అంతరాత్మతో సంభాషణ సీన్లు సాగదీసినట్లన్పిస్తుంది. ఇటువంటి చిరు లోపాలు మినహాయిస్తే మొత్తం మీద ఆద్యంతం హాస్యాన్ని పండిస్తూ చక్కని కథనంతో సందేశాత్మక ప్రేమకథను అందించిన రచయితకు, చతుర మాసపత్రికకు అభినందనలు.

-ప్రియతమ్ యస్సెల్
తిరుపతి-517 507



## సచిత్ర విచిత్రం

# తాళానందుడు



జర్మనీలోని మ్యూనిచ్ నగరానికి చెందిన మాంఫ్రెడ్ క్లోడా అనే ఈయన గత పధ్నాలుగేళ్లలో 2600 రకాల చిత్రవిచిత్రాకారాల తాళం కప్పుల్ని సేకరించాడు. ప్రస్తుతం ఈయన చూపుతున్నవి 11వ శతాబ్దపు రోమన్ తాళం. పూనాకు చెందిన 15వ శతాబ్దపు తాళంతోసహా భారతదేశంలో వివిధ కోటల గుమ్మాలకు ఉపయోగించిన 136 తాళాల్ని కూడా సేకరించాడీ తాళానందుడు.

# చతుర ప్రపంచం

## మొదటి అణు విస్ఫోటనం

ఆటంబాంబు గురించి ఈరోజు పసిపిల్లలకి కూడా తెలుసు. విజ్ఞానశాస్త్రాన్ని మానవ పురోగమనానికి ఉపయోగిస్తున్నారో లేదో గానీ, విధ్వంసంలో ఉపయోగించేందుకు మాత్రం ఉత్సాహంతో ముందడుగు వేస్తు




న్నారు. న్యూక్లియర్ ట్రాన్స్‌ఫార్మేషన్‌లో గాఢమైన శక్తి ఉద్భవిస్తుందని మొట్టమొదట కనిపెట్టిన సైంటిస్ట్ ఫ్రెడరిక్ జాలియట్ క్యూరీ. ఈ సిద్ధాంతాన్ని ఇంకా విపులంగా వృద్ధిపొందిస్తూ 1932లో జేమ్స్ చాడ్విక్ అనే శాస్త్రవేత్త న్యూట్రాన్ని కనుక్కొన్నాడు. న్యూట్రాన్ సహాయంతో అణువును విడగొట్టవచ్చు

1938లో ఒట్టోహాన్ అనే ఆయన యూరానియమ్ అణువును విడగొట్టాడు. నేచర్ మ్యాగజైన్‌లో ఈ ప్రయోగం వివరించబడింది. ఈ అణుశక్తికి సంబంధించిన ఉత్సుకత నెమ్మదినెమ్మదిగా ప్రపంచంలో చాలా దేశాలకి పాకింది. అందరూ తమ శాయశక్తులా అణుబాంబులను తయారు చేయడం ప్రారంభించారు. ఈ న్యూక్లియర్ క్లబ్‌లో అణ్వాయుధాలు ఎక్కువగా వున్న అమెరికా, రష్యా, బ్రిటన్, ఫ్రాన్స్, చైనా మొదలైన దేశాలు మెంబర్లయినారు. మొట్టమొదటి అణువిస్ఫోటనం 1945 జూలై 16న అమెరికా ప్రారంభించింది. 1949 ఆగస్ట్ 29న రష్యా తన మొట్టమొదటి అణుప్రయోగం నిర్వహించింది. 1945 ఆగస్ట్ 6న హిరోషిమాపై మొదటి అణువిస్ఫోటనం జరుపబడింది. దాన్ని యూరానియం-235 అంటారు. 1945 ఆగస్ట్ 9న రెండవ విస్ఫోటనం నాగసాకిపై జరిగింది. ఈ రెండు బాంబులు రెండు లక్షలమంది ప్రాణాలను



బలిగొని, సుమారు 4 లక్షల మందిని అంగ వికలుర్ని చేశాయి.

1952 అక్టోబర్ 2న తానొక ఆటం బాంబును తయారుచేశానని బ్రిటన్ ప్రకటించింది. 1960 అక్టోబర్ 13న ఫ్రాన్స్ అణుబాంబును విస్ఫోటనం చేసింది. 1964 అక్టోబర్ 16న చైనా ఆటంబాంబును పేల్చింది.

సౌత్ఆఫ్రికా, ఇస్రాయిల్, పాకిస్థాన్ మొదలైన దేశాలు కూడా బాంబులను తయారుచేసేశాయి.

పాకిస్థాన్‌లో ఇస్లామాబాద్‌కి దగ్గరగా కహులా న్యూక్లియర్ ఎనర్జీ సెంటరుంది. ఇండియన్ ఎయిర్‌క్రాఫ్ట్ ఇక్కడికి 5, 10 నిముషాలలో చేరుకునే దూరంలో వుంది. గట్టి రక్షణ చర్యలతో, భద్రతాదళాలు ఎప్పుడూ అప్రమత్తతతో గస్తీ తిరుగుతుంటాయి ఇక్కడ. ఆ చుట్టుపక్కలంతా సెర్చ్ లైట్, వాచ్‌టవర్స్ వుంటాయి.

వాహ్‌లో బాంబ్స్, మిస్సైల్స్ తయారు చేసే 'ఆర్మ్‌డిజైన్ సెంటర్' వుంది. ఇది కూడా ఇస్లామాబాద్‌కి దగ్గరే. లాహోర్‌లో యురానియం ప్యూరిఫికేషన్ సెంటర్ వుంది. అణుపరిశోధనలో యురానియం చాలా ప్రముఖ పాత్రవహించే మినరల్ ఛస్మాలో ఫ్యూయల్‌రాడ్ ప్లాంట్ వుంది. ఇక్కడ ఒక రియాక్టర్ కూడా పెట్టబడింది. అణు ఉత్పాదనల విషయంలో పాకిస్థాన్‌కి ఎంతో సాయం చేసిన ఫ్రెంచ్ ప్రభుత్వం పాకిస్థాన్ దానిని దుర్వినియోగం చేస్తున్నట్టు తెలుసుకుని 1979నుంచి పాకిస్థాన్‌నుంచి విడిపోయింది. కానీ అప్పటికే 95% సహాయాన్ని పాకిస్థాన్ కందించింది ఫ్రాన్సు. 1972లో కెనడా సహాయంతో కరాచీలో న్యూక్లియర్ పవర్ ప్లాంట్‌ను స్థాపించారు. ఇంటర్నేషనల్ ఏటమిక్ ఏజన్సీ వారు పాకిస్థాన్ అణుశక్తిని దుర్వినియోగం చేస్తోందన్న అనుమానాన్ని వ్యక్తపరిచారు.

## బిలియర్డ్స్ భవితవ్యం

మిగతా దేశాలతో పోలిస్తే బిలియర్డ్స్ ఆటలో ఇండియాదే పైచేయి అంటున్నారు పరిశీలకులు. గత రెండు దశాబ్దాలుగా ఇండియాలోని బిలియర్డ్స్ ఆటగాళ్ళు దేశ ప్రతిష్ఠను ఇనుమడింపచేస్తున్నారని చెప్పవచ్చు. 1952లో కలకత్తాలో 10వ వరల్డ్ బిలియర్డ్ పోటీని నిర్వహించారు. అందులో ఇంగ్లండుకు చెందిన లెస్లీడిఫ్రిల్డ్ ఆస్ట్రేలియాకు చెందిన రాబర్ట్ మార్షల్‌ని ఓడించాడు. 12వ ప్రపంచ బిలియర్డ్స్ పోటీల్లో ఇండియాకు చెందిన విల్సన్‌జోన్స్ ఇంగ్లండ్‌కు చెందిన లెస్లీడిఫ్రిల్డ్ ను ఓడించి దేశ గౌరవాన్ని ఇనుమడింప చేశాడు. వ్యక్తిగతంగా కూడా అది తనకు చాలా గర్వకారణంగా ఫీల్ అయ్యాడు. ఆటకి ఒక గంటన్నర ముందు కూడా అతడు లెస్లీకన్న 700 పాయింట్లు తక్కువలో వున్నాడు. అయినా జోన్స్ పట్టుదలగా ధైర్యంగా ఆడి 135 పాయింట్లు ఆధిక్యతతో లెస్లీని ఓడించాడు.

1962లో రాబర్ట్ మార్షల్ జోన్స్‌ని ఓడిస్తే తిరిగి 1964లో విల్సన్ జోన్స్ మళ్ళీ లెస్లీని ఓడించి ప్రపంచప్రఖ్యాతిగాంచాడు. ఇంకా కొంతకాలం ఆడగలిగి వుండి కూడా అతడు ఆటనుంచి వాలంటరీ రిటైర్‌మెంట్ తీసుకున్నాడు.

విల్సన్ జోన్స్ తరువాత మైఖేల్ పెరిరా భారతదేశ కీర్తి ప్రతిష్ఠలను అభివృద్ధి పథంలోకి పయనింప చేశాడు. 1977లో జరిగిన 21వ ప్రపంచ బిలియర్డ్స్ పోటీలలో మైఖేల్ మొదటిసారిగా ప్రపంచ ప్రఖ్యాత బిలియర్డ్స్ ఛాంపియన్‌గా బిరుదుపొందాడు. ఆ తరువాత అతడు వరుసగా 1981, 83లలో జరిగిన పోటీల్లో కూడా విజయాన్ని చేపట్టాడు. 1985 నుంచి మరింత మంది బిలియర్డ్స్








ఆటగాళ్ళు రంగప్రవేశం చేశారు.

నిజం చెప్పాలంటే బాబ్ మార్షల్, ఫ్రాంక్ ఎడ్వర్డ్స్, కెనార్లి మొదలైన వాళ్లకారణంగా ఇండియాలో బిలియర్డ్స్ ఆట అభివృద్ధిచెందింది. వీళ్ళని ఇండియాకు రప్పించి, ఇక్కడ పోటీలను నిర్వహింపచేసిన వాళ్ళలో బిలియర్డ్స్ ప్రియులు మేజర్ మహమ్మద్, విసాన్‌జీ ప్రముఖులు. 1938లో మొహమ్మద్ ఆస్ట్రేలియా వెళ్ళి బాబ్‌ను ఇండియాకు తీసుకువచ్చాడు. బాబ్ ఇండియాకు వచ్చి ఇక్కడ బిలియర్డ్స్ అభివృద్ధి చెందడానికి కృషిచేశాడు. అతని ఆటని ఆటలోని నేర్పుని మెచ్చుకోనివాళ్ళు లేరు.

ఇప్పుడు ఇండియాలో మంచి బిలియర్డ్స్ ఆటగాళ్ళున్నారు గానీ భవిష్యత్తులో ఈ ఆట అభివృద్ధి కుంటుపడవచ్చని కొంత మంది అభిప్రాయపడుతున్నారు. కారణం దాదాపు చాలామంది బిలియర్డ్స్ ఆటగాళ్ళు స్నూకర్ గేమ్‌ని ఇష్టపడుతున్నారు. రంగు రంగుల బంతులతో ఆడే ఈ ఆటని టెలివిజన్‌లో చూడ్డానికి చాలామంది ఇష్టపడుతున్నారు. అయినా బిలియర్డ్స్ తన స్థానాన్ని తాను నిలబెట్టుకోగలదని పరిశీలకులు అభిప్రాయపడుతున్నారు.

## సర్కస్ మ్యూజియం

ఆమధ్య అమెరికాలో కేవలం సర్కస్‌కి సంబంధించిన ఒక మ్యూజియం నెలకొల్పబడింది. సర్కస్ పుట్టుపూర్వోత్తరాలు, సమకాలీన సర్కస్ ప్రదర్శనలకి సంబంధించిన వింతలూ వగైరాలన్నీ సదరు మ్యూజియంలో ప్రదర్శించబడ్డాయి.

సామాన్యంగా అందరూ ఎప్పుడో ఒకప్పుడు, ఎక్కడో ఒకచోట జీవితంలో ఒక్కసారైనా సర్కస్ చూసినవాళ్లే అయ్యుంటారు. కానీ సర్కస్ పుట్టుక, చరిత్ర మాత్రం చాలా తక్కువ మందికి తెలుసు. అమెరికాలోని విస్‌కాన్సిన్ నగరంలో ఈ వినూత్న ప్రపంచ సర్కస్ మ్యూజియం పెట్టారు. అందులోకి అడుగు పెట్టగానే సింహగర్జనలు, ఏనుగుల ఘీంకారాలు, గుర్రాల సకిలింపులు... ఇవన్నీ వింటుంటే ఓ కొత్త ప్రపంచంలోకి ప్రవేశించినట్టుంటుంది.

1884లో అమెరికాకు చెందిన రింగ్లింగ్ బ్రదర్స్ ఆధునిక సర్కస్ పద్ధతులను ఆవిష్కరించారు. 90 అడుగుల ఎత్తున్న గుడారాలలో సర్కస్‌ను ప్రదర్శించేవారు. అప్పట్లో

ఓ అరబిక్ గుర్రం యొక్క మార్చ్‌పాస్ట్‌తో ప్రదర్శన ప్రారంభమయ్యేది.

ఈ సర్కస్ మ్యూజియంని 25 ఎకరాల వృత్తాకారమైన విశాలమైదానంలో అమర్చారు. గుర్రపు పిల్లలు రకరకాల ఫ్యాన్సీ డ్రస్సులతో గంతులేస్తూ ప్రతిరోజూ మ్యూజియం ప్రదర్శనకి సిద్ధమైనట్లు తెలియజేస్తాయి. మ్యూజియంలో సర్కస్‌కి సంబంధించిన జంతువుల్ని, వస్తువుల్ని తెచ్చే వేగన్లు 100 దాకా వున్నాయి. వాటిపై రంగురంగుల పెయింట్లు వేయబడి అవి దూరంనుంచి చక్కని రథాల్లా కనిపిస్తాయి. బ్రదర్స్ ప్రదర్శనలిచ్చే రోజుల్లో వారివద్ద కాలియోప్ అనే వాయిద్య పరికరం వుండేది. అది కూడా ఇక్కడ భద్రపరచబడింది. మ్యూజియంలో ప్రతిరోజూ ముందుగా ఈ వాయిద్యాన్ని వాయిస్తారు రింగ్లింగ్ సోదరుల బంధువులు. ఇదేకాక 60 సంవత్సరాలక్రితం సర్కసులలో ఉపయోగించిన ఎన్నో వాయిద్యాలను మ్యూజియంలో ప్రదర్శించారు. అప్పటి సర్కస్ ప్రకటనలకి చెందిన వాల్ పోస్టర్లు, ప్రమాదకర విన్యాసాలను ప్రదర్శిస్తుంటే తీసిన ఫొటోలను ఈ మ్యూజియంలో వుంచారు.




వీటి ఖరీదే సుమారు 2 కోట్లు వుంటుందని అంచనా.

ఈ మ్యూజియం యొక్క ప్రధానోద్దేశ్యం సర్కస్‌కి సంబంధించిన చారిత్రాత్మక వస్తువులను అద్భుతంగా, అందంగా, ఆకర్షణీయంగా ప్రదర్శించడం. ఇదే ప్రదేశంలో రింగ్లింగ్ సోదరులు 34 సంవత్సరాలపాటు సర్కస్ ప్రదర్శనలిచ్చారు. ఆ రోజుల్లో సర్కస్ ప్రారంభించేముందు దైవప్రార్థన వుండేది. సర్కస్ జంతువులకిగానీ, ప్రదర్శకులకుగానీ ఎలాంటి గాయాలూ తగలకూడదన్నది ఆ ప్రార్థన ఉద్దేశం. రింగ్లింగ్ ఎంతో నేర్పరులు కూడా ఈ ప్రమాదకర విన్యాసాల్లో అప్పుడప్పుడు మరణించిన విషయాలు ఈ ఫొటోలు చూస్తే అర్థమవుతుంది.

చిత్రకళ, చరిత్రకి సంబంధించిన పుస్తకాలు, సర్కస్ చరిత్ర అభివృద్ధికి సంబంధించిన పుస్తకాలు ఈ మ్యూజియంలో వున్నాయి. సర్కస్ ఆటపై ఎవరైనా పరిశోధన చేయదలిస్తే ఒక్కసారి ఈ మ్యూజియం సందర్శిస్తే చాలు అన్నారు, చూసిన వాళ్లు.

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad. Tel: 290328; Office Address: CHATURA Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel. Hyderabad: 318181, 399444; Madras: 8270434, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75291; Anantapur: 33777; Rajahmundry: 79170; Karimnagar: 83216; Suryapet: 21146; Guntur: 353942.

CHATURA Telugu Monthly Hyderabad-500 482 Regd. No. H/HD/402

# ఇలా చదవండిది, అలా తెలుసుకుంటారిక
# ఇకనుంచీ నీలిమందుని ఎందుకసలు వాడనేవాడరో అనే సంగతినిక !



సాధారణ 'బ్లూ' నీటిలో గడ్డలు కట్టడంతో మీ బట్టల పైన మొండి నీలి మరకలు పడతాయి.



విజ్ఞానికంగా రూపొందించిన, శక్తివంతమైన మైక్రో డిస్పర్షన్ ఫార్ములేషన్ కలిగిన 'ఉజాలా' నీటిలో అంతటా సమంగా కరిగిపోయి, మీ బట్టలకు ఇస్తుంది మిరుమిట్లు గొలిపే తెల్లదనం.

## కొత్త ఉజాలా ఫేబ్రిక్ వైట్‌నర్.
## మీ బట్టలకి మిరుమిట్లుగొలిపే తెల్లదనాన్నితెచ్చే మచ్చలేని మంచి ఉపాయం.

నీలిమందు మీ బట్టలపైన వారల మరకల మచ్చల ఆవశేషాల్ని వదిలిపెడుతుంది, అయినా అతి పురాతనమైన ఆ నీలిమందును కలకాలంగా వాడుతూనేవున్నారు జనం - కారణం, దానికి బదులుగా మరొకటి లేకపోవడం. అది పాతమాట, వచ్చేసింది యిప్పుడిక ఉజాలా - బట్టలకు తెల్లని తెలుపునిచ్చే శాస్త్రీయమైన ఫేబ్రిక్ వైట్‌నర్. దానోగం పదార్థాలతో, శాస్త్రీయమైన ప్రక్రియతో అబ్బింది దానికి ఆ లక్షణం.

<u>ఏ+ గల వైట్‌నర్ ఉజాలా</u>

అసలు ఏ+ ఎందుకని ? ఏంచేస్తుంది మీ బట్టలకి యిది ? మరి గమనించారా యిది - బట్టలని డిటర్జంట్‌తో ఉతికిన ప్రతిసారీ వాటి కళని పోగొట్టుకుంటాయి. నిజానికి డిటర్జంట్లు, మాసిన బట్టలలోని మురికిని మాత్రమే తీసివెయ్యగలవు కాని ఆ ప్రక్రియతో బట్టలు పాడైపోయినట్టు కనిపిస్తాయిక. మరి నీలిమందు, నీటిలో మొండి పదార్థాలను వదలటంతో అవి మీ బట్టలపైన వారల మరకల్ని వేస్తాయి. ఇక ఉజాలాలోగం 'మైక్రో డిస్పర్షన్ కేటలిస్ట్ ఏ+' నీటిలో సరిసమానంగా కరిగిపోయే, బట్టల పోగుపోగులోకీ తక్షణమే చొచ్చుకు పోయే, వాటికి మిరుమిట్లుగొలిపే తెల్లదనాన్నిచ్చే ఒకేఒక వైట్‌నర్. అదీ ఏ+ ప్రత్యేకత.

<u>మిరుమిట్లుగొలిపే తెల్లదనం - చూడండి ప్రత్యక్షంగా మీకు మీరే</u>

మరొక పనికొచ్చే కిటుకు - ఉజాలా, కేంద్రీకృతమైన గాఢతగల ద్రవం కావడంవలన, కొద్దిచుక్కలు వేస్తే చాలు యిది. పొదుపే పొదుపు. ఆ మిరుమిట్లుగొలిపే తెల్లదనపు అత్యుత్తమ ఫలితాలకోసం, పక్కన సూచించిన పద్ధతుల్ని అనుసరించండి. అనుభవంలోకి వస్తుందీ మీకే.

ఇక వారల మచ్చలువడే నీలిమందును ఎందుకు వాడాలి, పట్టుక్కూర్చో వాలిగనక ? ఉందిగదా తెల్లదనాన్నిచ్చే కిటుకు ఉజాలా, వుండిగదా అందుబాటులో ?

### నీలిమందుకన్న ఎంతో మరెంతో మెరుగు

**ఉజాలాని సరిగ్గా వాడటానికి అంచెలు అంచెలుగాగల పదతి**



1. ఉజాలా బాటిల్ లోపలి మూతకి సన్నని చిల్లు పొడవండి.



2. మీకు కావలసిందల్లా ఒక లీటరు నీటికి 4-6 చుక్కలు.



3. ఉతికిన బట్టల్ని నీటిలో ముంచి వుంచండి.



4. బట్టల్ని మెల్లిగా జాడించండి కొద్ది క్షణాల సేపు. వాటిని ఆరనివ్వండి.




**UJALA**

జ్యోతీ లేబరేటరీస్, బొంబాయి వారి నుంచి.

Situations/JL/22/96